

విజయ
మార్గశీర్షము

భారతి

సంపుటము 30
సంచిక 12

# సుహృద్యమున



శ్రీ దిగుమర్తి సీతారామస్వామి

[శంతనుపత్ని సత్యవతి—గతపతిక నష్టరాజన్యసంతాన జరాపరీత—ఒకనాటి మలినంజ మనకలలో—జీవిత సుఖదుఃఖ సమీక్షకు తలకొని మనసునకు కనులకు ప్రత్యక్షమైన కాళింది స్వీయజీవిత గానమునకు నైషధ్యశ్రుతికారిణి యగుట కాశ్చర్య పడుట సందర్భము.]

చీకటి యొక్కటే మదికి చేకొనగా దగియంతరం
తర వ్యాకృతి నే దవ్వులోఁగనని వస్తు వహో తెరయెత్తె యామున
శ్రీ కమనీయ సైకతపుసీమ యతీతమనోజ్ఞ జీవిత
స్వాకృతి నీ మనస్సున కొసంగు పిసాళితలంపు చెట్టుపల్.

ఇది విచిత్ర మీ జీవితమెల్ల యాము
నాంక దుర్లలితంబు—నిత్యావలోక
సుభమగు దీని చూచియు జూడనెట్లు
రమ్యసౌధగవాక్ష నీరవనిరీక్ష.

నరపతి కోరుట జనకుడు
నిరాకరించుటకు వగల నిండితి-ప్రజలం
దరు 'రాణి' యనెడు భాగ్యము
నురిగినదని - నేను పల్లె సుదతులమెత్తున్.

చిర భార్యా రహితుండగు
కురువిభు డియ్యేటి కెలన కూరిమి నన్నున్
దరిసింప తదీయాంతః
పురమున నన్నిలిపె నతని పుత్రుడు విధియై!

దీని కెరటాల కన్నెనై దోనె నడపు
కొనుచు తిరిగిన ప్రొద్దులు-ముని పరాశ
రుండు కనులందు తమకము నిండుకొనగ
ననునయించు టవెంతకగ్గని తలపులు.

రాణిగా నేడు శూన్య జరాభరంబు
మత్తనువునందు గౌరవింపంగబడెడు
నాకు మిగిలిన దేమి సంతానహీన
భవనమున ఘోరవైధవ్యపరతదక్క !

తరుణదశయందుకంటె వార్ధకమునందె
వలయు పతిసేవ సతులకు-అలతి పలక
రింపె ముదిమి ననంచి సుఖింపజేయు
నెంతకృతపుణ్యకగు నా యదృష్టరేఖ !

ఏనే మారితిగాని యీ యమున తా నేమాత్రమున్ మార కెం
తే నిత్యంబగు యౌవనంబున పతిం దేలించు కన్యాత్వ సౌ
ఖ్యానేహక్షణముల్ వధూకథలు మాన్యంబైన యేతత్తటా
స్థానిన్ చీకటిమ్రోడునై నిలతు చెంతన్ నీడకున్ నోచకన్.

ఈ కృతజ్ఞత మేల్కొల్పనేమి కొడుకు
కుర్ర ద్వైపాయనుడు నది కొమరుదాల్చి

శ్యామలుండుగ నొదవెఈసమయమందు
వాడు గన్పింపనెద గొల వాయు నేమొ!

మనసువిచ్చి చెప్పకొనదగ్గవారెవ్వ
రిందు యమునకంటె డెంద మింత
హాయినొంద దీని తోయములం దొక్క
సారి పడవ నడిపి యూరడిలుదు !

ముంచుకొనివచ్చు చీకటిముంపునందు
యమునలో నీదులాడిన యట్లు దలతు
నల్లకల్వల తావి కన్నను కళింద
తనయతలపులు బ్రదుకు నొడ్డునకు గెడపు

నల్లకల్వల తావి యనంగమేని
తావి కథదోచు - నీమది తనువునందు
చెడని యా సౌరభమ్మొక సేతువగుచు
కడచనినదాని నేటితో ముడికిదార్చు.

అవశత్వంబున 'రోజనా' యనుచు స్నేహార్ద్రింబుగాపిల్వ నే
ర్చువయఃప్రౌఢతపస్వి కంఠమదివించున్ నేడు కాళింది ధూ
ర్తవియద్ధోరణి - ఈసతీతనువు చేరంగూడ దాసైకత
ప్రవిశాలాంకము హార్మ్యపర్యటన కార్యప్రేక్షణ ప్రీతమై.

గౌరవ యుక్తమా బ్రదుకు గల్గెనుపో కురురాజ తత్సుత
స్ఫారవిధేయతాగరిమప్రాయము మాసిన ఈ తమస్సునం
దారి వెలుంగు గాదగిన ధన్యతమాత్రము సూర్యనందినీ
నీరవ భావతారకల నిల్పెగదా తుదిదాశకన్యకున్!



# అథర్వణ భారతము



శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

పూర్వ కవిరచితములగు మేలికబ్బము లెన్ని యెఱుక కందకయే కాలగర్భమునఁ గలసిపోయినవో మనము చెప్పఁజాలము. కాని సృష్టిలో మెల్లగా వానిలోఁ గొన్నింటి యునికి యైన మనకు లక్షణగ్రంథములనుబట్టియు, సంకలన గ్రంథములనుబట్టియుఁ గొంతకుఁ గొంత తెలియవచ్చుచుండుట సంతోషింపఁదగిన విషయము. అట్టివానిలో నథర్వణాచార్యుల భారతము పేర్కొనఁదగిన గ్రంథము.

అథర్వణాచార్యుఁడు పండ్రెండవ శతాబ్దాంతముననో లేక పదుమూఁడవ శతాబ్దాదినో జీవించియుండిన ప్రశస్త కవీశ్వరుఁడు. అహోబల పండితుఁ డీతనిని ద్వితీయాచార్యుఁడని పేర్కొనెను! త్రిలింగ శబ్దానుశాసనమనియు, వికృతివివేకమనియు సంస్కృతమున రెండాంధ్ర వ్యాకరణ గ్రంథము లీతని పేరఁ గానవచ్చుచున్నవి. ఈ రెండును నథర్వణుని పేర నితరులచేఁ గల్పింపఁబడినవే యని పరిశోధకుల యభిప్రాయము. 'శ్లేషే సభంగే నిర్బంధోఽర్కస్థానం కుత్రచిన్మతమ్' ఇత్యాది లక్షణము లుండుటనుబట్టి వారి యభిప్రాయము సమంజసమయినదే యని తోఁచుచున్నది. ఈతఁ డొక ఛందస్సునుగూడ రచించెను. అథర్వణచ్ఛందములోనిదిగా నీ క్రింది పద్యమును శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు తమ కుమారసంభవ పీఠికలోఁ బేర్కొనిరి.

క॥ మగణమ్ముఁ గదియ రగణము
వగవక కృతి మొదట నిలుపువానికి మరణం
బగు నిక్కముంద్రుఁడు మడియఁడే
యగునని యిది తొల్లి చెంకణాదిత్యుఁడనెన్.

కాని దీని ప్రామాణ్యమునుగూర్చి శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు శంకించుచున్నారు. 'మగణమ్ముఁ గదియ రగణము' అను నెత్తుగడతో నిట్టి పద్యమే యొకటి లక్షణ గ్రంథములందు శ్రీధరచ్ఛందమునందిదిగా నుదాహరింపఁబడెననియు, నథర్వణచ్ఛందస్సు తమకు లభింపలేదనియు వారు చెప్పుచున్నారు. వారు ప్రబంధరత్నావళి పీఠికలో నథర్వణాచార్యునిగూర్చి వ్రాయుచు నీ పద్యమును బేర్కొని 'వారు దీని నే దేని లక్షణగ్రంథమునుజూచి కైకొనిరో, యథర్వణఛందమును జూచియే కైకొనిరో చెప్పలేదు. ఇది యథర్వణునిదగు వాఁడాతఁడు నన్నిచోడనికంటెఁ దర్వాతివాఁడగును!' అని వ్రాసిరి.

అథర్వణాచార్యుల మఱియొక గ్రంథము భారతము. ఈతని భారతమునుండి పద్యములు పలువురు లాక్షణికులచేఁ దమ లక్షణగ్రంథములం దుదాహృతము లయినవి. ఆ యా యీ పద్యములగూర్చి తెలిసికొనుటకుఁ బూర్వ మీ యథర్వణ భారతమునుగూర్చి యింతకుఁ బూర్వము రచింపఁబడిన విషయములను దెలిసికొనుట యుక్తము. తమ యాంధ్ర కవుల చరిత్రమున నన్నయభట్టారకుని గూర్చి వ్రాయుచు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు అథర్వణుని గూర్చిన పుక్కిటికథ నొకదానిఁ బేర్కొని పిదప నిట్లు వ్రాయుచున్నారు.

"అథర్వణాచార్యకృతి మయిన వికృతి వివేకమును వ్యాకరణ కారికావళిని, నన్నయభట్ట విరచితమయిన యాంధ్రశబ్దచింతామణిని విమర్శించి మాఱుగా నథర్వణాచార్యుఁడు నన్నయభట్టునకుఁ దరువాతివాఁ డని యూహింపఁదగియున్నది. అయినను, ఈ యూహను వేఱువిధముగాఁ గూడ చేయవచ్చును. నన్నయభట్టారకుఁడు భారతము నారణ్యపర్వమువఱకును దెనిఁగించి కాలధర్మము నొందిన తరువాత తిక్కన సోమయాజి పూరింపఁ బూనుకొనక మునుపో, పూనుకొన్న సంగతి యెఱుఁగక మునుపో మిగిలిన భాగమును దా నాంధ్రీకరింపఁబూని విరాట పర్వమును మాత్రమే చేసి యథర్వణాచార్యుఁడు తక్కిన భాగమును ముగింపకయే లోకాంతర గతుఁడయి యుండవచ్చును."

పయి వాక్యములనుబట్టి యథర్వణాచార్యుఁడు భారతములోని విరాటపర్వమును మాత్రమే తెనిఁగించి లోకాంతర గతుఁడయినట్లు తెలియుచున్నది. కాని వారే యథర్వణాచార్యునిగూర్చి వ్రాయుచు

నాతని భారతమును గూర్చి వ్రాయు సందర్భమున నిట్లు వ్రాయుచున్నారు.

"నన్నయభట్టు ఆరణ్యపర్వమువఱకును తెనిఁగించిన తరువాత నే యాతఁడు భారత మాంధ్రీకరింపఁ బూనియుండనియెడల విరాటపర్వము మొదలుకొనియే తెలిఁగించుటకుఁ గారణ మేమియు నగపడదు. నన్నయ భట్టారకుఁడు తన గ్రంథ ప్రాశస్త్యమున కయి యథర్వణభారతమును కాల్చివేసె నన్నకథ యెంత మాత్రము విశ్వాసార్హమయినది కాదు. అథర్వణాచార్యుఁడు తిక్కన కాలములో ననఁగా ౧౨౬౦ సంవత్సర ప్రాంతములం దుండినవాఁడు.........

*　　*　　*

అథర్వణుఁ డాంధ్రమునందు తగిన పాండిత్యము గల సంస్కృత విద్వాంసుఁడైన జైనపండితుఁడు. ఇతఁడును తిక్కనసోమయాజియు నించుమించుగా నేక కాలమునందే నన్నయభట్టు విడిచిన భారత భాగమును దెనిఁగింప నారంభించి యుందురు. ఇతఁడు రెండు మూఁడు పర్వములను మాత్రమే తెలిఁగింపఁ గలిగెను. తిక్కన పదునేను పర్వములను జేసి ముగింపఁ గలిగెను. ఈతని కవిత్వము సంస్కృత సమాస భూయిష్ఠమయి సామాన్యులకు దురవగాహమయియుండెను. తిక్కనకవిత్వ మాంధ్ర పద భూయిష్ఠమయి బహుజన సుఖావగాహమయి యుండెను. ఈ హేతువుచేత నే తిక్కన భారతము సర్వజనాదరణ పాత్రమయి దేశమందంతటను వ్యాపింపఁగా నథర్వణ భారతము కతిపయ పండిత జనైకాదరణ పాత్రమయి సర్వజనీన వ్యాప్తిగాంచక యాంధ్ర దేశమున మృగ్యమయినది. అది యిప్పుడు కతిపయ పూర్వ లక్షణ గ్రంథములయం దుదాహరింపఁబడిన పద్యరూపమున జీవించియుండుటయే కాని సంపూర్ణ పుస్తకరూపమున నెందును గానఁబడక నామమాత్రావశిష్టమయి యున్నది.

*　　*　　*　　*

ఈకవి రచియించిన తెలుఁగు భారత మిప్పటికి మాకు దొరకనందున కవితంశాదులనుగూర్చి యేమియుఁ జెప్పఁజాలము. లక్షణగ్రంథములం దుదాహరింపఁ బడిన పద్యములనుబట్టి చూడఁగా నితఁడు విరాటోద్యోగ భీష్మ పర్వములను రచించినట్లును, కవిత్వము రసవంతమయి సంస్కృత పద బహుళముగా నుండునట్లును తెలియవచ్చుచున్నది."

తొలుత విరాటపర్వమును మాత్రమే యథర్వణుఁడు తెలిఁగించెనన్న వీరేశలింగము పంతులుగారు పయివాక్యములలో నాతఁడు విరాటపర్వమును మాత్రమే గాక యుద్యోగ భీష్మపర్వములనుగూడఁ దెలిఁగించె నని తెలుపుచున్నారు. ఈ నిర్ణయములు పరస్పరవిరుద్ధములు గా నేయున్నను లక్షణ గ్రంథముల ప్రమాణముతో నిర్ణయింపఁబడిన రెండవ నిర్ణయము కొంతవఱకు యుక్తియుక్తముగాను, సమంజసముగాను నున్నదనుటలో సందేహము లేదు. కాని యిటీవలి పరిశోధనమువలన నీ రెండవ నిర్ణయమును గూడఁ గొంతవఱకు సవరించుకొనవలసిన యవసర మేర్పడి యున్నది. అది యెట్లో తెలిసికొనుటకుఁ బూర్వము అథర్వణ భారతములోనివిగా లక్షణగ్రంథములయం దుదాహరింపబడి నేటిదాక నుపలబ్ధములగుచున్న పద్యములను జేర్కొనుట యుక్తము కాక పోదు.

*1* అప్పకవీయమున నథర్వణాచార్యుల భారతమునుండి యుదాహరింపబడిన పద్యములు—

యుష్మదస్మచ్ఛబ్ద యతులు—
అథర్వణాచార్యుల విరాటపర్వమునందు .—

"ధర్మతనయ! యుష్మదాజ్ఞా నిగళవిని
బద్ధమగుచు జిక్కువడియె గాక
విజయ మత్త గజము విడివడ్డచో నష్ట
పాటు గలదె విప్రపత్రయమున."

(౩ ఆ 124 ప)

నిత్యసమాసవిశ్రాంతులలో వనౌకశ్శబ్దమునకు—
అథర్వణాచార్యుల విరాటపర్వమునందు—

"శ్రీకంఠు నెదురునపుడు వ
నౌకోధ్వజ మింద్రమకుట మర్దన తురగా
నీకము దివ్య శతాంగము
నాకవ్వడి కబ్బియున్న నతి హేమగునో."

(౩ ఆ 141 ప)

వ॥ దానియందె.

"ఆకర్ణ దురాలాపము
లాకర్ణింపఁగ నసహ్యమై ద్రోణునితో
నాకనదీసుతుఁ డనియె వ
నౌకోధ్వజ మెఱుఁగవచ్చు నరుఁజూపి తగన్."

(౩ ఆ. ౧౮౨ ప.)

టవర్గ చతుర్థంబునకు అథర్వణాచార్యుల విరాట పర్వమునందు.

"ఢాంఢమిత భేరికాధ్వానముం ధూలీని
నాదమును మిన్నుముట్ట ననారతంబు

పెక్కు గంధర్వపతులు వర్తిక్కులందుఁ
గాచు సౌగంధికంబుఁ దేఁ గలరె యొరులు."
(౫ ఆ. ౧౫౪ ప.)

*II* ఆనంద రంగరాట్ఛందమున నధర్వణ భారతములోనివిగా నుదాహరింపఁబడిన పద్యములు—

అభేద ప్రాసమునకు—

అధర్వణాచార్యులు భారతమున—

"తాలాంకు తుములసమర
క్రీడకుఁ దాళఁగలవాఁడు క్షితిలోపల నె
వ్వాఁడును లేఁడని యుండకు
నీ దగ్గఱ నున్నవాఁడె నే సెలవిమ్మా!

ఋ యతికి—

అధర్వణ భారతమున—

* తృష్టాతంతు నిబద్ధబుద్ధు
లగురాధేయాదులం గూడి శ్రీ
కృష్ణుం గేవల మర్త్యుఁగాఁ
దలఁచి మర్దింపంగ నుత్సాహ వ
ర్ధిష్ణుం డయ్యె సుయోధనుం
డకట! ధాత్రీనాథ! యూహింపుమా
యుష్ణీషంబునఁ గట్టవచ్చునె
మదవ్యాధోగ్రశుండాలమున్.

*III* సర్వలక్షణసారసంగ్రహమునఁ గూచిమంచి తిమ్మకవిచే నధర్వణభారతములోనిదిగా నుదాహరింపఁబడిన పద్యము—

"పదిదినము లైదు ప్రొద్దులు
పదఁపడి రెణ్ణాళ్ళు నొక్క పగలున్ రేయున్
గదనంబు జేసి మడిసిరి
నది సుత గురుకర్ణశల్య నాగపురీశుల్—

ఈపద్య మల్పభేదముతో నన్నయభట్టారకుని యాదిపర్వమునందును గానబడుచున్నది. కాని యీ యర్థమే వచ్చెడి యీ క్రిందిపద్యము దానిపయి నే యున్నది గాన నిది యధర్వణ భారతములోనిదే యయి యుండవచ్చును.

తరలము—

"పది దినంబులు భీష్ముఁ డాహవభారకుండు గురుండు పం
చ దివసంబులు గర్ణుడుం దివసద్వయంబు దినార్ధ మం
దుదితతేజుఁడు శల్యు డత్యధికోగ్ర వీరగదారణం
బది దినార్ధము గాఁగ నిట్లు మహాభయంకర వృత్తితోన్."

*IV* ప్రబంధరత్నావళియం దధర్వణాచార్యుల భారతములోనివిగా నుదాహృతము లయిన పద్యములు—

† "తృష్టాతంతు నిబద్ధబుద్ధు లగు రాధేయాదులం గూడి శ్రీ
కృష్ణుం గేవల మర్త్యుగా దలచి మర్దింపంగ నుత్సాహవ
ర్ధిష్ణుం డయ్యె సుయోధనుం డకట! ధాత్రీనాథ! యూహింపుమా
యుష్ణీషంబుగ గట్టవచ్చునె మదవ్యాధోగ్ర శుండాలమున్."

"నతనానావనినాథయూథ మకుట న్యస్తాబ్జరాగోజ్జ్వల
ద్ద్యుతి విభ్రాజిత పాదపీఠు లలనా దోశ్చామరోద్ధూత మా
రుత లోలాలివినీలకుంతలు బ్రభారుగ్ధామ గేయూర శో
భిత బాహాపరిఘున్ సువర్ణ ధరణీభృద్ధైర్యు దుర్యోధనున్."

"ప్రణతాశేష వసుంధరాధిప శిరస్స్రగ్గంధ లుబ్ధ భ్రమ
త్క్వణ దభ్రభ్రమ కృద్ద్విరేఫగణ ఝంకారప్రదాబద్ధ సం
ప్రణవత్యుత్ప్రిథిత ప్రవర్ధిత సమస్త క్షత్రియాయాధ్వర
క్షణ సింహాసనభాసితున్ దృఢఘను శ్లాఘానుజున్ ధర్మజున్."

"రాజమండల పూర్ణ రాజమండల వీథి
రత్న గర్భామల రత్నగర్భ
గంధర్వ గంధర్వ గంధర్వ నగరంబు
నాగపున్నాగ పున్నాగవనము
మార్గణ మార్గణ మార్గణపీఠ ము
త్తుంగ భుజంగ భుజంగభూమి
కాంతికాంతారాతి కాంత కుంతిస్థలి
వీరకుమార కుమార సరసి
యన [illegible] కెక్కు నలకాపురంబు దే
వేంద్రుపురము దానవేంద్రు పురము
శ్రేణి సేయు లలితశోణాంశు మణిబద్ధ
గోపురంబు హస్తినాపురంబు."

* కవిచింతామణియందు వెల్లంకి తాతంభట్టుచే గూడ నిది యుదాహృతము.

† ఇది లక్షణ గ్రంథములలో నుదాహృతమే.

V క్రీడాభిరామమున నథర్వణాచార్యుని విరాటపర్వమునందలిదిగా నీ క్రింది పద్యము శ్రీమాన వల్లి రామకృష్ణ కవిగారిచే నుదాహరింపబడినది.

'అంబరసీమ దారలు జటాటవి మల్లెవిరుల్ [illegible] భుజాంతరా
ళంబున హారసంతతు లిలాస్థలి బూవులవర్షముల్ ప్రసూ
నంబులు సత్కృతాంజలి ననం దగి మౌక్తికతుల్య [illegible]
గాంబుకణంబు లుట్టిపడ నాడెడు శంభుడు మిమ్ము బ్రోవుతన్."

అంతే యథోల్లాపికలో నిట్లు కలదు. "మాకు దొరకిన ప్రతిలో నాందిపద్యములు లేవు గావున జదువువారలకొఱకు మొదటిపద్యమును అథర్వణుని భారతవిరాటపర్వమున మొదటి యాశ్వాసము నుండియు, రెండవపద్యము జిమ్మపూడి యమరేశ్వరుని విక్రమసేనమున ప్రథమాశ్వాసమునుండియు గ్రహించి యిందు జొందుపఱిచితిమి. తక్కిన గ్రంథభాగమున లేఖకదోషములు తక్క మాకరకొలల మెక్కుడను జూపబడలేదని యార్యులు విశ్వసింతురు గాక"—

అథర్వణాచార్యుడు జైనుడు. శివస్తుతిగానున్న యీపద్య మతని విరాటపర్వమునందలి ప్రథమాశ్వాసములోనిదయి యుండుననుట విశ్వాసార్హము కాదు. అదియుగాక యీ పద్యమే దామరాజు సోమయ 'భరతి' మందలిదిగా ప్రబంధరత్నావళియం దుదాహరింపబడి యుండుట చూడగా బయి యూహ సమంజస మనియే తోపగలదు.

VI. ఆంధ్రకౌముదిలో మంచి లక్ష్మీనృసింహ కవిచే నథర్వణాచార్యుల భారతములోనివిగా నుదాహృతము లయిన పద్యములు.

రేఫ ఱకారయో రుదాహరణాని—

"కురుపతి రవిసుతుని సుర
ద్గరత్న భూషణతతుల నుఱక బహుమతి జే
సి రథసము మీఱ సేనల
కు రాజు గావించె సమరకుశలుం డగుటన్."

ఱకారస్య—

"తఱుచైన కురుబలంబుల
మఱపించుచు గడిమి మెఱయు మాఱే మసగిన
ట్లాత్మమఱి చెడంగుగ దొని
కఱువలి కొడుకండు నుఱుము గావించె వడిన్."

"గురుభీష్మ కర్ణగాంధా
రరాజ భూరిశ్రవులు దొరకు దోడ్పడి గ్ర
చ్చర కవ్వడి మార్కొని ని
బ్బరముగ నటు సురిసి రంపవానలు కడిమిన్."

పద్యాదే ర్విభాషా - పద్యాద్య తత్సమాసాద్య యకారస్య వా లోప స్స్యాత్.

అథర్వణ భారతే కీచకవాక్యం—

"యిక నొకసారి పల్కిన ఘనీలని చిందునొ నోటి ముత్యముల్
వికచసరోరుహాక్షి వినవే యను మన్ననచేసి కావుమీ
యకట! మనోభవాసుగచయంబుల నా తనువెల్ల నొచ్చె నా
యె కరుణ నూచి యేలుకొనుమీ కినుకిప్పుడు సేయ నేటికే?"

పునశ్చ అథర్వణభారతే—ఆరణ్యపర్వణి.

"వరధౌమ్యాచార్య పుర
స్సరులై స్వాధ్యాయ హోమ జప తత్పరులై
యరువదివేల సవులు ధ
ర్మరాజముఖ యరుతి జని రరణ్యంబునకున్."

అథర్వణ భారతే— ఆదిపర్వణి — అజగర నహుష వాక్యం—

"నే నిదిగొ మత్కులోద్భవుడైన జనుని
పట్టి పారుడిశాపంబు వాసి తింక
స్వర్గమున కేగవ(ను) మీకు సుఖము జెంది
యుండు మీను మ విమానము నెక్కింతగయ వే?"(?)

నావి యెక్కి—అథర్వణభారతే — ఆరణ్య పర్వణి—

"నయ మార రాఘవుడు నా
వి యెక్కి వడి దాటె జాహ్నవీశైవలినిన్
జయ జయ యని వినువీథుల
వియచ్చరులు సన్నుతింప వేడుకతోడన్."

అపి చ అథర్వణ భారతే సంజయ ధృతరాష్ట్ర సంవాదే—

"అరయగ వారెల్లరు ప్రబ
లురు గావున వారితో విరోధము మన కే
ల రవ యిడగ సంధికి బం
పు రాద బెబ్బులి నుఱేను బోయి మఱలెదన్."

ఇతి ద.

VII తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యా పరిశోధనాలయ గ్రంథభాండాగారమునం

దాకారాక భారత ప్రతిలో (సంఖ్య 580) సభాపర్వ మున నన్నయ్యాచార్యుల భారతమునందలి పద్యముగా నీ క్రింది పద్యము వ్రాయబడియున్నది.

* "తడిసిన పచ్చని తడికొంతులకు దోడు
తొడల క్రొమ్మెఱుగులు తోడు నూప
గురులవంకలు దీర్చి కురియూవార్చిందువుల్
చనుదోయి కొకవింత సరసు గాఁగ
బొది జాతియున్న క్రొన్నవ చక్కనొత్తుతో
దోగ్మాలకొంతులు తొంగలింపఁ
గజ్జలరేఖలు కరఁగిన తెలికన్ను
లంభోజదళకాంతి నపహసింప
రాజసూయావభృథమునఁ దేజరిల్లు
ద్రుపదరాజ తనూజాత విపులజఘన
తిలముఁ గనుగొని రాజకాంతాజనముల
మనము లాపోవమిని మగమనములయ్యె.

అధర్వణాచార్యుల భారతమునందలివిగా లక్షణ గ్రంథములయందును, సంకలనగ్రంథములందును, వింక నితరస్థలములను నేఁటిదాఁక నుపలబ్ధము లగుచున్న యిరువదిపద్యములును బయి నొసఁగఁబడినవి. ఈ యిరు వది పద్యములును నేయే పర్వములకుఁ జెందినవగునో తెలిసికొనుట యుక్తము. దానిఁబట్టి యధర్వణుఁడు భారతమునం దేయేపర్వములను దలిఁగించెనో మన మొకవిధముగా నూహించుటకు నవకాశ మేర్పడును.

ఆదిపర్వము — † నేనిదగొ మత్కుల్యోద్భవు...?

సభాపర్వము — ప్రణత శేష .....
తడిసిన పచ్చని తడికొంతులకు...

అరణ్యపర్వము — వరధౌమ్యాచార్య పురస్సరులై...
నయమార రాఘవుఁడు వాలి
యొక్క......

విరాటపర్వము — ధర్మతనయా! యుష్మదాజ్ఞానిగళ
వినిబద్ధ......
శ్రీకంఠు డెదురునపుడు......
ఆకర్ణ దురాలాపము ..
ఘాంఘమిత భేరికా ధ్వానముం ..
ఇక నొకసారి పల్కవొ......
గురుభీష్మ కర్ణ గాంధార......
అంబరసీమ దారలు ?

ఉద్యోగపర్వము — తృష్ణాతంతు నిబద్ధ బుద్ధులకు...
నతనానావనినాథయూధ...
అరయగ వారెల్లరు ప్రబలురు
తాఁగంకు తుముల సమర......
రాజమండల పూర్ణ రాజమండల...

భీష్మపర్వము — పది దినము లైదు ప్రొద్దులు...

ద్రోణపర్వము —

కర్ణపర్వము — కురుపతి రవిసుతుని సువర్ణ...

శల్యపర్వము — తఱుచైన కురుబలంబుల...

నేటిదాక నుపలబ్ధము లగుచున్న యధర్వణ భారతమునందలి పద్యములను బర్వానుసారముగా విభ జింపగా మనకు గొన్ని నూతనాంశములు వెల్లడి యగు చున్నవి. అధర్వణుఁడు విరాటోద్యోగ భీష్మపర్వము లను మాత్రమే తెలిగించెనని మన కింతవఱకు దెలిసి యుండెను. ఇపుడు పయి యభిప్రాయమును మనము మార్చుకొనవలసియున్నది. మనకు దొరకిన పద్య ములలో నాగ సభారణ్యపర్వములకును, కర్ణశల్య పర్వములకును సంబంధించిన పద్యము లుండుట మన మింతకుముందు చూచితిమి. కనుక 'ఇతడును తిక్కన సోమయాజియు నించుమించుగా నేకకాలమునందే నన్నయభట్టు విడిచిన భారతభాగమును దెనిగింప నారంభించియుండురు. ఇతడు రెండుమూడు పర్వ ములను మాత్రమే తెలిగింపఁగలిగెను.' అనియు, 'నన్నయభట్టు అరణ్యపర్వమువఱకును తెనిగించిన తరువాతనే యీతడు భారత మాంధ్రీకరింప బూని యుండెనియెడల విరాటపర్వము మొదలుకొనియే తెలి గించుటకు గారణ మేమియు నగపడదు' అనియు శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసిన విషయములు సత్యదూరము లగుచున్నవి. అధర్వణాచార్యుడు తిక్కనవలె భారతమును విరాటపర్వమునుండి తొడగి

---

* ఈ పద్యముయొక్క యునికిని దెలిపిన మిత్రులు శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి మిక్కిలి కృతజ్ఞుఁడను. సభాపర్వము ద్వితీయాశ్వాస మున 'దేవగురు ద్విజ ప్రకరతృప్తి' యను పద్యమున కును, 'సతత ధనధాన్యములన్' అను పద్యమునకును మధ్య నీ పద్యమును, 'ప్రణతాశేష' యను పూర్వో దాహృత పద్యమును నధర్వణాచార్యుల భారతము నందలివిగా వ్రాయబడియున్నవి—

† ఈపద్య మాదిపర్వములోనిదనియు, నిది యజ గర నహుషవాక్యమనియు నాంధ్రశబ్దచింతామణిలోఁ గలదు. కాని యజగరోపాఖ్యాన మారణ్యపర్వమునందలి దగు టచే నిది యరణ్యపర్వమునందలి పద్యమయి యుండు నని యూహించుట యసమంజసము కాదు.

యాంధ్రీకరించినవాడు కాడు. ఆతడు భారతమును పరిక్రొత్తగా దొలుతనుండియు నాంధ్రీకరించినట్లు మనకు దెలియుచున్నది. అతడు భారతమును సంపూర్ణముగా రచించెనో లేదో మనము నిర్ధారించి చెప్ప జాలము. కాని కర్ణపర్వమునకును శల్యపర్వమునకును సంబంధించినవని చెప్పదగిన పద్యములు మన కుపలబ్ధము లయియుండుటచేత భీష్మ కర్ణపర్వములకు నడుమనున్న ద్రోణపర్వమునుగూడ నాతడు రచించియే యుండునని మన మూహించుట తప్పుకాదు. నేటిదాక నుపలబ్ధము లగుచున్న యాధారములనుబట్టి యథర్వణాచార్యుడు భారతము నాదిపర్వమునుండి తొడగి శల్యపర్వముదాక రచించెనని నిశ్చయముగా జెప్పవచ్చును.

మఱియు శ్రీ వీరేశలింగము పంతులుగారు 'ఈతని కవిత్వము సంస్కృతసమాస భూయిష్ఠమయి సామాన్యులకు దురవగాహమయి యుండెను. తిక్కన కవిత్వ మాంధ్రపద భూయిష్ఠమయి బహుజనసుఖావగాహమయి యుండెను. ఈ హేతువుచేతనే తిక్కన భారతము సర్వజనాదరణపాత్రమయి దేశమం దంతటను వ్యాపింపగా, నథర్వణభారతము కతిపయ పండితజనైకాదరణపాత్ర మయి సర్వజనీనవ్యాప్తి గాంచక యాంధ్రదేశమున మృగ్యమయినది' అని వ్రాయుటయు సత్యము కాదు. శ్రీ వీరేశలింగము పంతులుగారు తమనాటి కుపలబ్ధము లయిన పద్యములు చాలవఱకు సంస్కృతసమాసభూయిష్ఠములుగా నుండుటచే నట్లు వ్రాసిరని తలపదగియున్నది. కాని నేడు మనకు నూతనముగా లభించిన పద్యములను బరిశీలించినచో నాతడు జిలిబిలి తెలుగుపలుకులతో నెంత సరసముగా బద్యముల జెప్పగలడో విశదమగుచున్నది. అతని భారతము వ్యాప్తిగాంచక పోవుట కాతని కవిత సంస్కృతసమాసభూయిష్ఠమై యుండుట కారణము కాదు. మఱి యాతడు జైను డగుట నది జైనగ్రంథమను కారణముననో లేక కవిత్రయభారతమునుం దది నిలువజాలక పోయిన హేతువుచేతనో యాతని భారతము వ్యాప్తి గాంచజాలక నష్టమయియుండునని యూహించుట న్యాయము. కస్తూరి రంగకవినాటిదాక దేశమున వ్యాప్తినందియుండిన యీ గ్రంథము నేడుపలబ్ధము కాకుండుట నిజముగా మన దురదృష్టము!



కథానిక :




శ్రీ పుల్లేవు సత్యనారాయణమూర్తి

## 1

"అమ్మా! మరోరెండు బంగాళాదుంప ముక్కలు వెయ్యి!"

'అన్నయ్యకు వేస్తే నాకూ వెయ్యమ్మా, మరి."

కంచంలో ఉన్న ముక్కలన్నీ తొందర తొందరగా దిగమింగుతూ, రామారావు కూడా అందుకున్నాడు.—"అమ్మా! నేనూ ముక్కలన్నీ తినీసేను. నాకూ వెయ్యాలి సుమా!"

'నీకు రెండుమాట్లు వేసింది కాదుట్రా?'

'నీకుమాత్రం వెయ్యలేదేమిటి, మూడుమాట్లు?'

'నాకు మూడుమాట్లెక్కడ వేసిందిరా?'

'మరి నాకు రెండుమాట్లెక్కడ వేసిందిరా?'

'నీవన్నీ అబద్ధాలే.'

'నీవి అంతకంటే అబద్ధాలు.'

'వాపూసు నీకెందుకురా?'

'వాపూసు నీకెందుకురా?'

'నేను ముందువెయ్యమని అడిగేను తెలుసా?'

'నేను ముందు ముక్కలువేపు చూసేను తెలుసా?'

'చూస్తేమాత్రం?'

'అడిగితే మాత్రం?"

'నేను అమ్మతోటి పొద్దున్నే చెప్పేను తెలుసా?'

'నేను అమ్మతో రేపే చెప్పేను తెలుసా?'

'అమ్మా చూశే, రామిగాడు?'

'నేను రామిగాడి నిట్రా?'

'కాపేమిట్రా మరి?'

'అయితే నువ్వు వట్టి వెంకయ్యవిలే.'

'అయితే నువ్వు వట్టి రామిగాడివిలే.'

'తంతాను చూసుకో.'

'నేను అంతకంటే తన్నగల్ను తెలుసా?'

'ఏదీ, తన్నరా, ఏపాటి తిన్నగలవో?'

'ఏదైతే నువ్వు తన్నూ, చూద్దాం.'

'నేను తన్నలేననుకున్నావా?'

'నేనుమాత్రం తన్నలేననుకున్నావా?'

'తాతలు దిగిరావాలి.'

'ముత్తాతలు దిగిరావాలి.'

'వాకట్లో కళ్ళి పడాలన్నమాట.'

'వీథిలో కళ్ళి పడాలన్నమాట.'

"ఏదీ తన్ను చూద్దాం మరి?"

"నువ్వు తన్ను చూద్దాం మరి?"

"ఇదిగోట్రా!"

వెంకట్రావు రామారావు వీపుమీద ఒక్క చరుపుచరిచి అడిగేడు—"అయిందా?"

రామారావు తిరిగి తన్నడానికి చెయ్యి విసిరేడు కాని అన్నకి తగలలేదు. వెంటనే 'బాకా' మొదలు పెట్టేడు.

మొదట బంగాళాదుంపల ముక్కలు వెయ్యమని అడిగిన పెద్దకొడుకు గోపాలరావు ఈ గలభా చూస్తూ తనమాట మర్చిపోయేడు.

మోహనరావుగారి భార్య సీతమ్మ ఆదినం ఉదయం అతి బలవంతంమీద ఏదో చేదుమందు త్రాగినది. చిన్నతనంలో, ఆవిడ అలాంటి చేదుమందు తాగిననాడు సాయంకాలం, ఆవిడ తండ్రి ప్రత్యేకంగా బజారునుండి బంగాళాదుంపలు తేవడము, తల్లి ఆప్యాయంగా వేపడంచేసి పిల్లకి వెయ్యడము, అలవాటు. మోహనరావు యిప్పుడు తన ఇంట్లో కూడా ఆ ఆచారాన్ని అమలుపరుస్తున్నాడు ఇంట్లో భార్య కాని, పిల్లలు కాని ఏదైనా చేదుమందు తాగితే ఆదినం వాళ్ళకి పండుగే. ఆరాత్రి తప్పకుండా బంగాళా దుంపలు వేపడం ఉంటుంది. అయితే, ఏ రోజున ఎవరు అలాంటి మందు తాగుతారో ఆరోజున వాళ్ళకే వేపడం పైని ప్రత్యేకపు హక్కు వుంటుంది. నేడు ఆ మందు త్రాగినది అతని భార్య. తాను బంగాళాదుంపలు తెచ్చినది ముఖ్యంగా ఆమె కొరకే.

పిల్లలు చేస్తున్న గల్లంతు మోహనరావు, సీతమ్మా చూస్తూనే ఉన్నారు. అయితే చూస్తూ ఊరుకున్నారా? అంటారా? ఆహా! ఊరుకున్నారు. ఊరుకోనక ఏంజేస్తారు? ఇది వాళ్ళకి క్రొత్తగనకనా? కొట్టుకోనడాలూ, తిట్టుకోనడాలూ లేకుండా పిల్లలు భోజనంచేసిన దెప్పుడు కనుక? వాళ్ళకి ఇది బాగా అలవాటు అయిపోయింది. కొట్టుకునో, తిట్టుకునో, వాళ్ల చేతులూ, నోళ్ళూ నొప్పెట్టి, వాళ్లంతట వాళ్లు ఊరుకోనవలసినదే కాని, వాళ్ల తగవులు తీర్చడం వాళ్ల తరంగాదుగదా, వాళ్లని పుట్టించిన బ్రహ్మతరం కూడా కాదు. ఇంతకూ వాళ్లు తిట్టుకోనడం, కొట్టుకోనడం, గుత్తళంలోని చీమ టపాకాయిలు పటపట పేలినట్లు ఒక్క క్షణంలో జరిగిపోయాయి. రాముడు బాకా పెట్టడంటే రామేశ్వరం దాకా వినబడుతుంది. వాడిని ఊరుకోబెట్టడానికి ఊరంతా ఏకమైనా చాలదు. సీతమ్మకు ఈ వేళ ఎక్కువ నీరసముగా ఉండడంవల్ల పిల్లలనోట్లో నోరుపెట్టి, వాళ్లని కసిరి, గదమాయించ లేకపోయింది. కాని రాముడు పెట్టిన బాకా విని ఊరుకోనలేకపోయింది కూడా.

"ఏమిరా! ఎందు కలాగ కొట్టుకు ఏడుస్తారురా? మీకు కావలిస్తే నన్ను అడగకూడదూ? వేస్తాను. మీలో మీరెందుకు అలాగ తన్నుకోవడం?" అంటూ సీతమ్మ పళ్లెంలోని బంగాళా దుంప ముక్కలుతీసి వాళ్లకు వేసే నిమిత్తం, వంగి ముక్కలు తీస్తూంది. పళ్లెంలో ఇంక కొంచెము ముక్కలు మాత్రము మిగిలిఉన్నాయి. అప్పటికే పిల్లలు రెండుమూడు మార్లు అడిగి అడిగి వేయించుకున్నారు.

మోహనరావు పళ్లెమువైపు చూసేడు. ఒక ప్రక్క భార్య, ఒకప్రక్క పిల్లలు. పళ్లెములో మిగిలిన ముక్కలు కొంచము. ఆ కొంచము ముక్కలూ కూడా పిల్లలకు వెయ్యడానికి భార్య సిద్ధముగా ఉన్నది. ఆమెకు తనమాట ఏమిటన్న ప్రసక్తియే లేదు! తన పిల్లలే తాను, తానే తన పిల్లలు. మరి మోహనరావు కఠిన హృదయుడా! అతనికి పుత్రవాత్సల్యం లేదా? ఉంది. కాని, ప్రస్తుత పరిస్థితిలో అతని త్రాసుముల్లు పుత్రవాత్సల్యంకంటె కళత్ర ప్రేమ వైపు ఎక్కువ మొగ్గుచూపింది. కారణం? ఆ దినం మందు త్రాగింది తన భార్య. తాను అసలు, బంగాళా దుంపలు తెచ్చినది ఆమెకొరకు. వేయించిన ముక్కలలో ఒక ముక్క ఐనా ఆమె నోట్లో పడకుండా అన్నీ తనూ పిల్లలూ కలిసి కాజేస్తే, ఆమె మాట ఏమిటి?" ఇది అతని మనస్సును కలత పెట్టుతున్న మాట. అతడు భార్యతో కచ్చితమైన స్వరంతో అన్నాడు—'ఇంక ఆ ముక్కలు ఎవరికీ వెయ్యకు, చెబుతున్నాను. ఇటు రా.' భార్యపైనున్న ప్రేమ పిల్లలపైని తాత్కాలిక క్రోధంగానూ, అసూయగానూ పరిణమించినది. అతడు తన పిల్లలను గద్దిస్తూ అన్నాడు. "వెధవల్లారా! ఎన్నిమార్లురా వెయ్యడం మీకు? మీరు చేదు మందు తాగేరా, ఏమైనానా? అన్ని ముక్కలూ మీకే మింగేస్తే మరి మందు తాగిన అమ్మకి ఏమీ మిగలక్కరలేదా?"

"నాన్నగారూ, నేనూ రేపు ఆమందు తాగేస్తానండీ."

"నాన్నగారూ, నేను నిన్న ఆమందు తాగేస్తానండీ."

"నాన్నగారూ, నేను ఒక్క చుక్క క్రింద పడకుండా తాగేస్తానండీ."

"వీడు కాళ్ళల్లో పడుకోబెట్టుకుని నోట్లో తాళం పెట్టి పోస్తేగాని తాగడండీ."

"నాన్నగారూ! అన్నయ్య తాగిన మందంతా, ఉమ్మేస్తాడండీ."

మోహనరావు కోపం పిల్ల సంభాషణ వింటుంటే, తగ్గిపోయినది. అన్నాడు—'సరేలెండి, రేపు ఎవరు అల్లరి చెయ్యకుండా తాగితే వాళ్లకి కావలసినన్ని బంగాళా దుంపలు తెస్తానులెండి. ఇప్పుడు మాత్రం ఇంక అల్లరి పెట్టకండి."

"నాన్నగారూ, నాకు బుట్టతోటి బుట్టెడు దుంపలు పట్టుకురండీ."

"నాన్నగారూ నాకు బస్తాతో బస్తాడు తెండి"

పెద్దకుమారుడు గోపాలరావు కొంచం మొగ మోటస్థుడు. భయస్థుడు. ఇంతవరకూ అన్నంలో మరేవో కలుపుకుని తింటున్నాడు. తల పైకెత్తి నవ్వుతూ అన్నాడు—'నాన్నగారూ, వీళ్లిద్దరికీ వొద్దు, నాకు తెచ్చిపెట్టండీ."

సీతమ్మ మనస్సు ఉండబట్టలేదు. భర్తకు తనపై గల ప్రేమను ఆమె గుర్తించకపోలేదు. అయితే మాత్రం! పిల్లలకు బంగాళాదుంపలంటే ఎంతో అంత ఇష్టం. ప్రొద్దుట వాళ్ళనాన్నగారు బజారుకు వెళ్ళి నప్పటినుంచి, బంగాళాదుంపలు తెస్తారని, గంటల కొద్దీ వీధి గుమ్మంలో కూర్చున్నారు. ఆయన బజారు నుంచి వచ్చి, వీధిగుమ్మంలో అడుగుపెట్టగానే, 'నాన్నగారూ, సంచీ నాకు యివ్వండీ అంటే నాకు యివ్వండీ' అని తగవులాడేరు. ఆఖరుకి తండ్రి ఆ తగవు తీర్చలేక, తనూ పిల్లలూ కలిసి సంచీని యింట్లోకి సాయం పట్టుకువచ్చారు. పిల్లలు సంచీ నొక్కి చూసేరు. 'ఆయ్, హాయ్! నాన్నగారు బంగాళాదుంపలు తెచ్చేరోయ్!' అని ఎగిరేరు. 'నేను అమ్మతో చెబుతాను.' అంటే 'నేనే ముందు చెబుతాను' అంటూ ఇద్దరూ, సంచీ వదిలివేసి వంటింటివైపు పరుగెత్తేరు. వెంకట్రావు జోరుగా పరిగెత్తి గుమ్మం తగులుకుని బోర్లాపడ్డాడు. రామారావు వాడిని దాటిపోయి, 'అమ్మా, బంగాళాదుంపలు తెచ్చేరు, నాన్నగారు.' అని పాటవరసలో పాడు కుంటూ అమ్మదగ్గిరికి వెళ్లేడు. వెంకట్రావు, దెబ్బ లక్ష్యపెట్టకుండా, తనవద్దకు వచ్చి 'నేనే నాన్నగారి దగ్గిర సంచీ ముందుగుండా పుచ్చుకున్నానమ్మా!' అని గొప్పగా చెప్పేడు.

ప్రొద్దుటినుండీ వాళ్ళ సందడి చెప్పడానికి వీల్లేదు. పాపం వాళ్ళకి పెట్టకుండా దాచుకుని తాను తినగలదా? తన గొంతుక దిగుతుందా? ఈవిధంగా ఆమె మానసకాసారంలో తరంగాలు అల్లకల్లోలంగా పొంగి పొర్లెత్తాయి. ఉన్నముక్కలు నాలుగూ ఊడిచి ముగ్గురు పిల్లల కంచాల్లోనూ సర్దేద్దామనే ఉద్దేశంతో ఆమె పళ్ళెంలో చేయిపెట్టి ముక్కలు తీస్తున్నది. మోహనరావు ఆమెపై కోపము ఎక్కు వయింది. తన విస్తట్లో మిగిలిఉన్న ముక్కలు తీసి యిద్దరు చిన్నపిల్లల కంచాల్లోనూ సర్దివేసి, "ఇదిగో నేను వేస్తున్నాను. ఇంక మళ్ళీ అమ్మని వెయ్యమని అడిగేరంటే మాత్రం చావగొట్టేస్తాను, తెలుసా?" అన్నాడు.

"అదేమిటండీ, బాగానేవుంది! మీకు వేసిన ముక్కలు వాళ్లకెందుకు వేసేసేరు? నేను వేస్తుం టేగా?" అన్నది సీతమ్మ.

"చాలులే! చాలా గొప్పపని చేస్తున్నావుగాని, ఇంక ఆ ముక్కలు అలాగ ఉంచెనిచ్చుకుని నువ్వు తిను. అవిగాని పిల్లలికి వేసేవంటే మరి ఊరుకోను."

"అసలు మొదట అడిగినవాడు గోపిగాడు. ఈ వెనవల అల్లరికి భయపడి పాపం, వాడు మళ్ళీ అడగ టమే మానివేసినాడు. వాడికి మారైనా వయ్యలేదు. మజ్జిగ, అన్నంలో బంగాళాదుంపలు నంజుకోవడం వాడికి ఎంతో యిష్టం." అంటూ, ఆ మిగిలిన ముక్కలు రెండూ ఊడిచి ఆమె పెద్దకొడుకు కంచంలో పడవేసినది.

మోహనరావు తింటూఉన్న అన్నము వదిలి వేసి, ఉత్తరాపోశనము కోసం చేతిలో నీళ్ళు పోసుకుంటున్నాడు. అది చూసి భార్య—"అదేమి టండి, అలాగ!" అంటూ భర్త చెయ్యి పట్టుకుని, కూర్చోబెట్టడానికి ప్రయత్నంచేసింది. కాని అతను గట్టిగా చెయ్యి విదిలిపించుకుని బయటకు వెళ్ళిపో యాడు.

## 2

నేడు ఏకాదశి. మోహనరావు ఏకాదశినాడు ఉపవాసం ఉండడం ఆచారం. ఆయనతోపాటు తన భార్యకూడా ఉపవాసం ఉండడం అభ్యాసం చేసు కుంది. నాడు ఉదయంనుంచీ పిల్లలు "అమ్మా నేను 'ఉపోసిం' ఉంటానంటే నేను ఉపాసం ఉంటాను" అంటూ మొదలుపెట్టారు.

"అమ్మా, రామిగాడికి 'ఉపోసిం' అనడం రాక 'ఉపాసం' అంటున్నాడే."

"అమ్మా, నేను బాగా అన్నాను కాదే?"

"ఉపోసిం అంటే ఏమిటనుకున్నావురా?"

"ఉపాసం అంటేనా? అంటే, మరీ— ఉపాసం ఉండడమన్నమాట."

"అంటే ఏమిటి?"

"అంటే ఏమిటా ? అంటే—సాయింతరం పెసాదాలు తినడం అన్నమాట."

"అయితే నీకు మంచి బాగా తెలుసన్నమాట!"

"ఓ, నాకు మంచి బాగా తెలుసును."

"ఉపోసిం అంటే అదికాదు తెలుసా?"

"అయితే మరి నువ్వుచెప్పరా."

"చెప్పేదా? మరైతేనూ ఉపోసిం అంటే ఏమిటోనూ? ఉపోసిం అంటే, మరిగంటే, ఏమిటమ్మా, చెప్పమన్నావా? ఉపోసిం అంటే, మరీ— నాన్నగారూ అమ్మ ఉపోసిం ఉంటారు కదూ? అదీ. ఇప్పుడు తెలిసిందా?"

మోహనరావు అన్నాడు—'నువ్వు చెప్పిన దానికంటె తమ్ముడు చెప్పిందే బాగుందిరా.'

"అయితే ఉపోసాలు" అంటే పెసాదాలు తిందమా."

మరి మనమంతా సాయంత్రం ప్రసాదాలు తింటాం కదూ!"

"అయితే నాన్నగారూ, కాఫీతాగి ఉపోసిం ఉండవచ్చునా?" అని అడిగేడు శంకర్రావు.

"బువ్వతిని ఉపాసం ఉండొచ్చునా నాన్న గారూ?" అన్నాడు రామారావు.

"మంచి ఉపోస్యాలేనురా మీవి. కాఫీలు త్రాగీ, అన్నాలు తినీ ఎవరైనా ఉపోస్యాలుంటారా ఎక్కడేనా?" అన్నది తల్లి నవ్వుతూ.

"అయితే మరి ఏమితినాలమ్మా?"

"ఏమీ తినకూడదు."

"ఏమీ తినకూడదా?"

"అహాఁ, ఏమీ తినకూడదు."

"చద్దిఅన్నం తినొచ్చా?"

"తినకూడదు."

"పెసాదాలు తినకూడదా?"

"ప్రసాదాలు తినవచ్చు."

"అయితే వేగిరం పెసాదం చెయ్యమ్మా— నేనూ ఉపోసిం ఉంటాను."

"నేనూ ఉపాసం ఉంటానమ్మా."

"ప్రసాదం ఇప్పుడు కాదు తినడం. సాయింత్రందాకా, ఏమీ తినకుండా ఉండి, అప్పుడు స్నానంచేసి, ప్రసాదంచేసి దేముడికి నైవేద్యం పెట్టి అప్పుడు మనం తినాలి."

"దేముడుకి నైవేద్దిం ఎందుకమ్మా పెట్టడం?"

"దేముడు తిన్నాక మనం తినాలి."

"దేముడు తింటాడూ?"

"ఓ, మనం తింటాం కదూ. అలాగే దేముడూ తింటాడు."

"దేముడుకి నోరు ఉంటుందీ?"

"ఓ, ఎందుకుండదూ?"

"దేముడుకి చేతులూ వుంటాయా?"

"ఆ, చేతులూ వుంటాయి, కాళ్లూ వుంటాయి; ముక్కూ వుంటుంది, చెవులూ వుంటాయి."

"అయితే నేనూ నైవేద్దిం పెడతానమ్మా."

"నేనూ నైవేద్దిం పెడతానమ్మా."

"అందరూ పెట్టండి" అన్నది తల్లి.

"వీడు ఉపోసిం ఉండలేడమ్మా."

"నువ్వేనురా ఉండలేవు."

వాడి వూసు నీకెందుకురా ? నీ సంగతేదో నువ్వు చూసుకుందూ" అన్నది తల్లి, శంకర్రావుతో.

రామారావు ఎనిమిది గంటలవరకూ ఏమీ తినకుండా, ఉపాసం ఉంటానంటూ యిటూ అటూ గంతులువేసి తిరిగేడు. ఇంతలోకి కడుపులో కామయ్య గెంతులు వెయ్యగానే, చడీ చప్పుడూ లేకుండా వెళ్ళి చద్దికుండకు తలబద్దాడు. వాడిని చూచి శంకర్రావు పరిహాసం చేసేడు.

"ఇదేనట్రా ఉపోషిం వుండడం?"

"నావూసు నీకెందుకూ?"

"ఉపోషిం వుంటానని గొప్పలు చెప్పేవు మరి?"

"నాఇష్టం నేను ఉండను నీకేమీ."

"మరెందుకు గొప్పలు చెప్పేవు?"

"నా ఇష్టంరా! చెబితే చెబుతాను."

పదిగంటలు అయినప్పటికి శంకర్రావుకి కూడా ఆకలి వేసింది. తల్లి దగ్గిరికి వెళ్ళి 'అమ్మా! రామిగాడు అన్నం తినేసేడే.' అన్నాడు.

"అయితే ఏమంటావురా?"

"నేనుకూడా తినేసేదా?"

"నిన్నెవరు వద్దన్నారు అసలు?"

"అన్నం తినేస్తే, సాయంత్రం పెసాదం యిస్తావా?"

"అలాగేలే."

మోహనరావు ఆఫీసుకుపోయి యథాప్రకారం సాయంత్రం 6 గంటలకి యింటికి వచ్చేడు. స్నానం చేసుకుని, జపం చేసుకుని, భగవద్గీత పారాయణ ప్రారంభించేడు. సీతమ్మకూడా స్నానంచేసి మడిబట్ట కట్టుకుని, గోధుమనూకా, నెయ్యి, పంచదారతో ప్రసాదం తయారుచేసింది. ఈలోపుగా, ఉండీ ఉడిగీ, పిల్లలు, ఇటూ అటూ తిరిగివచ్చి వంటింటి గుమ్మందగ్గర నిలుచుని లోపలికి తొంగిచూస్తూ 'అమ్మా, యింకా పెసాదం అవలేదూ? అమ్మా, దేవుడికి నైవేద్దెం పెట్టటం అయిందా?' అని ప్రశ్నలు వేస్తుండేవారు.

మోహనరావు గీతాపారాయణ పూర్తిచేసుకుని ప్రసాదం దేవుడికి నైవేద్యంపెట్టి కూర్చున్నాడు. సీతమ్మ తలకొక ఆకూ వేసి, ప్రసాదం అందరి ఆకుల లోనూ వడ్డించినది. భర్త నిర్బంధంమీద తనుకూడా ఒక ఆకువేసుకుని తనకుకూడా ప్రసాదం వడ్డించు కున్నది. గోపాలరావు తన ఆకులో వేసిన ప్రసాదపు ఉండలు రెండూ తినివేసి, మరి వస్తానంటూ వెళ్ళిపోయి వాడు. తక్కిన పిల్లలిద్దరూ తమ ఆకులలో వేసిన ప్రసాదపు ఉండలు రెండేసిన్నీ ఉండలు పాళం గానే గుటకాయస్వాహాచేసి, తల్లి మొఖంవైపుచూచి 'అమ్మా, తినీసేం' అని, యుద్ధంలో జయంపొందిన వీరులలాగ గొప్పగా చెప్పేరు.

"అమ్మా! నాన్నగారికి పెద్దపెద్ద ఉండలు వేసేవు. మాకు చిన్నచిన్నవి వేసేవు ఏం?" అన్నాడు రామారావు.

"నాన్నగారు పెద్దవాళ్ళు కదుట్రా, మరి! అంచేత పెద్ద వుండలు వేసింది మరి." అని సర్దుబాటు చెప్పేడు వెంకట్రావు.

"నేనూ పెద్దివాడినే" అన్నాడు రామారావు.

"నువ్వు నాన్నగారంత పొడుగున్నావేమిట్రా?"

"ఇదేమిటి చూసుకో! నాన్నగారికంటె ఎంత పెద్దవాడినో." అంటూ రామారావు నిలబడి చెయ్యి పైకెత్తి అన్నాడు.

మోహనరావు నవ్వుతూ, "అవునురా, నువ్వే పొడుగ్గా వున్నావురా" అంటూ తన ఆకులోనున్న ఒక ప్రసాదపుఉండ రామారావుకీ, మరొక ఉండ వెంకట్రావుకీ పడవేశాడు.

సీతమ్మ అన్నది—"మీ రెండుకండీ వాళ్ళకి పడేస్తారు? నేను వెయ్యనూ?"

"నువ్వు వేసినవి తినేసేరుగా?"

"తినివేస్తే మరి వెయ్యనా యేమిటి?" అంటూ ఆవిడ మరి రెండు ఉండలు తీసి పిల్లలకు పడవేసింది.

"నువ్వు చిన్నచిన్న పిసరు ఉండలు పడేస్తావమ్మా. నాన్నగారైతే పెద్ద పెద్ద ఉండలు పడేస్తారు." అన్నాడు వెంకట్రావు.

"ఈవాళ ప్రసాదం మీకోసం చేసేనా, నాన్నగారికోసం చేసేనా?"

"నాన్నగారు తింటే మరి మేము తినమేటి?" అన్నాడు రామారావు.

"మీరేమీ ఉపోష్యం ఉన్నారా ఏమైనానా? నాన్నగారు పొద్దుటినుంచీ మంచినీళ్ళయినా తాగ లేదు. మీరు పొద్దుటలేచి అప్పుడే రెండుమాట్లు మెక్కేరు. మళ్ళీ కాస్సేపటికి అన్నం తింటారు. మీకు నాన్నగారితో వొంతేమిటి? అంటూ, ఆవిడ మరి రెండు పెద్ద ఉండలు భర్త ఆకులో పడవేసింది. 'వాళ్ళకి పడెయ్యక మీరు తినండి. వాళ్ళకేమిటి అలాగ అరుస్తూనే వుంటారు.' అన్నది.

సీతమ్మ ఇప్పటికి ఒక ఉండ తిన్నది. ఒక ఉండ యింకా తన ఆకులో నున్నది. ఇక గిన్నెలో నున్న రెండు చిన్న ఉండలూ పిల్లలిద్దరికీ చెరిఒక ఉండ, పడవేసి, 'ఇదిగో చూసేరా? గిన్నెలోఉన్న రెండు ఉండలూ మీకు పడవేశాను. అవి తిని తిన్నగా వెళ్ళి చేతులు కడుగుకోండి—మళ్ళీ అడిగే రంటే తన్నుతాను. జాగర్త.'

ఒట్టి గిన్నిచూచి పిల్లలు నిరాశ చెందేరు. వారికి తిన్నదాంతో తృప్తి అయినట్టు ఏమీ కనిపించ లేదు. తండ్రివైపు ఆశాపూరిత నేత్రాలతో చూస్తు న్నారు. వాళ్ళ మొహాలు చూస్తూ సీతమ్మ చురచుర లాడుతోంది.

"నాన్నగారూ, మీరు ఆ రెండు ఉండలూ తినీగలగరా?" అన్నాడు వెంకట్రావు.

మోహనరావుకి నవ్వు వచ్చినది. పిల్లలకి ప్రసాదం అంటే ఇంతా అంతా ఇష్టంకాదు. సాయంత్రం నాన్నగారు పెసానాలు యిస్తారుగదా అని ప్రొద్దుట తను ఇంటి వద్ద నున్నంతసేపూ తనతోటి జట్టుకట్టుకుని తిరిగేరు. చేతులు పట్టుకు వ్రేళ్లాడేరు. రెండుకాళ్ళకూ తమ చేతులు గట్టిగా చుట్టబెట్టి కదలకుండా చేసేవారు. 'నాన్నగారు నాకు ఎక్కువ పెసాదం యిస్తారురా' అంటే నాకు ఎక్కువ పెసాదం ఇస్తారురా' అని పంతాలుపడుతూ వచ్చేరు.

సాయంత్రం తను ఆఫీసునుండి వస్తూండగా యిద్దరూ ఎదురుగుండా పరుగెత్తుకువచ్చి, చెరొక చెయ్యీ పట్టుకుని యింటికి లాక్కునివచ్చేరు. 'నాన్నగారూ అమ్మ పెసాదం చేస్తోందండీ.' అని శుభవార్త వినిపించేరు. 'నాన్నగారూ, నాకు ఎక్కువ పెసాదం ఇస్తారు కదండీ?' అని యిద్దరూ అడిగేరు. నిజంగా, హడావిడి అంతా వాళ్లదేకదా. ఇట్టి ఆలోచనలు మోహనరావు మనస్సులో పరుగులెత్తేయ్. అతడు ఉండబట్టక తన ఆకులో నున్న రెండు ప్రసాదపు ఉండలూ ఇద్దరికీ చెరొకటీ పడ వేసినాడు.

సీతమ్మకు పట్టరాని కోపమూ దుఃఖము వచ్చినవి. తిరిగి భర్తకు వేద్దామంటే గిన్నెలో మరి లేవాయె. తన ఆకులోనున్న ఉండ తాను ఎంగిలిచేసినది. భర్తకు ఎల్లా వేయగలదు! 'వద్దండీ అని పోరుతూ వుంటే, అలాగేనా చెయ్యడం? చాల్లెండి, మహా గొప్పపని చేసేరు!' అంటూ ఆవిడ తన విస్తట్లోనున్న ఉండనుకూడా పిల్లలవైపు విసిరివెయ్యడానికి ఎత్తబోతుండగా, మోహనరావు 'వద్దు, వద్దు' అంటూ ఆమె చేయి తన ఎడమచేతితో పట్టుకొన్నాడు. ఆమె మహాకోపంతో తనచేయి గట్టిగా విడిపించుకుని, ప్రసాదపు ఉండ విసిరేసి, బైటికి వెళ్ళిపోయింది.

## 3

నాడు స్వాతంత్ర్య దినోత్సవం. బడిలో పిల్లలకు మిఠాయిఉండలు పంచిపెట్టారు. రామారావు తనకిచ్చిన మిఠాయిఉండ తక్షణం ప్రారంభించి, నిముషంలో లేదనిపించేడు.

"అన్నయ్యా! నా మిఠాయి ఏదిరా?" అని చేతులు చూపిస్తూ నవ్వుతూ అడిగేడు.

"తినేసేవూ అప్పుడే? అమ్మకీ నాన్నగారికీ యివ్వక్కర్లేదుట్రా? అంతా మింగేసేవు?" అని అన్న గోపాలరావు అడిగేడు.

"నాకిచ్చేరూ! అంచేతనే తినీసేనూ!" అన్నాడు రామారావు మొఘం ముడుచుకుని.

వెంకట్రావు అప్పటికి సగం వుండ తినేసేడు; సగం చేతిలో ఉంది. "ఇదిగోటిరా, నేను ఈముక్క అమ్మకి అట్టే పెడతాను. రామిగాడు అంతా మింగీసేడు. అమ్మకి ఒకపిసరూ ఉంచేడుకాడు" అన్నాడు అన్నతో.

"ఎంగిలి చేసిందిట్రా, యిస్తావు, అమ్మకి?" గోపాలరావు అడిగేడు.

"ఎంగిలెక్కడ చేసేనురా! ఈ చేతిలో పెట్టుకుని యీ చేత్తో తీసుకు తిన్నాను." అని జవాబు చెప్పేడు వెంకట్రావు.

"అయితే అది తినెయ్యకుండా పట్టుకో అమ్మకిద్దూ గాని. నా ఉండ నాన్నగారికి యిస్తాను." అన్నాడు గోపాలరావు.

ముగ్గురు మూర్తులూ యింటికి బయల్దేరేరు.

ఇంట్లో అడుగుపెట్టగానే చిన్నవాళ్లిద్దరూ 'అమ్మా! మేమీవేళ మిఠాయిలు తిన్నాం!' అని దీర్ఘంతీస్తూ ప్రవేశించేరు.

"అమ్మా! రామిగాడు అంత వుండా వాడే తినేసేడే!" అన్నాడు వెంకట్రావు.

"నువ్వేం జేసేవురా?" అని తల్లి సీతమ్మ అడిగింది.

"నేను సగం నీకోసం పట్టుకొచ్చేను." అన్నాడు వెంకట్రావు.

"ఏదిరా, నువ్వు తెచ్చిన మిఠాయి?" అని గోపాలరావు అడిగేడు. తల్లి వాడివేపు చూస్తూ నించుంది.

వెంకట్రావు తన చెయ్యి మూసుకుని గతుక్కుమన్నాడు.

"ఏదిరా, నువ్వు తెచ్చిన మిఠాయి?" అని గోపాలరావు గద్దించేడు. వెంకట్రావు మొఘం వెలవెల పోయింది.

"మర్చిపోయి దార్లో తినీసేనురా!" అన్నాడు, అపరాధిలాగ.

"మరి అమ్మకి అట్టేపెడతానని ఎందుకన్నావ్?" అని గోపాలరావు తమ్ముణ్ణి కసిరేడు.

"పోనీరా! కసరకు వాణ్ణి! ఊరుకో!" అని ఆమె గోపాలరావుతో చెప్పి, "ఏం చేసేవురా, రావూ, నీ మిఠాయి?" అని వెంకట్రావుని నవ్వుతూ అడిగింది.

"నీకు తెద్దాం అని పట్టుకొచ్చేనమ్మా. మధ్య దాల్లో ఎక్కడో మర్చిపోయి తినేసేను. ఇప్పుడు చూస్తే చేతులో లేదు. అన్నయ్య చూడమ్మా, ఎలాగ దెబ్బలాడుతున్నాడో నూ! నేను తినియ్యాలని తినీసే నేమిటి మరి?" అన్నాడు.

వెంకట్రావు మొఖం చూసి సీతమ్మకి చాలా జాలివేసింది.

"వాడు తినలేదర్రా! మధ్య దారిలో కాకి ఎత్తుకుపోయి వుంటుంది. పోనీలే బాబూ వాకొద్దులే, ఫరవాలేదు" అని వెంకట్రావుని ఓదార్చింది.

"నీ మిఠాయి ఏదిరా, రామూ?" అని సీతమ్మ రామారావుని అడిగింది.

రామారావు నవ్వుతూ చొక్కా మీదికత్తి బొజ్జ చేత్తో చూపిస్తూ, "ఇదిగో, ఇక్కడుంది. కావలిస్తే తీసుకో" అన్నాడు.

"అలాగట్రా? అయితే వుండు. కత్తిపీట తెచ్చి కడుపుకోసి ఆ మిఠాయుండ తీసుకుంటాం.' అన్నది తల్లి నవ్వుతూ.

ఆమాట వినగానే, 'నేను తెస్తానమ్మా కత్తిపీటా.' అంటూ వెంకట్రావు పంచాదిలోకి పరుగెత్తేడు.

"నేను వీకు దొరుకుతానేమిటి అసలు?" అంటూ రామారావు పెరట్లోకి పారిపోయేడు.

వెంకట్రావు కత్తిపీట పట్టుకొచ్చి 'రామిగాడు ఏడీ?' అని అడిగేడు తల్లిని.

"సరదాకి అంటే, నిజంగా పట్టుకొచ్చేవురా కత్తిపీట? వెధవ్వి నీ కడుపు కోసేస్తాను ఇలాగరా, ఎవరైతే నేం." అంది తల్లి.

"అబ్బా! నేను కత్తిపీట తెచ్చిపెట్టినందుకా?" అంటూ వెంకట్రావు కత్తిపీట అక్కడ పారేసి నిర్లక్ష్యంగా నిలబడ్డాడు.

"ఈమాటు ఎప్పుడైనా, 'మిఠాయిలు పంచి పెడతారుకారూ, మాబళ్లో, అప్పుడేమోనూ, నీకు తెస్తానమ్మా!" అన్నాడు వెంకట్రావు తల్లితో.

అలాగేలేరా బాబూ? మీదటికి మళ్లీ సాతంత్రం వొస్తుంది కదూ! అప్పుడు తెద్దూగాని. అన్నది సీతమ్మ.

"అప్పుడు అంతా నీకే యిచ్చేస్తానమ్మా! ఒక్క పిసరూ నేను తినను." అన్నాడు వెంకట్రావు.

"అలాగేలే! ఇప్పుడింత ఇచ్చేవు, అప్పుడింక అంతా యిచ్చేస్తావు. దర్జాకేం లోటు లేదులే తండ్రికీ పిల్లలికీని!" అన్నది సీతమ్మ నవ్వుతూ.

గోపాలరావు తన మిఠాయుండ రెండు వంతులు వేసేడు. ఒక ముక్క తల్లికిచ్చి అన్నాడు, "ఇద మవ్వ తీసుకో అమ్మా! ఇది నాన్నగారికి."

మోహనరావు తల వంచుకుని ఏదో వ్రాసు కుంటున్నాడు.

"పిల్లల మాటలపై అతనికి ధ్యానములేదు. సీతమ్మ పిల్లల మాటలను విని ఆనందిస్తున్నది. భర్తకూడ, బయటికి రాలేదని వారి మాట వినలేదని, ఆమె విచారిస్తున్నది. ఆతనిని యివతలికి రప్పించడానికే పిల్లలతో తండ్రిని కూడా ఎత్తిపెట్టినది.

అంతవరకూ లక్ష్యపెట్టని మోహనరావు తన ప్రసక్తి రాగానే తక్షణం యివతలకు ఊడిపడ్డాడు.

"ఏమిటి దర్జాలూ, గిర్జాలూ ఎత్తి పెడుతున్నావ్? మా దర్జాకిప్పుడు వచ్చిన లోటేమిటో?" అన్నాడు భార్యని ఉద్దేశించి.

"లోటు లేదనే, నేనూ చెబుతున్నాను. ఏం జట్టీకొచ్చేరా? జగడానికొచ్చేరా? అలా గదుగుతున్నారు?"

"జట్టీలూ జగడాలూ లేకుండా, పాపం! నీతో చట్టాపట్టాలు కట్టుకూర్చోమంటావు కాబోసు! అంత తీరుబడి లేదు నాకిప్పుడు." అన్నాడు మోహనరావు.

"పిల్లలు మిఠాయిలు తెస్తే తిండానికేనా తీరుబడి లేదు పాపం! ఎంతసేపూ రాత రాత! బ్రహ్మ రాత!

"అవును గాని, దర్జా అంటున్నావేమిటి?" అని అడిగేడు మోహనరావు తాపీగా.

"మీకున్నదే దర్జా మొదటినుంచీని. మీరు మీదటికి చంద్రహారాలు చేయించి పెడతామన్నారు! మీ అబ్బాయి మీదటికి మిఠాయిలు తెచ్చి పెడతానన్నాడు. అంతకంటె ఏముంది?" అన్నది సీతమ్మ.

ఇంతలో గోపాలరావు తండ్రి ఎదుటికి వచ్చి నిలబడి "ఇదండి నాన్నగారూ!" అని తన మిఠాయి చేతిని తండ్రి ముందుకు చాపేడు.

"ఏమిట్రా ఇది?" అన్నాడు మోహనరావు.

"మిఠాయండీ." అన్నాడు గోపాలరావు.

"ఎక్కడిదిరా?" అని అడిగేడు తండ్రి.

"మా బళ్లో పంచిపెట్టేరండీ."

"నువ్వు తినలేదు మరి?"

"నా కక్కరలేదండీ" అన్నాడు గోపాలరావు నిస్వార్థ బుద్ధితో. మోహనరావు భార్యతో అన్నాడు. 'చూసేవే, గోపిగాడు? వాడు తినకుండా, మిఠాయి నాకు తెచ్చియిచ్చేడు?' అన్నాడు. గోపాలరావు వేళ్ళు మూసి, 'మీ అమ్మకి ఇవ్వడం మానేసి నా కిచ్చే వేం?' అని అడిగేడు.

"అమ్మకీ సగం ఇచ్చేనండీ." అన్నాడు గోపాలరావు.

"ఉట్టి వెర్రినాగమ్మ అండీ! అందరిలాంటి వాడు కాదు గోపిగాడు. పాపం! ఒక్క పిసరూ నోట్లో వేసుకోకుండా పదిలంగా పట్టుకొచ్చి మన కిద్దరికీ పంచిపెట్టేడు. చూశారా?" అంటూ సీతమ్మ గోపాలరావుని దగ్గరగా లాక్కుని కౌగలించుకుంది. మోహనరావు వాడిని, సీతమ్మ చేతుల్లోంచి లాక్కుని ఎత్తుకున్నాడు. 'ఏంరా, నాన్నా! నువ్వు తినడం మానేసి మాకెందుకు తెచ్చేవు చెప్పూ?' అంటూ వాడిని గట్టిగా అదిమి పట్టుకున్నాడు.

"నాకు మళ్ళీ యిస్తారు నాన్నగారూ మా బళ్లోనూ" అని జవాబు చెప్పేడు గోపాలరావు.

సీతమ్మ భర్త ప్రక్కనే నిలబడి గోపాలరావు చెయ్యి పట్టుకుని వాని అరచెయ్యి ముద్దు పెట్టుకుంటున్నది.

వెంకట్రావూ, రామారావూ వింతగానూ, ఈర్ష్యగానూ వాళ్లవంక చూస్తూ, వాళ్లదగ్గరగా వచ్చి నించున్నారు. చేతులు మీదికి ఎత్తుతున్నారు.

మోహన్‌రావు గోపాలాన్ని క్రిందకు దింపేడు. తన చేతిలోఉన్న మిఠాయిలో కొంచెం తీసిపట్టుకుని, మిగిలినది గోపాలరావు చేతిలో పెట్టి "నువ్వు తిను నాన్నా" అన్నాడు వాత్సల్యపూరితమైన వాక్కులతో. గోపాలరావు తండ్రి యిచ్చిన మిఠాయి అందుకున్నాడు. కొంచం నోట్లో వేసుకున్నాడు. సీతమ్మ తన మిఠాయిలో కొంచంభాగం తీసి పట్టుకుంది. మిగతా మిఠాయి గోపాలరావు కిచ్చి, "ఇందరా, గోపీ, ఇది నా వంతు, తీసుకో" అన్నది. గోపాలరావు అదికూడా అందుకున్నాడు. తండ్రి యిచ్చినదీ, తల్లి యిచ్చినదీ కలిపి ఒక ఉండ చేసేడు. తింటూ నించున్నాడు.

"రావూ, చెయ్యి పట్రా" అన్నాడు మోహన్‌రావు.

"రామూ! చెయ్యి పట్రా!" అన్నది సీతమ్మ.

రావు తండ్రిముందు చెయ్యి చాపేడు. రాము తల్లిముందు చెయ్యి చాపేడు. ఇద్దరి చేతుల్లోనూ మిఠాయిబూంది పడింది. ఇద్దరి మొఖాలూ దాగగ్లంత అయేయి.

ముగ్గురు పిల్లలూ ముందు నిలుచుని మిఠాయి తింటూంటే, భార్యాభర్తలు తమ అస్తిత్వాన్ని వాళ్ళల్లో ఐక్యంచేసి ఆనందాన్ని అనుభవిస్తున్నారు. ఇప్పుడు ఎవరిమీద ఎవరికీ కోపాలూ తాపాలూ ఏవీ లేవు. వారి హృదయాలు పునీతమైన పుత్రవాత్సల్యంతో పూర్తిగా నిండివున్నాయి!



# తంజావూరి మహారాష్ట్రభూపతులు: ఆంధ్ర సాహిత్యము



శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

మహారాష్ట్రులు తంజావూరి రాజ్యమును వశపరచుకొనుసరికి అది రాజ్యలక్ష్మి కల్యాణమంటపమువలె నృత్తగాన వినోదములతో, మేళతాళ ప్రసంగములతో, ఆంధ్రసాహిత్య గోష్ఠులతో సంకులమై కలకలలాడుచు నిత్యకల్యాణము పచ్చతోరణముగ నుండెను. తంజావూరికి మహాదశ ఆంధ్ర నాయక రాజపురందరుడు రఘునాథ నాయకుని కాలమునుండి మొదలు. రఘునాథ నాయకుని తండ్రి అచ్యుతప్ప నాయకుడును, తాత చెవ్వప్పనాయకుడును ప్రతాపవంతులు కాకపోలేదు; రాజ్యపరిపాలనలో సమర్థులును కాకపోలేదు. తంజావూరి రాజ్యాభ్యున్నతికిని అభ్యుదయమునకును వారు దారి చక్కజేసిరి గనుకనే రఘునాథ నాయనయ్యవారి కాలమున అది గొప్ప ఉచ్చదశకు వచ్చినది. కానయితే పితృపితామహు లిరువురును సాహిత్యాభిమానులే, విద్వత్పరిపోషకులే; కాని స్వయముగా కవులు కారు; వారు కావ్యములు రచించి యెఱుగరు; సంగీత కళాభిజ్ఞులే కాని గాయకులు కారు. కాని ఈ గుణము లన్నియు రఘునాథ నాయకునియందు మూర్తిభవించుట మూర్తిమాంబాచ్యుతప్ప నాయకుల బహుజన్మ తపఃఫలము.

రఘునాథ భూపాలుడు బహు శాస్త్రవిశారదుడు; సంస్కృతాంధ్రములు రెంటియందును మహాకవి. ఈయన ఇందిరామందిరమను విద్యామండపము మహాకవులతోను, పండితులతోను, గాయన గాయనీమణులతోను కిటకిటలాడుచుండెడిది. ఆ సభలో వీణావాదన నిపుణలు, చతుర్విధ కవితా చాతురీ ధురీణలు అయిన సుందరీమణు లెందఱో యుండిరి. అట్టివారిలో మధురవాణీ రామభద్రాంబలు ముఖ్యులు. రసికుడు, సంగీత నాట్యకలా సాహిత్య విశారదుడు అయిన మహారాజు గనుక రఘునాథ భూవరుని యాశ్రయము నాసించి యనేకులు సంగీత నాట్యకలా ప్రవీణలైన యోషాలోచనలు తంజపురి కరుదెంచుచుండిరి. ఇట్టివారివలననే తంజావూరిలో రూపకమునకు ప్రశస్తి కలిగినది.

సంగీత సాహిత్యములయందును నాట్యకలయందును చతురులగుటవలన రఘునాథ నాయకుడును, అంతకంటె నెక్కువగా అతని కుమారుడును తంజావూరి రాజ్యము నేలిన కడపటి నాయకభూపతియు నయిన విజయరాఘవ నాయకుడును స్వయముగా రూపకములను రచియించి తమ కోటలోని నాటకశాలలో ప్రదర్శింపజేయుచు వచ్చిరి. ఇంతటినుంచి తంజావూరు నాట్యసంగీతముల కధివాసమయినది.

విజయరాఘవనాయనయ్యవారు సంగీత సాహిత్య విశారదులై నాటక రచనపై మక్కువ చూపగానే యానాటి కవు లందఱును నాటక రచనా విలోలురైయిరి. 'యథా రాజా తథా ప్రజా' యన్న యార్యోక్తి తథ్యము కదా! విజయరాఘవ నాయనయ్యవారు రచియించిన నాటకము లనేకములు. ఈ మహారాజు నాస్థానమున సరస్వతీమూర్తులైన సరసీరుహాక్షు లనేకు లుండిరి. వీరిలో కృష్ణాజమ్మ రంగాజమ్మలు ముఖ్యులు. విజయరాఘవ మేదినీశ్వరుని కాలములో తంజపురము విద్యా విశారదలు, సంగీత నాట్యకలా ప్రవీణలు అయిన వేశ్యారత్నములకు విడిదిపట్టు. విజయరాఘవ నాయకోపజ్ఞములైన నాట్యబృందములుకూడ గొన్ని యుండినట్లు తెలియుచున్నది. ఈరీతిని తంజావూరి ఆంధ్రనాయక రాజాస్థానము చతుర్విధ కవితా విలాస వినోదములతోను, కలాచతురలైన నారీరత్నముల

నాట్య, రూపక ప్రదర్శనములతోను, సంగీత సరస ప్రసంగములతోను దేవేంద్రసభ ననుకరించుచుండెను. ఈస్థితిలో మహా విభవాఢ్యమయిన ఆ తంజావూరి దుర్గము మహారాష్ట్రకులనిస్తారకుడైన ఏకోజీ మహారాజునకు వశమయినది. తంజావూరి రాజ్యము మహారాష్ట్రభూవరుల యధికారము క్రిందికి వచ్చినది.

కానైతే ఏకోజీ మహారాష్ట్రుడే కాని యతనికి తెలుగు తేటదనమును తీయదనమును తెలియకపోలేదు. అతని జాగీరులో కొంతభాగము తెలుగు ప్రాంతమే. బెంగుళూరు పరిసరప్రాంతమున నతడు తండ్రి షాహజీతో చాలకాలము గడపెను. ఏకోజీకికంటెను ఈతని తనయుడు షాహజీకి తెలుగన్న నత్యంత మాదరాభిమానములు. ఈ మహారాష్ట్రవంశజులు తంజావూరిని వశము చేసికొనునాటి కచ్చటి వాతావరణ మంతయు తెలుగే; రాజభాష తెలుగు; మంత్రి దండనాయక సామంతాదు లాదరించిన భాష తెలుగు; సంగీత నాట్య ప్రబంధ భాష తెలుగు. ఆ నాయక రాజాస్థాన విద్యాగోష్ఠులు, ఆనాటి నాట్యోత్సవములు, ఆ దివ్య సంగీత సుధాసార సేచనములు — అన్నియు మహారాష్ట్ర హృదయము నాహరించి దానిని రసార్ద్రము కావించినవి. పరిస్థితుల ప్రభావ మట్టిది.

తంజావూరి మహారాష్ట్ర మహీపతులు ఆంధ్ర నాయకపదాంకానుసారులై, సంస్కృతాంధ్రములను, సంగీత నాట్యములను ఆదరించుటయేకాక వారివలెనే తాముకు సంస్కృతాంధ్ర ప్రబంధ నిబంధనబద్ధ హృదయులైరి; సంగీత నాట్యకళాలక్ష్మిని అల్లారు ముద్దుగా లాలించి పెంచి పోషించిరి. రాజవంశము మారినదన్న పేరేకాని రాజవృత్తమును, సంగీత సాహిత్య నాట్యకలా వినోదములును పూర్వము వలెనే యథాతథముగ సాగినవి. మహారాష్ట్రుల దన్నమాటే కాని తంజావూరి రాజ్య మతఃపరః ఆంధ్రరాజ్యముగనే మిగిలిపోయినది. మహారాష్ట్ర రాజన్యుల కాలములోను రాజభాష తెలుగే. వారు నాట్యకలాచతురలైన తెలుగు వేశ్యల నాదరించిరి; తెలుగు కవుల కాశ్రయ మొసంగిరి; తాము స్వయముగా తెనుగున ప్రబంధములు, నాటకములు రచించియుంచి తెనుగు వాఙ్మయమును పెంపొందించిరి. ఆంధ్రనాయక రాజులకాలములోవలెనే వీరి కాలమునను సంస్కృతాంధ్ర సాహితీవల్లరులు మారాకు తొడిగి నవ్యప్రసూన ప్రభాభాసురములైనవి. తంజావూరి తెలుగు రాజ్యమును జయించిన మహారాష్ట్ర మహీవరులు తెలుగుభాష మాధుర్యమునకు జొక్కి దానికే విజితులైరి. అట్టిది ఆ కాలపు తంజావూరి మహిమ.

మహారాష్ట్ర నృపతులను, ఆ కాలమునాటి సంగీత కళానిపుణులను ఎక్కువగా ఆకర్షించిన కావ్యరూపము గేయప్రబంధము. తంజావూరిని విజయరాఘవ నాయకుడు పాలించుచుండిన కాలమున క్షేత్రయ్య కొంతకాల మక్కడ నుండి విజయరాఘవ నాయనయ్యావారిని తదాస్థాన కవి గాయక శిఖామణులను తన యద్భుత పదములను పాడి వారిని సమ్మోహితులను గావించెను. పదరచనలో ఇన్ని సొబగులు, ఇన్ని మెరుగులు ఉన్నవేమి యని యా కాలపు గాయకు లాశ్చర్యమొందిరి. పదములను రచించుట పాడుట నాడొక విలాసమును వేడుకయు నయినది. తంజావూరిలో విజయరాఘవ నాయకుని యనంతరము విరచితములైన శృంగార పదములకు క్షేత్రయ్య పెట్టినదే వరవడి. కాని క్షేత్రజ్ఞునికి తరువాత వచ్చిన పదములలో అతని పదములలోని సొగసు కానరాదు; తరువాతి రచయిత లంతటి ప్రతిభామహితులును కారు. శృంగారేతరములైన వీర రౌద్ర రసములను లలితాభినయ ప్రధానములును, మంజుల గాన యోగ్యములును అయిన శృంగార పదములలో శబ్దసంగతి కూర్పులో నేర్పు మాపి యొప్పించుట క్షేత్రజ్ఞునికే చెల్లినది!

తంజావూరి ఆంధ్రనాయక రాజేంద్రులవలెనే మహారాష్ట్రులును సంగీత సాహిత్యములను రెంటిని జోడించి గేయ ప్రబంధములను రూపకములను విరచించిరి. అందువలన మహారాష్ట్ర భూమీశుల కాలములో పదములు మాత్రమేకాక రకరకములైన గేయ రచనములు వచ్చి గేయ వాఙ్మయ మపారముగ వృద్ధినొందినది. సంగీతముమీదను గేయములమీదను ఆంధ్రులకు, అందు ముఖ్యముగా ఆంధ్రదేశములోనివారికి అభిరుచి మందగించి మాసిపోయినది పందొమ్మిదవ శతాబ్ది కడపటిభాగమునుంచే.

ఏకోజీ యనంతరము తంజావూరి సింహాసనము నధిష్ఠించినవాడు అతని జ్యేష్ఠకుమారుడైన శాహజీ. ఈ పేరు పెట్టుకొన్న మహారాష్ట్రభూవరులలో ఈతడు రెండవవాడు గనుక ఇతనికి రెండవ శాహజీఅని పేరు. ఇతడు సంస్కృతాంధ్ర మహారాష్ట్ర భాషలలో గొప్ప విద్వాంసుడు; కవి. ఇతడు స్వయముగా విద్యా విశారదు డగుటచేత ఇతని యాస్థానము సంస్కృతాంధ్ర పండితులతోను కవులతోను కిటకిట లాడు

చుండెడిది. ఈతని యాస్థాన విద్వాంసులు బహు శాస్త్ర పారంగతులు. ఈ మహారాజు శాస్త్రప్రియత్వమునకు, విద్వత్పరిపోషణమునకు తిరు విజయ నల్లూరు గ్రామదానమే తార్కాణము. ఈ రాజచంద్రుడు క్రీ.శ.1697 లో ఆ గ్రామమునకు శాహాజీరాజపురమను పేరు పెట్టి సర్వమాన్యముగ అగ్రహారముచేసి నలుబది యైదుగురు శాస్త్ర పారంగతులైన మహాపండితులకు దానము చేసెను. ఇట్లు దానమిచ్చుటలో ఒక్కొక్క పండితు డెన్నెన్ని శాస్త్రములలో పండితుడో ఆయాగ్రహారమున అన్నన్ని వృత్తుల నిచ్చి శాస్త్ర విద్యలను గౌరవించెను. ఆ కాలములో ఈ తిరువిజయ నల్లూరను శాహాజీరాజపురము ప్రసిద్ధి వహించిన మహావిద్యాపీఠము; విశ్వవిద్యాలయమే యది. ఈయగ్రహారములో వృత్తులను బడసిన శాస్త్ర వేత్తలలో ద్రావిడ బ్రాహ్మణు లెక్కువ. సంఖ్యలో వారి తరవాత వచ్చువారు ఆంధ్రులు. కన్నడులు చాల కొద్దిమంది.

శాహాజీమహారాజు సంగీత శాస్త్రములోను, నాట్యశాస్త్రములోనుకూడ గొప్ప పండితుడు. ఆయన తన కాలమువరకు వాడుకలో నుండిన రాగములన్నిటికి సంబంధించిన గీతములను, పరంపరగా వచ్చుచుండిన ఆలాపములను సంకలనము చేయుటవలననే ఆయనకు సంగీతములో గల అభిరుచి అభిమానము ఎంత ఎక్కువో తెలియగలదు. ఈ విధమున ఈ మహారాజు సంకలితముచేసిన లక్ష్యగ్రంథములు ఇరువది తాళపత్ర గ్రంథములలో ఇప్పటికిని తంజావూరి సరస్వతీ మహాలు గ్రంథ భాండాగారములో భద్రముగా నున్నవి. శాహాజీ ఈ లక్ష్యములను ముందుంచుకొని తన యాస్థాన సంగీత విద్వాంసుల సాయముతో తన కాలములో వాడుకలో ఉండిన రాగముల కన్నిటికి లక్షణములను నిర్ణయించెను. ఈ లక్షణ గ్రంథములు పది తాళపత్ర సంపుటములలో నున్నవి. ఈతడే కాదు, ఈతని సోదరుడు తుకాజీ ప్రభువుకూడ సంగీత శాస్త్రపారంగతుడే. ఈ మహారాజు సంగీత సారామృతమను గ్రంథమును రచించెను.

ఆంధ్రనాయక రాజుల కాలములోవలెనే మహారాష్ట్ర రాజన్యుల కాలములో గూడ ఒక్క సాహిత్యములో మాత్రమే ప్రవేశముండిన కొలంతయే. కవిత్వమునకు దోడు సంగీత నాట్య కలాపరిజ్ఞానముండిననే కాని ఎవ్వరును పండితులుగ పరిగణింపబడినవారు కారు. ఆదరించి ఆశ్రయమిచ్చు మహారాజులు సంగీత సాహిత్యములు రెంటిలోను ప్రవీణులగుచేత వారి ప్రాపునుగోరి వచ్చు విద్వజ్జనులకు ఆ యుభయశాస్త్రములలోను తగినంత ప్రజ్ఞ యుండిననే కాని వారికి తగిన ఆదరసమ్మానములు జరిగెడివి కావు. ఈ కారణమున ఆ కాలములో విద్య నేర్చినవా రందరు సాహితీ సంపన్నులే; నాట్యకలా కోవిదులే; సంగీత శాస్త్ర విశారదులే. ఈ రీతిని రఘునాథ భూపాలుని కాలమునుంచి మహారాష్ట్ర పరిపాలనాంత్య కాలమువరకు సంగీత, నాట్య, శాస్త్రవిద్యలకు తంజావూరు ప్రధానపీఠమై యుండెడిది గనుకనే ఇప్పటికి దక్షిణదేశమున సంగీత నాట్యకళల కెక్కువ యాదరాభిమానములు. నాట్యకలలో నేర్పరులైనవా రందరు వేశ్యాంగనలే. మహారాష్ట్రభూధవుల ఆస్థానములో పూర్వపు ఆంధ్రనాయక రాజుల కాలములోకంటెను వేశ్యాంగన లెక్కువగా నుండిరి. వారు స్వయముగా నాటకములు వ్రాసి భరత శాస్త్ర ప్రవీణులచేత తమ నాటశాలలో ఆడించెడివారు.

నాటకములు రచించిన మహారాష్ట్ర రాజన్యులందరిలో శాహాజీ చాల గొప్పవాడు. ఇతడు రచించినన్ని నాటకము లితరు లెవ్వరును రచించి యుండలేదు. ఈ నాటకములకు కర్తృత్వము ఈతనిది గనే తెలియవచ్చుటచేత వీటిని ఇతడే రచించియుండునని నేను భావించుచున్నాను. ఈతని నాటకములు సంస్కృతములోను తెలుగులోను కూడ నున్నవి; మహారాష్ట్రమున రచియించినవియు గలవు. కాని తెలుగుమీద ఇతని కభిమాన మధికమగుటచేత ఇతడు తెలుగులో రచించిన నాటకముల సంఖ్య యధికము; ఇవి ఇరువదియో ఇరువది యొక్కటో యున్నవి. వాటి పేరు లీ దిగువ నుదాహరించుచున్నాను: *

| | | |
|---|---|---|
| * కిరాతి విలాసము | కృష్ణలీలా విలాసము | జలక్రీడలు |
| గంగా పార్వతీ సంవాదము | { త్యాగరాజ వినోద చిత్ర ప్రబంధ నాటకము } | ద్రౌపదీ కల్యాణము |
| పంచరత్న ప్రబంధము | పార్వతీ పరిణయము | రతీకల్యాణము |
| రామ పట్టాభిషేకము | రుక్మిణీ సత్యభామా సంవాదము | వల్లీ కల్యాణము |
| విఘ్నేశ్వర కల్యాణము | విష్ణుపల్లకి సేవా ప్రబంధము | శంకర పల్లకి సేవాప్రబంధము |
| శచీ పురందరము | శాంతా కల్యాణము | సతి దానశూరము |
| సతీపతిదాన విలాసము | సరస్వతీ కల్యాణము | సీతాకల్యాణము |

పూర్వోక్తములైన నాటకములలో పార్వతీ పరిణయ మీ శాహజీ రచించిన దగునా కాదా యని సంశయించుటకు అవకాశము కలదు. ఏలన, సూత్రధారుని నాంది ప్రస్తావనలోని ఈ క్రింది

"సకల విద్యావిలాసములచే రంజిల్లు
 శాహభూపాలుని సన్నుతించి
అతని సభాసీమ నమరుధీరుల చతు
 ర్వేద వేదాంతాది విదులఁ బొగడి
అందు నానందించు ననవద్య సాహిత్య
 వరుల మహా కవీశ్వరుల వేడి
సంగీత భరతశాస్త్ర కళాధురీణుల
 నేర్పుల మది నెంచి యేర్పరించి
ఆ మహారాజు పరమేశ్వరాంకితముగ
పరగఁజేసిన పార్వతీ పరిణయాఖ్య
మనెడు నాటిక మారాజు ననుమతమున
వేషభాషాది యుతముగా విస్తరింతు

"వ॥ అన్నందును గనుక, అపురా యీ విధం బున అభీష్టదేవతా వందనంబు గావించి సభానాయకాదులను అభివర్ణించి శ్రీ శాహమహారాజ ప్రణీతం బైన పార్వతీకల్యాణం బనియెడు నాటకంబు కథా సంవిధానంబుగా వినుపించెదము విన నవధరించ రయ్యా"

అని యున్న సీసపద్యమును వచనమును అనుసరించి చూచినచో ఈ నాటకము శాహమహారాజు రచియించినదని తెలియుచున్నది; కాని చివరి "శ్రీ చోళ నాయకాయ శ్రీ వాసుదేవ కవి వచస్సంతుష్టాయ మంగళం" అన్న మంగళగీతములో 'వాసుదేవ కవి వచస్సంతుష్టాయ' అని యుండుటవల్ల ఈ నాటకము వాసుదేవ కవి విరచితము కాదుకద అన్న యనుమానము పొడముచున్నది; అట్లే కానిచో వాసుదేవ కవి పేరేల యందు రావలెను? అయినను ఈ నాటకము నింకను బాగుగా పరిశీలించినగాని ఏతత్కర్తృత్వమును గురించిన సత్యమును నిర్ధారింపవలను పడదు.

ఈ విధముగానే సరస్వతీ కల్యాణ కృతికర్తృత్వమును గురించికూడ సందేహ మున్నది. సూత్రధారుడు "ఈవిధంబున నభీష్టదేవతా వందనంబు గావించి సభానాయకాదుల నభివర్ణించి శ్రీ శాహమహారాజ ప్రణీతం బయిన సరస్వతీ కల్యాణం బనెడు నాటకంబు కథాక్రమంబుగా వినిపించేము, విన నవధరించరయ్యా" అని చెప్పుచున్నను నాటకములోని కడపటి

"అగు చొక్కనాథ మహామాత్యనాథు
సుగుణ సత్పుత్రుండు సుజన మిత్రుండు
చిరపుణ్య వరమతి శేషాచలపతి
వరశాహ విభు పేర వహిని దైవార
చారు శృంగార రసంబుల ధీరు
లౌరా యనుచు మెచ్చ హర్షంబు హెచ్చ
మొల్లపువ్వుల పొట్లములు విప్పినట్లు
చల్లగా పన్నీరు చల్లిన తీరు
పరగు సరస్వతీపరిణయం బనెడు
సరస నాటకము లాస్యమ్ము రంజిల్ల
భావముల్ తగు వేషభాషాదు లమరఁ
గావించె భరతులు గాయకుల్ మెచ్చ
ఆ చక్రవాళాచలాచలా చక్ర
మాచంద్ర తారార్కమై యొప్పుగాత."

అను ద్విపదవలన చొక్కనాథ మహామాత్యనాథుని సత్పుత్రుడు శేషాచలపతి శాహవిభు పేర ఈ నాటకమును రచియించినట్లు తెలియుచున్నది. ఈ శేషాచలపతి తండ్రియైన చొక్కనాథామాత్యుడు శాహరాజు ప్రధాని యట. శేషాచలపతి వ్రాసిన నాటకము శాహజీ రచియించినట్లు పొరపాటున వ్రాయబడినదేమో; లేదా శేషాచలపతి రచనలో కొన్ని పాటలు వచనములు శాహజీ చేర్చినవేమో. మొత్తముమీద ఈ నాటకముకూడ శాహజీవిరచితము కాదనియే తోచుచున్నది. ఒకవేళ పార్వతీ పరిణయ, సరస్వతీ కల్యాణ నాటకము లితరులు రచించినవైనను మిగిలిన నాటకము లన్నియు శాహమహారాజ కృతము లనుటకు సందియము లేదు.

సాధారణముగా శాహమహారాజు రచించిన నాటకము లన్నియు నాటరాగము ఝంపెతాళములో నున్న పాటతో ప్రారంభమగును. ఈ పాటను తోడ్యమని, తోడెమని వ్యవహరించియున్నారు. ఉదాహరణమునకు :

జయ పార్వతీరమణ జయ మనోభవహరణ
జయ భుజంగాభరణ జయ లోకశరణ
జయ జాహ్నవీధరణ జయ జితాంతఃకరణ
జయ సరోరుహచరణ జయ జగత్తరణా
॥జయ జయ॥

* * * *

జయ పార్వతీరమణ జయ జానకీరమణ
జయ అంతకదమన జయ మధుసూదన

జయ త్రిపుర సంహరణ జయ వేదోద్ధరణ
జయ అఖిలనుత చరణ జయ జనాభరణ
॥జయ జయ॥

*   *   *   *

జయ దేవకీపుత్ర జయ దివ్యనుతిపాత్ర
జయ కృష్ణ సుచరిత్ర జయ జగన్మిత్ర
జయ శుభావహ గాత్ర జయ జగత్కృతిసూత్ర
జయ భాను శశినేత్ర జయ జితామిత్ర
॥జయ జయ॥

శాహరాజకృత నాటకములలో త్యాగరాజ వినోద చిత్రప్రబంధ నాటకము విలక్షణ మయినది. ఇది సంస్కృత నాటకములను బోలిన ఆరంకముల నాటకము. ఇందు సంస్కృత, మహారాష్ట్ర, ఆంధ్ర భాషలు మూడును వాడబడినవి. సంస్కృత, మహారాష్ట్రములే ఎక్కువ; తెలుగు కొద్దిగా ఉన్నది. న్యాయ్యముగా నిది సంస్కృత నాటకమనే చెప్పవచ్చును. ఆ మహారాజునకు స్వభాషయైన మహారాష్ట్రముమీదను, తంజావూరి రాజభాషయైన తెలుగుమీదను గల అభిమానమే ఈ నాటకములోని పాత్రలు కొన్ని మహారాష్ట్రమునను తెలుగునను సంభాషించుటకు కారణము కావచ్చును

శాహమహారాజ కృతములు—సరస్వతీ కల్యాణము, విష్ణుపల్లకి సేవాప్రబంధము, వల్లీ కల్యాణము, రతీ కల్యాణము, జలక్రీడలు మొదలైన కొన్ని నాటకములలో చివర శోభనపు పాటలు కూడ గలవు. మచ్చున కొకటి: విష్ణుపల్లకి సేవా ప్రబంధములో చివర "స్వామి మేలుకొన్న తదనంతరంబున శోభనము నుడివే క్రమము, పరాకు:

శోభానమే శ్రీహరికి శోభానమే శ్రీపతికి శోభా
నమే
శోభానమే శౌరికిని శోభానమే లక్ష్మికిని శోభా
నమే ॥

నగవరోద్ధారునికి నగసన్నిభ కుచయుగకు
గగనవర్ణునికి గగనమధ్యకును ॥శోభానమే॥
శంబరరూపునకు శంబరనయనకు
అంబుజనాభునికి అంబుజ గేహకును॥శోభానమే॥

త్యాగేశ మిత్రునికి త్యాగేశ సోదరికి
భోగీశశాయికిని భోగీశ వేణికిని ॥శోభానమే॥
మంగళం॥

ఈ పల్లకిసేవ ప్రబంధరత్నము చివర కృతికర్త రచియించిన ద్విపద కలదు. అది యిది: దీనివలన శాహమహారాజు కవిత్వ మెట్టిదో కొంత తెలియ గలదు.

శ్రీలోలు పేర నాశ్రితపాలు పేర
నీలవర్ణుని పేర నిరుపము పేర
పల్లకిసేవ ప్రబంధరత్నంబు
పల్లవాయుధ సమప్రభ గలవాడు
భూపాల మణి యేక భూధవపత్ని
దీపాంబ గర్భాబ్ధి దివ్యరత్నంబు
సత్యభాషా హరిశ్చంద్రు డుత్తముడు
సత్యాగరాజాంఘ్రి సన్నుతిపరుడు
వాసుదేవచరిత్ర వర్ణనారతుడు
భోసలకుల శాహ భూపాలమౌళి
విరచించె సత్కృతుల్ విస్మయమంద
ధరణిలో నాచంద్ర తారార్కముగను.

పల్లకిసేవా ప్రబంధములు చిత్రమైన కల్పనతో గూడిన నాట్యాధిక్య ప్రధానములైన నాటకములు. శివుని విష్ణుని పల్లకిసేవయే ఈ నాటకములోని ప్రధానేతివృత్తము. నాట్యకలా ప్రవీణలైన తరుణీమణులు పల్లకిబోయీల పాత్రలను ధరించి స్వామి పల్లకిసేవ చేయుదురు. ఇందునిమిత్తము పల్లకి బోయీలలో ముందువారు వెనుకవారు రెండు గుంపులుగ నేర్పడి కథ వినిపింతురు. చిత్రమైన పరికల్పన మిది. కథ యేమియు లేదు. కాని కృతికర్త నాట్యాభినయముల కనుకూలముగ నుండునట్లు కడుచమత్కారముగ రచియించెను.

శాహమహారాజు పూర్వోక్త నాటకములనేకాక త్యాగరాజస్వామిమీద పెక్కు కృతులను వేంకటేశ పదములను రచియించెను.

శాహజీయాస్థానము నలంకరించిన కవి పండితులలో ఆంధ్రపాణిని బిరుదాంచితుడైన నివృత్తి శేషాచల సుమతి యొకడు. ఇతడు కామకళానిధి రచించిన నెల్లూరి శివరామ కవికి గురువు. శాహరాజేంద్రుని పేర ఈ శేషాచల కవి కోసల భోసలీయ చరిత మను పేర నొక సంస్కృత ద్విసంధాన కావ్యమును రచియించెను. ఆ కావ్యములోని యీ క్రింది

శాహేంద్రదత్త శిబికా కనకాభిషేక
సంభావనారుణభిదప్రతికారహేతోః
యత్సాహసం విరచయే నను తత్రవాణీ
త్వత్తోఽధికం ప్రతిభువం కలయే నమామ్॥

అను శ్లోకమువలన శాహరాజేంద్రుడీ కవివరేణ్యునికి కనకాభిషేక మహాసత్కారమును శిబికాది బహుమానములను గావించినట్లు తెలియుచున్నది. ఇతడు సంస్కృత కవియు, పండితుడును అయినను ఆంధ్రభాషకు పాణినీయపద్ధతిననుసరించి—సంస్కృతముననే యద్యో — వ్యాకరణము రచియించినందున ఇతనినిగూర్చి యిచట తెలుపబడినది.

శాహరాజేంద్రుని కొలువుకూటము నలంకరించిన ఇతర ఆంధ్రభాషా కవులలో గిరిరాజకవి, బాలకవి సుబ్బన్న, శేషాచలపతులు ప్రముఖులు. వీరిలో గిరిరాజకవి శాహజీకాలములోనే కాక యతని సోదరుడును, అతని యనంతరము తంజాపుర రాజ్యమును బరిపాలించినవాడు నగు శరభమహారాజు కాలములోగూడ నుండెను. పూర్వోక్త కవు లందరును నాటకములు రచియించిన సంగీత సాహిత్యప్రవీణులే.

గిరిరాజకవి శాహరాజకాలములో రాజకన్యాపరిణయము, శాహేంద్ర చరితము, వాదజయము, సర్వాంగ సుందరీవిలాసము, రాజమోహన కొరవంజి అను నాటకములను, శాహరాజేంద్రునిమీద పదములను విరచించెను. వాదజయ కొరవంజి యని యింకొక నాటకము కలదు. అదియును గిరిరాజ కవి విరచితమనియు, వాదజయ నాటకములోని కథయే అందలి యితివృత్తమై యుండవచ్చుననియు నే నూహించుచున్నాను. నాటకములలో కొరవంజి ఒక భేదము. ఈవిధమైన నాటకములలో ఎఱుకత పాత్ర తప్పక యుండును. ఇంచుకంత మార్పుతో రాజకన్యాపరిణయ నాటక కథయు రాజమోహన కొరవంజి నాటక కథయు ఒక్కటియే యగునేమో. ఈ రెండు నాటకములలోని కథయు నీ క్రిందిరీతి నభివర్ణితమయినది: రాజమోహన కొరవంజికథ యిది:

శ్రీ సుతతుల్యుడై చెల్వొందువట్టి
భోసలకుల శాహ భూపాలుమీద
చెన్నుగా మోహిత చిత్తయై రాజ
కన్యకామణి పరికాంతలు గొలువ
గరిమె తోడుత మును గదలివచ్చుటయు
విరహభరంబుచే వెతలఁ జెందుటయు
నెఱుకత వచ్చి తా నెఱుక చెప్పుటయు
గుఱుతుగా శాహేంద్రుఁ గూడియుండుటయు
అనిరొండి రాజమోహన కొరవంజి
పనువడి శాహేంద్రుపై నంకితముగ
ఘనతతో గిరిరాజ కవి రచియించె
జనులెల్ల మేలని సంతసిల్లగను.

ఇంచుమించుగా ఇతడు రచియించిన రాజకన్యా పరిణయ నాటకకథయు నిట్టిదే, చూడుడు:

శ్రీకరుండగు రాజశేఖరుండైన
యే కేంద్రసుతుఁడు శాహేంద్రుఁడు వింత
స్వారి రాగాఁ జూచి సఖిని దాఁ గూడి
యా రాజకన్యక యలరి మోహించి
వచ్చుటయు సఖియు వచ్చుట ముదము
హెచ్చు కన్యకు దాది కెలమి భాషణము
దనరంగ నా కన్య తలిదండ్రు లపుడు
మునుకొని వచ్చుట ముద్దుతనూజ
వితమెల్ల దాదిచే విని హరుషించి
సుతను శాహేంద్రుకు సొరిది నిచ్చుటయు
అన్నువ వితముల నమరిన రాజ
కన్యాపరిణయంబు ఘనతతోడుతను
గరిమను గిరిరాజ కవి విరచించె
ధరణిలో నాచంద్రతారమై పొగడ.

ఈ కవి రచియించిన శాహేంద్ర చరితము నిట్టిదే యగునేమో, పరిశీలింపవలసి యున్నది.

శాహరాజేంద్రుని కాలముననే కవిగిరియని ఇంకొక కవి యున్నాడు. అతడు రుక్మాంగద చరిత్రమును ద్విపదకావ్యముగా రచియించెను. ఈ కావ్యములో నీతడు తన వంశమును గురించి చేసిన అభివర్ణనము ననుసరించి చూడగా కవిగిరి గిరిరాజ కవి సోదరుడనియు, అతని పూర్తిపేరు వేంకట గిరికవి యనియు, ఇతడు లోహిత గోత్రుడనియు, బౌధశౌర్య జానకాంబల కుమారుడనియు తెలియుచున్నది. చూడుడీ క్రింది ద్విపదపంక్తులు:

"నిర్భరలోక వర్ణిత దయాశాలి [illegible]
దర్భవంశాంభోధి తారావిభుండు [illegible]
సుగుణుఁ డాపస్తంబ సూత్రుఁడుత్తమ శాహ [illegible]
నిగమాంత సుజ్ఞాన నిరతమానసు [illegible] పట్టణం
లోహిత గోత్రుఁడు లోలవ [illegible] విజయవాడ
గోహీర సమకె [illegible] గోష్ఠా [illegible] దుగానే కృష్ణ [illegible]
మంగళ దేవతా [illegible] ందువల్ల తిరుపతి [illegible]
చెంగమాంబి [illegible] గ్లకు చేదయింది - [illegible] వారు
సర్వం [illegible] ఇతరు లెవరికీ [illegible] రెండు
[illegible] ఎందరో మహా
[illegible] ందే తెలుసు. [illegible] భావము సోకినవారు —
[illegible] ఇందులో [illegible] రచించి, ఆంధ్రసాహిత్య
[illegible] మై నెల్లూరున్న [illegible] ఈ మహానుభావుల కందరకు,
[illegible] ఎట్టణ మేమిత్ర [illegible] వల్ల [illegible] ని ప్రతినిధులుగ గ్రహించితిని. ఈ

జానకాంబకు నిత్యసంతోష మొదవ
సుతు లుద్భవించిరి సుజనతి మెఱయ
అతులిత గుణశాలి యం దగ్రజుండు
సలలిత కీర్తి యజాత శత్రుండు
కులదీపనుండైన గోపనాహ్వయుఁడు

*  *  *

మార్తాండకులశాహ మహిపాలు సభను
కీర్తికెక్కినవాఁడు గిరిరాజ సుకవి
సంగీత కళ రహస్యముఁ గన్నవాఁడు
వెంగనార్యుండు వివేకధనుండు
ముప్పురి ప్రేమకు మూలమై వేడ్క
నివ్వటిల్లంగ నెన్నిక కెక్కువాఁడు
కమలాంబికా లబ్దకవితావితాన

*  *  *

కవిగిరి యను పేరు కలిగినవాఁడు".

రుక్మాంగద చరిత్రము తృతీయాశ్వాసాంత ద్విపదమునగూడ

"అని లోకవినుత దర్భాన్వయ జలధి
జనితుఁ డౌభళమంత్రి జానకాంబికయుఁ
గ్రమమున మన్నింపఁ గవిక దీవింప
కమలాంబికాదేవి కరుణఁ బోషింపఁ
బంకజాక్షుని పాదభక్తి యుక్తుండు
వేంకటగిరి కవి విష్ణుని పేర"

అని యుండుటవలన ఔభళమంత్రికి గోపన, గిరిరాజసుకవి, వేంగన, కవిగిరి యను వేంకటగిరి యని నల్వురు కుమారులని తెలియ వచ్చుచున్నది. ఈ గిరికవి విచిత్రరాయ పుత్రుడు ఖండోజీరా యని కోరేరణచే నీ కావ్యమును రచియించిన ట్లున్నది.

శోభానమే రాజ కవి యనుజుడయిన ఈ గిరికవికి శంస బిరుద ముండినట్లు కన్పట్టు

నగవరోద్ధారునికి నగసన్నిశరభోజి మహాలు సరస్వతీ
గగన వర్ణునికి గగనమధ్యకును విచిత్ర రాయావతంస
శంబరరూపునకు శంబరనయనకు
అంబుజనాభునికి అంబుజగేహకును॥శో ష్ఠవారు ప్రక
'ండాగారము
త్యాగేశ మిత్రునికి త్యాగేశ సోదరికి ఉన్నది.
భోగీశశాయికిని భోగేశ వేణికిని ॥శోభానమే॥ లేదు,
మంగళం॥

ఈ పల్లకిసేవ ప్రబంధరత్నము చివర కృతికర్త రచియించిన ద్విపద కలదు. అది యిది: దీనివలన ప్రణీతమయిన అభినయదర్పణ మను గ్రంథ మున్నది. ఈ గ్రంథములోని యాశ్వాసాంత గద్య మిట్లు:

"ఇది శ్రీ కమలాంబికా విమల కృపాలబ్ద
సాహిత్య కళావతంస లోహిత సగోత్రావహో
బళార్యపుత్ర దర్భకులపావన గిరిరాజ కవిత
రానుజ విచిత్ర రాయావతంస ప్రణీతంబైన
అభినయదర్పణం బను మహాగ్రంథంబున
ద్వితీయానుబింబమన్నది సంపూర్ణము."

గిరిరాజకవికి వెంగన, గిరికవి యని యనుజు లిరువు రున్నను ఈ విచిత్రరాయావతంస బిరుదాంచితుడు గిరికవి యని భావించుటకు కారణము కృతికర్త దీనిని ఖండోజీరాయని కంకితము కావించుటయే. ఖండోజీరాయ ప్రేరణమున నే ఈతడు రుక్మాంగద చరిత్రమును ద్విపదకావ్యముగా రచించెను. అహోబళార్య డెన్నను ఔభళన్న యన్నను ఒక్కటే. ఈ విచిత్ర రాయావతంస కవి ఖండోజీరాయని తన యభినయదర్పణమున నిట్లభివర్ణించి యున్నాడు:

కాశకగోత్ర రాకాచంద్రుఁడై మించి
ప్రబల ఖండేరాయ భక్తి గలిగి
పొంగుచు కృష్ణాజి గంగాజి యవఁగాంచె
గురుజాయి నాథుని నరసవిభుని
అతనికిఁ బుత్రుఁడై యలరు విచిత్రరా
యక్షమా సర్వమి(?)భాగాంబయందు
నగశైరి శచియందు నల జయంతునిఁబోలె
రమయందు హరి రతీగమునిఁబోలె
నినుగాంచె నలసమాన నిరుపమాన
దానధారా.........తాంభోనిధీంద్ర
తోయ కాక్షేయ మండిత ధోరజేయ(?)
రాజిత సుకీర్తిగేయ ఖండోజీరాయ॥

పై పద్యమంతయు తప్పుల తడిక. * గణభంగము కలదు. మొత్తముమీద ఖండోజీరాయడు విచిత్రరాయ క్షమానాథుని కుమారుడని మాత్రము అర్థము చేసికొనవచ్చు నేమో.

పైని చెప్పినవారు కాక వాసుదేవ కవియని ఇంకొకరు కలరు. పార్వతీ కల్యాణములోని చివరి "వాసుదేవ కవి వచ స్సంతుష్టాయు" అను మంగళగీత మున నుదాహృతుడైన వాసుదేవకవియే ఈయన. ఈయనయు శాహజీ యాస్థానమున నున్నవాడే; కవియు, పదకర్తయు కూడను. ఈయన తెలుగులో యాశాహరాజేంద్రునిమీద శృంగార కీర్తనలు రచించెను.
ర 502 తెలుగువా డగునో కాదో.

శేషాచలపతి రచియించిన శాహరాజ విలాసమును పూర్వోక్త నాటకములవంటిదే. గ్రంథకర్తయే యిందలి నాటక కథనిట్లు చెప్పుచున్నాడు:

"శ్రీకర గుణశాలి యేకేంద్రసుతిమాళి
　　స్వారి రాగా నొక్క సరసిజాక్షి
చూచి మోహించుచు శుక ముఖ్యదూతిక
　　లంపి మన్మథ వివశాత్మ యగుచు
వనకేళి మీవకేతను పూజ లొనరించి
　　శుభగూఢకంబైన సూక్తివలన
అవిలంబముగ జెలుల్ ప్రాణేశుడౌ శాహ
　　విభునితో గూర్చిన విభవమెల్ల
　　లలితగతి శాహరాజ విలాసమనెడు
　　నాటకము సేయు బుధులు సంతసము నొంద
　　ధీచమత్కృతి వలయు శేషాచలపతి
　　అష్టభాషా కవిత్వంబు లమరు సుకృతి."

కృతికర్త అష్టభాషలలో కవిత్వము చెప్పగలడిట్టయుట. ఇతడు ఈ నాటకమున శాహేంద్రుని వంశావతారక్రమమును ద్విపద చరణములలో నభివర్ణించియున్నాడు. శేషాచలపతి యీ కృతి రచించు నాటికే శాహమహారాజు సోదరులు శరభేంద్ర తుళజ భూపాలు రుండుటవలన వారినిగూడ నిందుదాహరించెను. ప్రాయికముగ నీ శేషాచలపతి యీవరలో నుడివిన సరస్వతీ కల్యాణ కృతికర్తయు చొక్కనాథ మహామాత్యుని పుత్రుడు కావచ్చును.*

శేషాచలపతి రచియించిన శాహరాజ విలాసము అను నాటకము తంజావూరి పాలకుడైన విజయరాఘవ నాయకుడు రచించిన రఘునాథాభ్యుదయ నాటకము వంటిదే. శేషాచలపతి, గిరిరాజ కవులు తమ ప్రభువులమీద రచించిన నాటకములకు విజయరాఘవ నాయకుడు పెట్టినదే వరవడి. రఘునాథాభ్యుదయమును గురించి యిట్లు వ్రాసియున్నాను:

"ఉలా ప్రబంధము తమిళమున నతి పురాతనమైనది. తమిళ భాషకుగల మొట్టమొదటి సంపూర్ణ వ్యాకరణము "తొల్కాప్పియము". ఈ వ్యాకరణములో "బురత్తిరై ఇయల్" అను సూత్రమున ప్రత్యేకముగా ప్రబంధములను గురించి చెప్పబడినది. ఇవి దేవతల రథోత్సవములకు ప్రసిద్ధపురుషుల గజోత్సవములకు సంబంధించిన వర్ణనలతో గూడినవి. ఇందలి (రఘునాథాభ్యుదయమునందలి) యితివృత్తము అటువంటి యుత్సవము తమ వీథిని సాగుచున్నప్పుడు దానిని జూచుట తటస్థించు సప్తవిధ గణికలలో నొక విధమునకు జెందిన కన్యక ప్రేమ ప్రకటన గాథకు సంబంధించినది."

విజయరాఘవ నాయకుని రఘునాథాభ్యుదయమును లక్ష్యముగా బెట్టుకొని రచించినవే రాజకన్యాపరిణయ, శాహరాజ విలాసాదులు. విజయరాఘవ నాయకుడు రఘునాథాభ్యుదయము రచియించిన నాటినుండి పరిపాలనముసేయు ప్రభువులనే నాయకులను జేసి యిటువంటి ప్రబంధములను రచియించుట యొక విలాసమైనది. ఇటువంటి రూపకములు ఎక్కువగా విరచితములైనవి మహారాష్ట్ర భూపతుల కాలములోనే.

బాలకవి సుబ్బన్న:—ఇతడుకూడ శాహరాజేంద్రుని కాలమువాడే — లీలావతీ శాహరాజీయమని యొక నాటకము రచియించినాడు; లీలావతీ శాహరాజేంద్రుల పరిణయగాథ యిది. లీలావతి యొక రాజకన్యక. ఆమె శాహభూపాలుని చూచి మోహించి యాతనిని భర్తగా వరించును; తన తండ్రి కీ యుదంతము నెరిగించును. తండ్రి వల్లె యని యామెను శాహనృపాలుని కిచ్చి పెండ్లిచేయును.

బాలకవి రచియించిన పంచకన్యాపరిణయమను నాటక మొకటి కలదు. ఈ బాలకవి ప్రాం కముగా బాలకవి సుబ్బన్నయె యగును. శాహ...ట్టణం ద్రుని కోరికమీద కవి తానీ గ్రంథ... గ్రసని నట్లు ఇట్లు చెప్పుకొనుచున్నా... విజయవాడ

"వ|| ...సకల జ... దుగానే కృష్ణ... పురంబును మంజుళం... దువల్ల తిరుపతి... వారు ...గ్లకు చేపయింధి- ... రెండు కుమారుండయి... ఇతరు లెవరికీ ... ఎందరో మహా నాడు ...ంద తెలుసు. ... భావము సోకినవారు — వమాగ్లె ఇందులో ... రచించి, ఆంధ్రసాహిత్య ...మి సెల్లూరున్న ... మహానుభావుల కందరకు, ...ట్టణ మేమి... ...గ గ్రహించితిని. ఈ

* శాహజీయమని కీర్తనల గ్రంథమొకటి కలదు. అది చొక్కనాథ కృతముగా గన్పట్టుచున్నది. ఏతత్కృతి కర్త చొక్కనాథుడును శేషాచలపతి తండ్రి చొక్కనాథుడును ఒక్కరేగు యగుదురేమో.

మొదల సుదాముండు మురవైరితోడ
కదిసి కందుకమాడగా నోడి మఱుది
నంబున గెలిచెదనని వచ్చుటయును
అంబుజాక్షుఁడు వాని యభిలాష దీర్ప
నదలిరాఁగాఁ బంచ కన్యకామణులు
ఎదురైనఁ జూచి మోహించి వారుండు
భవనముల్ దెలియ బాపని వొక్క వనిచి (?)
సవరణమిూఱఁ దాఁ జనుదెంచి యా సు
దాముని గాంచి తద్దయు వారి చెల్వ
మేమఱు వానితో వివరించుటయును
అబ్బాలుఁ దటుఁ బోయి యాగృహం బరసి
నిబ్బరంబున వచ్చి నీరజాక్షునకుఁ
దెలుప సుదాముని దిక్కు వీక్షించి
పలికె వెన్నుఁడు వారిపైఁ దన మనసు
నిలిచెఁ గావున వేఁడె నీ నేర్పు మెఱయ
వలనాక్షులకు నాకు సంభోగ మొనరఁ

జేయు మనుటయు మచ్చిక వల్లె వతడు (?)
నా యానతిని బూని యబ్బాలు వెంటఁ
దగఁబోయి చెలుల నుద్యానవనమున
కెనుపనున్న కొలంకు కేతేర వారి
సకిచేతఁ గార్యంబు జతఁగూర్చి వచ్చి
ప్రకటంబుగా రమాపతికిఁ దెల్పుటయు
నంత నందఱు గొల్వ నటకేగి సఖుల
నంతంత నిలిపి తా నంబుజాకరము
చెంతకుఁ బోయి యాస్త్రీల చేలములు
నంతయుఁ గొని వార లడుగవచ్చినను
బెదరించి పెండ్లాడె పిద పాక రౌకరు
కదనమాడుచు నుండగా మాన్పి వారి
నతిశయంబునఁ గృష్ణు డలరించె నగాడి
కతము మించిన పంచకన్యల పెండ్లి
బాలకవీం ద్రాంధ్రభాషచే నీవు
మేలిమి గనుపట్టె మెఱయ నీ వేళ
మాకు ముదంబుగా మంజు నాటకము
వీకతో రచియింపుమీ కవు లెన్న"

పై ద్విపద పంక్తులవలననే యీ నాటకము నందలి ఇతివృత్తము కూడ బోధపడుచున్నది.

శోభాన.

నగవరోద్ధారునికి
గగనవర్ణునికి గగనమూర్తికి
శంబరరూపునకు శంబరనయనునకు
అంబుజనాభునికి అంబుజగేహకు

త్యాగేశ మిత్రునికి త్యాగేశ సోదరికి
భోగీశశాయికిని భోగేశవేణికిని ||శోభాన||
మంగళం||

---

. శాహరాజ దండకమని యీ మహారాజుమీద చెప్పిన యొక దండకము కలదు. దాని నెవ్వరు చెప్పిరో తెలియదు.

ఈ పల్లకిసేవ ప్రబంధరత్నము చివర కృతికర్త రచియించిన ద్విపద కలదు. అది యిది: దీనివలన

# రాజధానీ నిర్ణయ కలాపం



శ్రీ సూరంపూడి సీతారామ్

ఆంధ్రరాష్ట్రానికి రాజధాని నగర నిర్ణయంకోసం ఇప్పటికప్పుడే మూడుతడవలు పెద్ద పెట్టున మథన జరిగింది. ఏ ఒక్క పార్టీకీ మెజారిటీ లేని ఆంధ్రశాసన సభ ఇటువంటి క్లిష్టవివాదాన్ని పరిష్కరించడానికి పూనుకోవడం సాహసమే. కాని, అన్ని పార్టీలవారో కనీసం కొన్ని పార్టీలవారో చేరి సమరస భావంతో, రాజకీయపాక్షిక ప్రయోజనాలను విస్మరించి తత్క్షణం నిర్ణయం చెయ్యవలసిన దీ సమస్య. పార్టీ ప్రయోజనాలను విస్మరించగలిగితే ఇది మన రాజకీయనాయకులు పరిష్కరించలేనిది కాదు. పార్టీ ప్రయోజనాలను విస్మరించలేకపోతే కనీసం అధికసంఖ్యాకులైన వారి అభిమతాన్నో, ప్రజానీకం అభిమతాన్నో మన్నించి ప్రజాస్వామ్యసిద్ధాంతాలకు కట్టుబడి ఉండాలని దేశం ఆశిస్తుంది. కాని, మన రాజకీయనాయకులు అధికసంఖ్యాకుల అభిమతాన్ని పాటించే ధోరణిలో కూడా లేరు. తిరిగి ఎన్నికలు వచ్చేలోగా తమతమ పార్టీలకు స్థాన బలం చిక్కించుకోవాలనే ఉద్దేశంతో అన్ని పార్టీలూ ఈ రాజధాని సమస్యను రాజకీయ సాధనగా వినియోగించడానికి యత్నిస్తున్నాయి. పార్టీలను బలపరుచుకోడంలో పెద్ద దోషంలేదు. కాని పార్టీ ప్రయోజనాలకోసం శాశ్వత రాజధాని నిర్ణయంవంటి సమస్యను వినియోగించబూనడం దేశానికి అత్యంత హానికరం. ఇటువంటి పార్టీలవల్ల, రాజకీయాలవల్ల ప్రజాస్వామ్యం అడుగంటక తప్పదు. ఇప్పటికే దేశంలో ప్రజాస్వామ్యానికి గొడ్డలిపెట్టువలె ప్రాంతీయ విద్వేషాలు, వర్ణవైషమ్యాలు, వ్యక్తిగత వైరాలు నలుమూలలా వ్యాపించాయి; ఈరీతిగా పార్టీ ప్రయోజనాలను సాధించదలుచుకోడం బొత్తిగా అవివేకమని ఏపాటి రాజకీయపరిజ్ఞానంకలవారికైనా తెలియకపోదు.

మద్రాసునగరాన్ని మినహాయించి ఆంధ్రరాష్ట్రం స్థాపించడంలో గల ఆర్థికాది సమస్యలను విశదీకరించడానికి నియమించబడిన జస్టిస్ వాంఛూగారు శాశ్వత రాజధానిని, తాత్కాలికరాజధానిని విడివిడిగా ఏర్పాటు చేసుకోవాలని సూచించారు. మద్రాసునగరంలోనే తాత్కాలిక రాజధాని [illegible] కోడం ఉత్తమోత్తమమనీ, అది సాధ్యపడనిపక్షంలో విశాఖపట్టణం—వాల్తేరులకు తాత్కాలిక రాజధాని తరలించి, గుంటూరుకూ, కృష్ణానది దక్షిణతీరానికీ మధ్య శాశ్వతరాజధాని నిర్మించాలనీ జస్టిస్ వాంఛూ సూచించారు.

వాంఛూగారి పరిశీలన సమయంలో దాదాపు అన్ని పార్టీలవారూ మద్రాసులో తాత్కాలిక రాజధాని ఉండాలని వాదించారు. ఒక్క కృషికార్ లోక్ పార్టీ మాత్రం రంగాగారి నాయకత్వంక్రింద తిరుపతి క్షేత్రంగా చంద్రగిరికీ ఆరోగ్యవరానికీ మధ్య శాశ్వత రాజధాని స్థాపించాలని సూచించింది. అంటే మద్రాసులో తాత్కాలిక రాజధాని ఉండాలంటూనే శాశ్వత రాజధాని ప్రసక్తి తెచ్చి, ఇతర పార్టీలతో సఖ్యతతో నిర్ణయించుకోవాలనే ఆలోచనైనా లేకుండా, అప్పటికప్పుడే అనవసర వివాదాలకు విషమపరిణామాలకు దారితీసినది రంగాగారిపార్టీ.

జస్టిస్ వాంఛూకూడా తరవాత తమ నివేదికలో శ్రీబాగ్ పాక్టునుగురించి ప్రస్తావిస్తూ, రెండు ప్రాంతాల కాంగ్రెస్ నాయకులమధ్య జరిగిన ఈఒడంబడికను మన్నించదలిస్తే ద్వితీయపక్షంగా తిరుపతిలో శాశ్వతరాజధాని స్థాపించుకోవచ్చునన్నారు. దీనితో రంగాగారికీ, వారిపార్టీకీ ఒక నినాదమంటూ కుదిరి వచ్చింది.

కృషికార్ లోక్ పార్టీవారు ఈవిధంగా రాజధాని తిరుపతి కెందుకు కట్టబెట్టడానికి ప్రయత్ని[illegible]ట్టణం [illegible]ంగ్రెస్‌ని 1951 లో జరిగిన ఎన్నికల్లో [illegible]న్న విజయవాడ జిల్లాల్లో కృషికార్ లోక్ పార్టీ ఎదుగానే కృషికా[illegible] పొందింది. రంగాగారుకుందువల్ల తిరుపతి [illegible] కల్లో ఓడిపోయారు గ్లకు చేదయింది- [illegible] వారు రెండు పార్టీకి లభించి ఇతరు లెవరికీ [illegible] ఎందరో మహా పరిస్థితినిబట్టిం దే తెలుసు. [illegible] భావము సోకినవారు — కుళ్ల ఇందులో [illegible] మై సెల్లూరున్న [illegible] రచించి, ఆంధ్రసాహిత్య [illegible]ట్టణ మేమి[illegible]. ఈ మహానుభావుల కందరకు, వల్ల [illegible]ని ప్రతినిధులుగ గ్రహించితిని. ఈ

ఆంధ్రదేశపు రాజకీయాల తీరు తెన్నులు గమనించేవారికి ఈ బలాబలాలకూ, అసలు సమస్యకూ గల సంబంధం ఇట్టే బోధపడుతుంది. సర్కారు జిల్లాల్లో స్థానబలం కోల్పోయి, అనుకోకుండా ఉత్తర సర్కారు జిల్లాల్లో బలం ఆర్జించిన రంగాగారిపార్టీ, రాయలసీమలో తమ బలం పెంపొందించుకోడంకోసం పన్నుగడ పన్నింది. కమ్యూనిస్టులకూ కాంగ్రెస్ వారికీ మధ్య సర్కారుజిల్లాల్లో నిలవలేక, కమ్యూనిస్టులకు బలంలేని రాయలసీమలో కాంగ్రెస్‌కు గల బలాన్ని విచ్ఛిన్నంచేసి తమ బలం పెంపొందించుకోవాలని ఎత్తు వేశారు.

పార్టీలన్నీ ఒకే ధోరణిలో రాజకీయాలు నిర్వహించుకుంటున్న పరిస్థితిలో ఏదో ఒక్క పార్టీపై ఇటువంటి నిందమోపడం అన్యాయం కావచ్చు. కాని, ఆంధ్రరాష్ట్రం జన్మించనున్న సమయంలో, సమరస భావంతో ప్రాంతీయ దురభిమానాలను అపనయింపచేసి, ఉదారహృదయంతో అందరూ చేరి రాజధాని సమస్యను పరిష్కరించడానికి లభించిన ఒకే ఒక్క అవకాశాన్ని భగ్నపరిచిననిందను కృషికార్ లోక్ పార్టీ నాయకవర్గమే భరించాలి. తక్షణప్రయోజనాలకంటె దేశప్రయోజనాలను ప్రధానమని యెంచి కృషిచేస్తే, తక్షణ ఫలితాలమాట ఎలావున్నా దూరదృష్టితో చూస్తే అది తమపార్టీకే ప్రయోజనమనీ, అట్టి కృషివల్ల తమ నాయకత్వానికి ఔన్నత్యం లభించగలదనీ అర్థం చేసుకోగల రాజకీయ నాయకులే లేనప్పుడు, ఏఒక్క పార్టీనో విమర్శించి ప్రయోజనం లేదు. కాని ఒక విషమసమస్యను రాజనీతిజ్ఞతతో పరిష్కరించ గల అపూర్వావకాశం లభించినప్పుడు, ఆ అవకాశాన్ని తామై చేజేతులా భంగపరిచిన కీర్తి కృషికార్ లోక్ పార్టీకే దక్కింది!

## శ్రీబాగ్ పాక్టు

శోభ

...యలసీమకు చెందని రంగా, లచ్చన్నగార్ల

నగవరోద్ధారునికి ...యకులే శ్రీబాగ్ పాక్టును

గగనవర్ణునికి గగనమ... ప్రచారం ప్రారంభిస్తే? ఇంక

...లాయకు లేమనగలరు? రాయల

శంబరరూపునకు శంబరన...

అంబుజనాభునికి అంబుజగేహ... నాయకులు రాజధాని

ఇవ్వాలనడంలో

త్యాగశమిత్రునికి త్యాగశసోదరికి రాయలసీమలో

భోగిశాయికిని భోగశవేణికిని ||శోభ..||

మంగళం||వ్య

ఈ పల్లకిసేవ ప్రబంధరత్నము చివర కృతికర్త రచియించిన ద్విపద కలదు. అది యిది: దీనివలన రంగాగారి ననుకరించక పోతే, శ్రీబాగ్ పాక్టును కాంగ్రెస్ నిరాకరించినట్లు లెక్కవుతుంది.

స్వాతంత్ర్యం లభించిన అనంతరం పరిణామం చెందిన పరిస్థితుల్లో శ్రీ బాగ్ పాక్టును అమలుజరపడం అనగా ఏమిటి? భారతదేశమంతటా సర్వతోముఖమైన ఆర్థికాభివృద్ధికి కేంద్రప్రభుత్వం దృఢసంకల్పంతో కృషి చేస్తోంది. భారతప్రభుత్వం దృష్టిలో ఏ మారుమూలప్రాంతమైనా సరే అభివృద్ధి కార్యక్రమానికి సంబంధించినంతవరకూ అనాదరణకు, అశ్రద్ధకు గురికాకూడదు. ఆయాప్రాంతాల సహజసంపదనుబట్టి సమగ్రమైన అభివృద్ధి కార్యక్రమాలను అనుసరించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. భారత ప్రభుత్వం ప్రకటించిన పంచవర్ష ప్రణాళికలో చేర్చబడనిప్రాంతమే లేదని చెప్పడం అతిశయోక్తికాదు. అయితే ధనాభావంవల్ల ఒకొక్క కార్యక్రమం ముందూ, మరొకటి వెనుకా అమలు జరుగుతాయి; అంతే. ఈ పరిస్థితిలో రాయలసీమ ఆర్థికాభివృద్ధికి ప్రత్యేకశ్రద్ధ చూపాలనడం హాస్యాస్పదమైన విషయం. రాయలసీమలో ఆర్థికాభివృద్ధికి "ప్రత్యేక శ్రద్ధ" చూపడంకోసం సర్కారుజిల్లాలలో తక్షణ ప్రయోజనాలు సాధించగల కార్యక్రమాలపట్ల అశ్రద్ధ చూపలేరు. ఏప్రాంతపు అభివృద్ధీ మరొకప్రాంతపు అభివృద్ధికి నిరోధంకావడం అనేది ఇంక తలపరాని విషయం.

శ్రీ బాగ్ పాక్ట్‌లోని మరొక ముఖ్య అంశం: "ఏ ఒక్క ప్రాంతానికీ ప్రాధాన్యం రాకుండా కాపాడ్డంకోసం" విశ్వవిద్యాలయం, రాజధాని, హైకోర్టులను మూడు ప్రాంతాలలో స్థాపించాలని నిర్ణయించబడింది. వీనిలో రాజధాని ఏ "ప్రాంతానికి" చెందాలనే నిర్ణయాన్ని రాయలసీమ వాసులకు విడిచిపెట్టాలి అని నిర్ణయించబడింది. ఏ నగరంలో దేనిని స్థాపించినా, సహజ నైసర్గికస్థితి అనుకూలించకపోతే ఆ నగరం ఎలాగూ అభివృద్ధికాదని, ఏ కేంద్రనగరాన్ని పరిశీలించినా బోధపడుతుంది. రాజధాని మొదలైనవి లేనంత మాత్రంచేత సహజంగా వృద్ధిపొందగల ఏ నగరాన్నీ వృద్ధిపొందకుండా నిరోధించడం మానవ సాధ్యంకాదు. [విజయవాడను పరిశీలించిన జస్టిస్ వాంఛూగారు, రాజధాని ఇక్కడ స్థాపించబడినా లేక పోయినా ఈ నగరం వృద్ధిపొంది తీరుతుందని తమ నివేదికలో వ్రాశారు.] ఇంక ప్రాంతీయ దురభిమానంతో, పార్టీ శక్తులతో స్వార్థపు పట్టుదలతో అల్ప ప్రయోజనాలకోసం రాజధానీ నగర నిర్ణయానికి దిగి

వట్లయితే, ఏ నగరమూ వృద్ధిపొందకపోగా, ఏ ప్రాంతానికైనా ప్రయోజనం చివరకు శూన్యమే అవుతుంది. ఆంధ్రదేశానికి గర్వకారణం కాదగిన రాజధాని నగరాన్ని ఏర్పాటుచేసుకోలేని కీర్తిమాత్రం మననాయకులకు దక్కుతుంది.

దేశంలోని సకల రాజకీయ, సాంఘిక, సాహిత్య కళా స్రవంతులు నలుమూలలనుంచీ వచ్చిచేరే పుణ్యస్థలమే రాజధాని. ఆ దేశం నాగరికత కది ప్రతినిధి. ఆ జాతి గౌరవాని కది ప్రతిబింబం. ఆ దేశపు ఆర్థిక బలానికి, వాణిజ్య పారిశ్రామిక జీవనానికి అది ఆయువుపట్టు.

భారతదేశంలో వృద్ధిచెందిన ఏ నగరాన్ని గమనించినా ఈ సత్యం బోధపడుతుంది. ఎంతమంది మహారాజులు ఎన్నెన్ని లక్షలు కోట్లు రూపాయలు వెచ్చించి ఎంతెంత ఉన్నతభవనాలు నిర్మించినా, అన్నీ జాతీయ కేంద్రాలు కాలేదు. ప్రజలు, నాయకులు సహజకేంద్రాలకు దోహదమిచ్చిన చోట ఆ నగరాలు పెరిగి ఆ ప్రాంతానికి భారతదేశంలో ఉన్నతిని తెచ్చిపెట్టాయి. కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలటువంటివే. ఇప్పుడు మనకు మద్రాసునగరం పోవడంతో ఆంధ్రదేశానికి తగిన రాజధానిని పెంపొందించుకోడానికి అవకాశం కలిగించవద్దా?

ఇటువంటి అవకాశాన్ని కల్పించడం పోయి "ఏ ప్రాంతిమూ ప్రధానంగా అభివృద్ధి పొందకుండా కాపాడ్డంకోసం" శ్రీబాగ్ పాక్టు కంకణం కట్టుకుంది. ఏ ఒక్క ప్రాంతంలోని నగరమూ ప్రధాననగరంగా పెంపొందకుండా నివారించ బూనుకోవడం ఆంధ్ర జాతీయ జీవనాన్ని అవమానించుకోవడం కాక మరేమిటి? నేటి పరిస్థితులలో శ్రీబాగ్ పాక్టును రద్దుపరచాలని చెప్పకతప్పదు. కొత్త రాజ్యాంగంలో, సర్వతో ముఖమైన ఆర్థికాభివృద్ధికి కృషిచెయ్యవలసిన ఈ కాలంలో శ్రీబాగ్ పాక్టువంటివి చెల్లకూడదు!

## పార్టీల పట్టీలు

శ్రీబాగ్ పాక్టు అనే సుడిగుండంలో పడిపోయిన రాజధానినిర్ణయసమస్య విషమంగా పరిణమించింది. తక్షణ ప్రయోజనాలకోసం కూటరాజనీతి ప్రదర్శించడానికీ, తక్షణఫలితాలు ఎంత అల్పమైనవైనా వానికోసం పార్టీ పరపతినీ, దేశక్షేమాన్నీ బలిచెయ్యడానికీ పనుదియ్యని రాజకీయ నాయకులు గబగబా పట్టీలుకొట్టడం ప్రారంభించారు. నాయకులు దూరదృష్టి, వాస్తవరాజనీతిజ్ఞత కలవారైతే ఈ మాదిరిగా పట్టీలు కొట్టవలసిన పని లేకపోయేది. కాని మహాటవి ప్రవేశించిన ఒంటరి బాటసారివలె, చెట్టుచూసి పుట్టచూసి భూతాలని, క్రూరమృగాలని భయపడుతూ బెదురుతూ పరవళ్ళు తొక్కే రాజకీయనాయకులకు యుక్తాయుక్త వివేచన, స్వధర్మజ్ఞానం ఎక్కడనుంచి వస్తాయి?

మద్రాసు లేని ఆంధ్రరాష్ట్ర స్థాపన తథ్యమనీ, వెంటనే తాత్కాలిక రాజధానిని ఏర్పాటుచేసుకోవాలనీ తెలియరాగానే వివిధపక్షాలవారు మంతనాలు ప్రారంభించారు. పార్టీలు ఏమైనా, దేశం ఏమైనా లక్ష్యపెట్టక ముఖ్యమంత్రిపదవి ఒక్కటే జీవితపరమావధిగా పెట్టుకున్న ప్రకాశంపంతులుగారు భారత ప్రధాని నెహ్రూచేత ఢిల్లీకి రాయబారాలకు పిలిపింపచేసుకున్నారు. దీనితో అధికారం కాంగ్రెస్, ప్రజాసోషలిస్టు పార్టీలకు మాత్రమే ధారాదత్తం కాకుండా చూసుకోవాలని రంగాగారి పార్టీ ఆత్రపడింది. ఏ గాలిపాటువల్లనో ప్రకాశంగారు ముఖ్యమంత్రి కాకపోవడం సంభవిస్తే, ప్రజాసోషలిస్టు పార్టీతో నిమిత్తం లేకుండా కృషికార్ లోక్ పార్టీని కూడగట్టుకుని తాము ముఖ్యమంత్రి కావచ్చునని నీలం సంజీవిరెడ్డిగారు ఆశపడ్డారు.

రాయలసీమకు రాజధాని అంటగట్టాలనే నినాదాన్ని సంజీవిరెడ్డిగారందుకుని కృషికార్ లోక్ పార్టీ సభ్యుల్ని ఆంధ్రశాసనసభ కాంగ్రెస్ పార్టీలో సహసభ్యులుగా (*Associate Members*) చేర్చుకున్నారు. అయితే ప్రకాశంగారి పార్టీకూడా చేరితేగాని శాసనసభలో మంత్రివర్గాన్ని నిలబెట్టుకోగల బలం చేకూరదు. ప్రకాశంగారినీ వారి పార్టీనీ అంది తెచ్చుకోక తప్పలేదు కాంగ్రెస్‌కి.

ఏ నగరాన్ని ఎంచితే ఎవరిపార్టీ బలపడిపోతుందో, ఎవరికి స్థానబలం చిక్కిపోతుందో అనే ఆదుర్దాతో మూడుపార్టీలవారూ కుట్ర పన్నినట్లు రాయబారాలు సాగించి, ఒక్కొక్క నగరాన్నే చర్చించి త్రోసిపుచ్చుతూవచ్చారు. విశాఖపట్టణం రాయలసీమవాసులకు దూరమయింది. కాంగ్రెస్‌ని పరాభవించి కమ్యూనిస్టుల్ని ఎన్నుకున్న విజయవాడ కాంగ్రెస్‌వారికి గిట్టలేదు. ముందుగానే కృషికార్ [illegible]
లోక్‌పార్టీవారు పేరుచెప్పినందువల్ల తిరుపతి [illegible] వారు
సంజీవిరెడ్డి ప్రకాశంగార్లకు చేదయింది - [illegible] రెండు
మైన అనంతపురం ఇతరు లెవరికీ [illegible] ఎందరో మహా
రెడ్డిగారికి ముందే తెలుసు. [illegible] భావము సోకినవారు —
నందువల్ల ఇందులో [illegible] రచించి, ఆంధ్రసాహిత్య
ఏకమై నెల్లూరున్న [illegible]. ఈ మహానుభావుల కందరకు,
పట్టణ మేమి [illegible]
వల్ల [illegible] ని ప్రతినిధులుగ గ్రహించితిని. ఈ

అందరూకలిసి పట్టంగట్టారు. కర్నూలులో తాత్కాలిక రాజధాని ఏర్పాటుకు సమ్మతించినవారిలో లచ్చన్నగారు, వారి పార్టీకూడా ముఖ్యులే.

ఈ మూడుపార్టీలూ ఏకమై ఆంధ్ర శాసన సభ్యుల సమావేశంలో (జూన్ 6) కర్నూలును జెయించారు. ఇది మొదటిసారిజరిగిన యజ్ఞం.

మద్రాసు శాసనసభ ఆంధ్రరాష్ట్రనిర్మాణ శాసనాన్ని చర్చించినప్పుడు రెండవసారి రభస వచ్చింది. తాత్కాలిక రాజధాని పేరు కర్నూలు తీసివేసి విజయవాడ ఉంచాలని కమ్యూనిస్టుపార్టీ, తిరుపతి ఉంచాలని కృషిక్ లోక్ పార్టీ సవరణలు ప్రతిపాదించాయి.

కృషిక్ లోక్ పార్టీ ఈ విధంగా మారడానికి కారణం కాళహస్తి ఎన్నిక. సంజీవిరెడ్డిగారు ఆంధ్ర శాసనసభకు ఎన్నిక కావాలనే సంకల్పంతో చిత్తూరు జిల్లా కాళహస్తినుంచి కాంగ్రెస్ శాసనసభ్యునిచేత రాజీనామా పెట్టించారు. రాయలసీమలో బలం సంపాదించుకోవాలని మొదటినుంచీ పట్టుదలతో పనిచేసిన కృషిక్ లోక్ పార్టీవారి కిది కన్నెర్ర అయింది. శాసనసభ కాంగ్రెస్ పార్టీలో సహాసభ్యులైనంత మాత్రాన ఎన్నికల్లో పోటీచెయ్యడానికి హక్కు పోదంటూ కృషిక్ లోక్ పార్టీవారు సంజీవిరెడ్డిగారి ప్రత్యర్థిని బలపరిచారు. ఈ సమయంలోనే కృషిక్ పార్టీలో సంజీవిరెడ్డిగారు భేదాలు కల్పించారు. లచ్చన్న మొదలైనవారు ప్రత్యర్థిని బలపరిస్తే, పి. తిమ్మారెడ్డిగారు సంజీవిరెడ్డిగారిని బలపరిచారు. దీనితో కృషికార్ లోక్ పార్టీ కాంగ్రెస్ కి ఎగురు తిరిగింది.

తిరుపతినుంచి కర్నూలుకు, కర్నూలునుంచి తిరుపతికి మతిం ఎందుకు మార్చుకోవలసి వచ్చిందోవివరిస్తూ,లచ్చన్నగారు తమనీ తమపార్టీవారినీ తొందర పెట్టేసి ఒప్పించారని చెప్పారు. వారు పార్టీ సభ్యులికి చిత్తం వచ్చినట్లు వోటుచెయ్యవచ్చునని స్వేచ్ఛనిచ్చారు. అయిదుగురు ఆంధ్రేతర సభ్యులు ...ర్నూలుకు అనుకూలంగా వోటుచెయ్యడంతో ...వాడ సవరణ వీగిపోయింది. తిరుపతికి చెప్పుకో... ...పమ లేదు.

...ంత్రివర్గ నిర్మాణంకోసం ప్రకాశం ...సంజీవిరెడ్డిగార్ల మధ్య నడిచిన ...ఎన్నికావు. ప్రకాశం ...ద కార్యవర్గాన్ని ...పార్టీని నట్టేట ...లూగారి

నైఖరి గమనించిన సంజీవిరెడ్డిగారు ముఖ్యమంత్రిపదవిని ప్రకాశంగారి కొప్పగించి తాము ఉప ముఖ్యమంత్రి అయినారు. కృషిక్ లోక్ పార్టీని విచ్ఛిన్నంచేసి గారికి రాయలసీమలో స్థానంలేకుండా చెయ్యడం కోసం సంజీవిరెడ్డిగారు భేదోపాయం ప్రయోగించారు. రాష్ట్రనిర్మాణ కార్యక్రమంలో త్రివేదీగారికి సహాయపడిన అనధికారసంఘంలో సభ్యత్వానికి పనికి వచ్చిన లచ్చన్నగారు కాంగ్రెస్ మంత్రివర్గంలో సభ్యత్వానికి పనికిరాలేదు. కాళహస్తిలో సంజీవరెడ్డి ఎన్నికకుతోడ్పడిన తిమ్మారెడ్డిగారిని మంత్రివర్గంలోకి తీసుకున్నారు. కర్నూలు నిర్ణయానికి వ్యతిరేకులైన కాంగ్రెస్ వారిలో ముఖ్యులు పట్టాభిరామారావు గారికి మంత్రి పదవినిచ్చి మొత్తం కాంగ్రెస్ పార్టీచేత (అయిదుగురు మినహా)కర్నూలుకు సమ్మతింపచేశారు.

కృషికార్ లోక్ పార్టీ కాంగ్రెస్ సహాసభ్యత్వానికి రాజీనామాఇచ్చి,తిమ్మారెడ్డిగారిని పార్టీనుంచి సస్పెండ్ చేశారు. తిరుపతికోసం పాటుబడినందువల్ల ప్రయోజనం శూన్యమని తెలుసుకుని మళ్ళీ మతం మార్చుకున్నారు. ఈమాటు విజయవాడ—గుంటూరులో శాశ్వతరాజధాని స్థాపనకోసం కృషి చేస్తామని ప్రకటించారు. అంటే కమ్యూనిస్టు పార్టీతో కలిసి మంత్రివర్గాన్ని పడగొట్టగలమని బెదిరించారన్నమాట. దీనితో ప్రభుత్వపక్షాలకు విషమపరిస్థితి వచ్చింది. లచ్చన్నగారిని మంత్రివర్గంలోకి తీసుకోక తప్పని సరయింది.

ఇక నవంబరుమాసంతో మూడోఘట్టం ప్రారంభమయింది. తాత్కాలిక రాజధాని ఎలాగూ కర్నూలుకు తరలించబడింది కాబట్టి ఇంక శాశ్వతరాజధానిగురించే నిర్ణయం కావాలని కొందరన్నారు. శాశ్వతరాజధానిగురించి ఇప్పుడు ప్రసక్తి అనవసరమంటూ ప్రభుత్వపక్షం హైదరాబాద్ ప్రసక్తి తెచ్చారు. ఇదివరలో మద్రాసులో తాత్కాలిక రాజధాని ఏర్పాటుచేద్దాం అంటూనే అసలుసమస్యను పరిష్కరించకుండా తప్పించుకోవాలని ప్రయత్నించినట్లే ప్రకాశంగారు, సంజీవిరెడ్డిగారు ఈమాటు మద్రాసుకు బదులు హైదరాబాద్ పేరుచెప్పి తప్పించుకోవాలనిచూశారు. కాని కమ్యూనిస్టుపార్టీ, కృషికార్ లోక్ పార్టీలు ఇందుకు సమ్మతించలేదు. హైదరాబాద్ పేరుచెప్పి కర్నూలులోనే రాజధానిని శాశ్వతంగా ఉంచెయ్యడానికి ఇది పన్నాగమని కొందరు విమర్శించారు. విశాలాంధ్ర ఏర్పడాలనే అభిప్రాయం సామ్రాజ్యతత్వానికి నిదర్శనమని పండిట్ నెహ్రూ స్పష్టంగా ప్రకటించినతరువాతకూడా సంజీవిరెడ్డిగారు

విశాలాంధ్రవచ్చితీరుతుందని చెప్పి ఎవరినీ వంచించలేక పోయారు. అసలు సంగతి ఏమిటంటే శాశ్వతరాజధాని సమస్య నిప్పుడు పరిష్కరించాలనుకుంటే వివిధ పక్షాలమధ్య ఒప్పందం కుదరడం అసంభవమనీ, దీని మూలంగా మంత్రివర్గం పతనమైపోవచ్చుననీ ప్రభుత్వపక్షాలవారు భయపడ్డారు.

కృషికార్ లోక్ పార్టీవారు రాయలసీమనుంచి పూర్తిగా దృష్టిమరల్చుకున్న తరవాతనే, రాయలసీమపట్ల వారి అనురాగ ప్రచారం బండారం బయటపడిన తరవాతనేగాని ప్రభుత్వ పక్షాలు లచ్చన్నగారికి మంత్రివర్గంలో స్థానమియ్యలేదు. వారి కాస్థానమివ్వడానికి చిత్రమైన ఎత్తు వేశారు. కర్నూలునుంచి రాజధానిని మార్చాలని ఆంధ్రశాసనసభ తీర్మానిస్తే, ప్రభుత్వం అది విశ్వాస రాహిత్యతీర్మానంగా పరిగణించబోదని ప్రకాశం గారు ప్రకటించారు. కాని గవర్నరుప్రసంగంపై అభినందన తీర్మానానికి సవరణగా అట్టి తీర్మానం జరిగితే, ప్రభుత్వం విశ్వాసరాహిత్య తీర్మానంగా పరిగణించక ఎలా తప్పుకుంటుంది? లచ్చన్నగారు మంత్రివర్గంలో ప్రవేశిస్తే, అభినందన తీర్మానానికి కమ్యూనిస్టులు ప్రవేశపెట్టే సవరణను వారెలా బలపరచగలరు? అనధికారతీర్మానం ప్రవేశపెట్టినట్లయితే శాసనసభా నియమాల చిక్కులను అంటతీసుకుని ప్రతిపక్షంవారిని బోల్తా కొట్టించవచ్చును. ఈ ఉద్దేశంతోనే ప్రకాశంగారు అటువంటి ప్రకటన చేశారు. ఆ ప్రకటన ఆధారం చేసుకుని లచ్చన్నగారు మంత్రివర్గంలో చేరారు.

శాసనసభలో గవర్నరుప్రసంగానికి అభినందన తీర్మానానికి సవరణలిచ్చినవారిలో అన్ని పార్టీలకు చెందినవారూ ఉన్నారు. చాలవరకు ఇవి రాజధాని మార్పుకు సంబంధించినవే. లచ్చన్నగారు మళ్లీ మతం మార్చుకునే సూచన కనపడకపోయేసరికి ప్రభుత్వం కొత్తఉపాయం పన్నింది. మూడేళ్లలోగా విశాలాంధ్ర స్థాపించబడకపోతే శాశ్వతరాజధానిని విజయవాడ గుంటూరులలోనో విశాఖపట్నంలోనో స్థాపించడానికి సుముఖంగా ఉన్నట్లు ప్రకాశంగారు, సంజీవి రెడ్డిగారు ప్రకటించారు. విశాఖపట్నం ప్రసక్తితెచ్చి కృషికార్ లోక్ పార్టీకి ముప్పు తెచ్చిపెట్టారు. మొత్తం 14 మంది కృషికార్ లోక్ శాసన సభ్యులలో 10 మంది విశాఖ, శ్రీకాకుళం జిల్లాలకు చెందినవారవడంచేత, ఆ సభ్యులు ఈ తంత్రంతో తలక్రిందులైనారు. విజయవాడ — గుంటూరు ప్రతిపాదననీ, విశాఖపట్నం ప్రతిపాదననీకూడా బలపరచడానికి సిద్ధపడ్డారు. కాంగ్రెస్, కృషికార్ లోక్ పార్టీలు ఏకమైతే విశాఖపట్నం ప్రతిపాదన తప్పకుండా గెలిచేదే కాని. కాంగ్రెస్‌పార్టీ విశాఖపట్నాన్ని బలపరుస్తున్నది చిత్తశుద్ధితో కాదని అందరికీ తెలుసు. సవరణలన్నిటినీ ఓడించడంకోసం వేసిన ఎత్తిది.

అయినా ఆ సవరణలపై వోటింగ్ సమయం వచ్చేసరికి ప్రభుత్వానికి ధైర్యం లేకపోయింది. శాసనసభలో అధికసంఖ్యాకులు చేయగల నిర్ణయానికి బద్ధులై ఉండగలరని లచ్చన్నగారికీ కమ్యూనిస్టుపార్టీ నాయకులు నాగిరెడ్డిగారికీ చెప్పినా ఏ సవరణ గెలిచినా ప్రభుత్వం పతనమౌతుందనే భీతి పుట్టించి, సవరణలను ఉపసంహరించుకోవలసిందిగా ప్రకాశంగారు కోరారు. విశాఖపట్నాన్ని కృషికార్ లోక్ పార్టీ బలపరిస్తే తమ విజయవాడ — గుంటూరు సవరణ వీగిపోవచ్చునని తలిచి కమ్యూనిస్టులు సవరణల నుపసంహరించుకున్నారు. రాజధానివిషయమై అనధికార తీర్మానాలచర్చకు అవకాశమివ్వడానికి ప్రభుత్వం అంగీకరించింది. విజయనగరం రాజాగారివర్గంమాత్రం తమ సవరణ నుపసంహరించుకోలేదు. అది వోటింగ్‌లో ఇట్టే వీగిపోయింది.

మరునాడు అనధికార తీర్మానాలు వచ్చినప్పుడు బాలట్ వేసి ఒక తీర్మానాన్ని ప్రధాన తీర్మానంగా పరిగణించి, మిగిలినవాని నన్నిటినీ దానికి సవరణలుగా ప్రతిపాదింప చేశారు.

రాజధాని సమస్య అనధికార కార్యక్రమంలోకి ఎప్పుడు వచ్చిందో అప్పుడే ప్రభుత్వపక్షాలది పైచెయ్యిఅయింది. శాసనసభ నియమాలలో ఆరితేరిన ప్రకాశంగారు మిగిలిన పక్షాలవారిని క్షణంలో జయించారు. వాస్తవానికి కర్నూలు ఆనాడు జరిగిన కార్యక్రమమంతా పార్లమెంటరీ సత్సంప్రదాయాలకు విరుద్ధమైనప్పటికీ, అందరి సమ్మతినీ పొందినందువల్ల కొనసాగిపోయింది. ప్రతిపక్షసభ్యులు సవరణలను ప్రతిపాదించడంలో మెలకువ చూపనందువల్ల, ప్రభుత్వానికి విజయం లభించింది.

ప్రధాన తీర్మానాన్ని బలపరుస్తున్నట్లు ప్రభుత్వ... పక్షం ప్రకటించి, సవరణ లన్నిటికీ ప్రతి... వోటుచెయ్యాలని కాంగ్రెస్ పార్టీ... కృషికార్ లోక్ పార్టీసభ్యులు సవర... వోటుచెయ్యడం ఇష్టం లేని... ఉండితీరాలని లచ్చన్నగా... అప్పటికీ ప్రభుత్వా... భయంతో...

1956 అక్టోబరుకి బదులు 1955 అక్టోబరు నాటికే శాశ్వత రాజధానిని విశాఖపట్నంలో స్థాపించడానికి సిద్ధంగా ఉన్నట్లు ప్రకాశంగారు శాసనసభలో ప్రకటించారు.

ఆపైన మంత్రివర్గానికి మరొక దక్కని ఉపాయం తోచింది. ఏ ఒక్క సవరణ గెలిచినా మిగిలిన సవరణలన్నీ పులుసులో పడిపోతాయి. బాలట్‌లో విజయవాడ — గుంటూరు శాశ్వత రాజధానిగా ప్రతిపాదించే సవరణకు తొమ్మిదో స్థానం లభించింది. ఈలోగా వచ్చే సవరణలలో ఒకదానిని బలపరిచి గెలిపిస్తే, విజయవాడ—గుంటూరు సవరణ వోటింగ్‌కి రానేరాదు. అందువల్ల సవరణలన్నిటినీ ప్రతిఘటించి ప్రధాన తీర్మానాన్ని మాత్రమే గెలిపించాలని కాంగ్రెస్ పార్టీకి తాఖీదిచ్చిన ప్రభుత్వం, మూడో సవరణను బలపరచి గెలిపించింది! ఇది విశాఖపట్నంలో 1956 ఏప్రిల్ నుంచి శాశ్వతరాజధాని స్థాపించాలని సూచించిన రొక్కం లక్ష్మీనరసింహదొరగారి సవరణ. వోటింగ్‌లో కృషికార్ లోక్ పార్టీ తటస్థంగా ఊరుకోవడంతో మూడువోట్ల మెజారిటీతో ఈ సవరణ గెలిచింది. అంతటితో విజయవాడ—గుంటూరు సవరణ వోటింగ్‌కి రాకుండా చేసుకున్నారు ప్రభుత్వం.

ఆ తరవాత ప్రతిపక్షం ఈ సవరణను భగ్నపరచడానికే, పోతిరాజుగారి తీర్మానాన్ని గెలిపించారు. మిగిలిన సవరణలన్నీ గెలిచిన సవరణకు పూర్తిగా ప్రతికూలంగా ఉన్నందువల్ల వ్యర్థమైపోతే, ఈ ఒక్క సవరణా మిగిలింది. 1954 జనవరినుంచే మద్రాసులో ఉన్న ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాలన్నిటినీ విజయవాడ గుంటూరు నగరాలకు తరలించాలని సూచించే ఈ సవరణ గెలవడంతో, గెలిచిన రెండు సవరణలనూ చేర్చి ప్రధాన తీర్మానాన్ని వోటింగ్‌కి పెట్టగా, అది ఒక్క సభ్యునికికూడా సమ్మతం కాకపోవడంలో ఆశ్చర్యం లేదు!

వాంఛూగారు తాత్కాలిక రాజధానిగా చించిన విశాఖపట్నాన్ని శాశ్వత రాజధానిగానూ, వారు శాశ్వతరాజధానిగా సూచించిన నగరాలకు ప్రభుత్వ కార్యాలయాల తాత్కాలిక స్థానంగాను, సూచించే తీర్మానంగా చివరకు తయారై, అది వీగిపోయింది. జరిగిన ఇంత చర్చా, ప్రతిపక్షాల విశేషకృషీ వ్యర్థమైనాయి. 140 మంది సభ్యులుగల శాసనసభలో విజయవాడ, గుంటూరు ప్రాంతంలో శాశ్వతరాజధాని నెలకొల్పాలని 79 మంది చేసుకున్న సంకల్పాన్ని, శాసనసభ నియమాల చిక్కుల్లో పెట్టి భగ్నపరచగలిగింది ప్రభుత్వపక్షం.

ప్రజాస్వామ్య సత్సంప్రదాయాలను అనుసరింప చెయ్యవలసిన బాధ్యతగల ప్రభుత్వం, దేశంలో ప్రజాస్వామ్యానికి పునాది అని భావించిన కాంగ్రెస్ పార్టీ ఈరీతిగా రాజకీయాలను మరింత కలుషితం చేశాయి.

అయితే పరిష్కారం కాకుండా మిగిలిపోయిన ఈ సమస్య తిరిగి త్వరలోనే తలెత్తక తప్పదు. ఇది ఎంత త్వరలో పరిష్కరించబడితే అంత త్వరగా దేశానికి సుపరిపాలన లభించి ప్రభుత్వం స్థిరపడగల అవకాశం లభిస్తుంది. పరిష్కారం కాకుండా ప్రభుత్వం పట్టుదల పట్టినంతకాలం ప్రాంతీయ విద్వేషాలు, పార్టీ కక్షలు మరింత పెరిగిపోగల ప్రమాదం ఉండనే ఉంటుంది. ఈ పరిస్థితులను గమనించి పట్టుదలలు విడిచి రాజధానివిషయంలో సహృదయంతో అన్ని పక్షాలవారూ సమ్మతికి రావడం అవసరం. అది కుదరనిపక్షంలో అధిక సంఖ్యాకుల అభిమతాన్ని ఆదరించి దేశంలో ఇంక కల్లోలం పెరిగిపోకుండా జాగ్రత్తపడ్డం అవసరం.

మన రాజకీయాలతో, మన కక్షలతో నిమిత్తం లేక నిష్పక్షపాతబుద్ధితో పరిశీలించిన జస్టిస్ వాంఛూగారి సూచనను ఆమోదించడం అన్ని ప్రాంతాలవారికీ, అన్ని పార్టీలవారికీ మేలు. రాజధానిసమస్యను పరిష్కరించనంతకాలం ప్రస్తుత మంత్రివర్గం క్షణక్షణగండంగా కాలం గడపక తప్పదు. బడ్జెట్ సమావేశంలోగానే ఇది పరిష్కరించడం మంత్రివర్గానికి క్షేమం.

# ఆధునికాంధ్ర కవిత్వంమీద ఆంగ్లసాహిత్య ప్రభావము



శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు

(గత సంచిక తరువాయి)

ఈ తులనాత్మకమైన విచారణ అయిన తరువాత రొమాంటిసిజమ్‌యొక్క ముఖ్య లక్షణములను కొన్నింటిని మనవి చేసెదను. వీనిని రెండువిధములుగ చూపవచ్చును — ఇతివృత్తమునకు సంబంధించినవి, ఛందస్సునకు సంబంధించినవి, అనునవి ఆ విధములు. ఈ రెంటింటియందును సంప్రదాయసిద్ధ నియమోల్లంఘనము ఈ కవుల ఆశయము. స్వేచ్ఛాప్రవృత్తి, నిత్యనూతనమార్గగవేషణము, ఆత్మవిశ్వాసము — వీరి ముఖ్య సిద్ధాంతములు. వీరి దృష్టిలో 'బుద్ధి' కన్న 'హృదయము' ఎక్కువ ప్రాముఖ్యము కలది. సౌఖ్యము జీవిత లక్ష్యము. పాశ్చాత్యదేశములో ఒక రొమాంటిక్ కవి ఇంకొకని కిచ్చిన సలహా ఇది — "నీ ప్రతిభను నీవు నమ్ముకో. నీ హృదయాన్ని అనుసరించు. నీ హృదయము మారినప్పుడెల్ల నీ సిద్ధాంతమును మార్చుకో.... ఇంక, నీ హృదయాన్ని కూడ త్వరగా మార్చుకొనుచుండు..."

తమ హృదయములందలి అశాంతిని, ఆందోళనమును, సంఘమందలి వివిధఘట్టములు సున్నితములగు తమ హృదయములందు రేకెత్తించు భావములను కవితావస్తువులుగ గైకొని గానము చేయుట వీరి ప్రధాన లక్షణము. ప్రపంచములోని అశాంతి వీరి హృదయములలో నిండియుండును. ఆ అశాంతి పోవుటకు మార్గమును చూపుటకన్న, దానిని రచనలలో ప్రతిబింబింపజేయుటయందే వీరికి దృష్టిఎక్కువ. భావస్వాతంత్ర్యము వీరి ఆశయము. ప్రాతబడి, ఉత్సాహరహితములై, నిర్జీవములై ఉన్న పూర్వ సంప్రదాయములను, అభిప్రాయములను మార్చి, ప్రజల హృదయములను తమ అభిప్రాయములతో నింపవలెనని వీరి ఆశ.

వీరి ప్రేమతత్త్వము వాస్తవజగత్తునకు అతీతమైనది ఇంద్రియములకు గోచరముకాని, ఆత్మైకవేద్యమైనది. ఈ ప్రణయమే విరహమునకు కారణమై, హృదయమును సంక్షోభితము చేసి కల్లోలపరుచును. ఈ సంక్షోభమందే, ఈ బాధయందే, ఈ విరహవిధురతయందే సౌఖ్యమున్నదని వీరి భావన అగుటచేతనే వీరికి దుఃఖము ప్రేమపాత్రము. ప్రేయసీ, ప్రేయసీ అని, అప్రాప్తమనోహారికోసము అఱ్ఱులు చాచు వీరు, నిజముగ ఆమె వచ్చినయెడల — ఆమె వియోగజనిత దుఃఖమునే ప్రేమించు వీరు — ఆమెను ప్రేమింపలేరేమో!

ప్రకృతివిషయమై ఈ కవులకు విలక్షణమైన అభిప్రాయములు కలవు. వీరికి అసంస్కృతమైన ప్రకృతియందు ప్రేమ హెచ్చు. నవనాగరకత ప్రకృతిసౌందర్యమును నశింపజేయుచున్నదని తలంపు అగుటచేతనే పాశ్చాత్యదేశములలోని కవులు మధ్యయుగమునకు తిరిగిపోయిరి. ప్రకృతి వీరికి ఆరాధ్య దేవత. పురాతనకవులు ప్రకృతిని, వాతావరణసృష్టికి ఉద్దీపనముగ గ్రహింపగా, వీరు ప్రకృతిని, దానికొరకే గ్రహించిరి. ఆత్మానుభూతిపూర్వకమైన రచనకే ప్రాముఖ్యము హెచ్చు. ఈ అనుభూతిమార్గమును అనుసరి[ంచు] కవి తనకు తానే మార్గదర్శకుడు.

ఛందస్సువిషయములో ...
ఇంగ్లండులోని కవులు ...
డ్రైడెన్ మొదలగు ...
మలచబడిన ...
అను ...

*Verse*) ఆక్టోసిలబిక్స్ (*Octosyllabics*) స్పెన్సీరియన్ స్టాంజా (*Spenserian Stanza*) లను స్వీకరించిరి. 'కీట్స్' రంగములోనికి వచ్చువరకు 'ద్విపద' (*Heroic Couplet*) ను చేబట్టి, పోప్ మొదలగు వారి 'నడక' కు వ్యతిరేకముగ, నడుపుటకు ఎవరును సాహసింపలేదు. ఫ్రెంచివారికి విక్టర్ యుగో (*Victor Hugo*) వంటి మహా ప్రతిభావంతుడే, ఈ ఉద్యమ ప్రారంభమున ఉండుటవలన వారికి ఈ సమస్యలు చాలవరకు మొదటనే పరిష్కరింప బడినవి.

మతము విషయమునను వీరిది విలక్షణ ప్రకృతియే. అందరకు అర్థమయిన మతమువంటిది కాదు వీరిది. మతమునందు నమ్మకము సడలుచున్న దినములలోని వారు కనుక, వీరిది ఆత్మాశ్రయమైన మతము. ప్రతి ఒక్కరును, తమ అనుభూతులతో తామే ఒక మోక్షమును, స్వర్గమును సృష్టించుకొనిరి. 'ఆకులు రాలని, పూవులు వాడని, వసంతారామము' ప్రతి వారికిని కలదు. 'లోకముతో మనకేటికి' అను దృష్టి వీరియందు అధికమగుటకు కారణము ఇదియే.

1900 నుండి, ఆంధ్రదేశమున ఈ ఉద్యమము విజృంభించుటకు కావలసిన పరిస్థితులు ఎన్నో ఆ కాలమున ఉండెను. దేశమునకు స్వాతంత్ర్యము లేకుండుట, స్వాతంత్ర్యమును అన్నిటికంటెను విశేషముగ ప్రేమించు ఈ ఉద్యమమునకు, పునాది అయినది. బ్రాహ్మసమాజముయొక్క ప్రభావము, శ్రీ వీరేశలింగం పంతులుగారివంటి వారి కృషి, యువకుల హృదయములందు మతవిషయమున నూతన దృక్పథమును అభివృద్ధిచేసెను. క్రమక్రమముగ స్వాతంత్ర్యోద్యమము, ఆంధ్రరాష్ట్రోద్యమము, యువకుల మనస్సులలో నూతనోత్సాహమును కల్పించెను. పండితుల శాబ్దిక చర్చలతోను, క్షీణయుగము నాటి ప్రబంధములతోను విసిగియున్న యువకులకు, శ్రీ తిరుపతి వేంకటకవుల, ధారాశుద్ధి కలిగిన పద్యములు, అవధానములు క్రొత్త రచనలకు పురికొల్పెను. వీటి
...ంటికి ...నుక ఆంగ్లసాహిత్య పఠనము. ...ంటనే
...న కవితోద్యమము బయలుదేరెను.

...వ్యకవితోద్యమమునకు 'ఇంగ్లీషు
...మమునకు, సహజముగనే పోలి
...వులలో—ఛాసర్ కాలము
ఈ రకమైన ఛాయ
...త విప్లవములో
...నే మన

దేశమునందును మనకు, ఈ రొమాంటిక్ కవుల ఆదర్శములు, ఆశయములు అంత క్రొత్తకావు. కవుల నిరంకుశత్వము, దానిని అందరు అంగీకరించుట పరిపాటి. ప్రకృతి విషయమున ఈ కవులకున్న భావములతో కొంతవరకైన పరిపోల్చదగిన భావములు సంస్కృతమున కలవు. ఖండకావ్య రచనయు అంత క్రొత్తకాదు. వ్యాకరణ నియమోల్లంఘనము, క్రొత్త ఛందస్సులను ఆదరించుటయు కూడ విప్లవాత్మకమైన నవీన పద్ధతులు కావు. ఈ వాక్యములలో చాలవరకు సంస్కృత మహాకవుల విషయమున సత్యములు. కనుక, మన నవ్యకవితోద్యమము, శ్రీ తిరుపతి వేంకటకవుల వంటివారి మెప్పుపొంది ప్రారంభమైనది. అయినను, అందరును దీనిని మెచ్చుకొనిరని కాదు. మెచ్చనివారు ఎప్పుడును ఉందురు. "కోయిల్లో [illegible] మెచ్చు కళ్ళకు, కోమలుల సొగసెక్కునా ?"

నవ్యకవిత్వము [illegible] బలపడినదని మొదటనే మనవిచేసినాను. [illegible] శాఖాభివృద్ధికి, పాశ్చాత్య సాహిత్య—[illegible] ఆంగ్లసాహిత్య—[illegible] చెప్పినాను. ఈ వ్యాసమున [illegible] సాహిత్యరంగములందును, [illegible] సాహిత్య ప్రభావ మెట్లు సోకినదో ప్రపంచించుట గాని, నవ్యకవిత్వములో ప్రఖ్యాతిపొందిన అందరికవులపై ప్రభావము ఎటుల తాకినదో విపులీకరించుట గాని చేయక, దిఙ్మాత్రముగ నవ్యకవితావాహిని, ఏయే మార్పులను ఏయే విధములుగ పొందినదో, ఏయే కవులలో ఆ మార్పులు తీవ్రముగను, నిష్కర్షగను నుండుట అభివ్యక్తమైనవో తెలియజేసి విరమింతును. ఈ వ్యాసము లక్ష్యములకన్న లక్షణముల కెక్కువ ప్రాముఖ్యమిచ్చి వ్రాసినది.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, 1942 లో పోటూరి వేంకటరావుగారు వ్రాసిన 'హిమగ[illegible]ము' అను పుస్తకమునకు 'ఆభావనము' వ్రాయుచు ఇట్లనిరి. "తెలుగు కవితా ప్రపంచమున మూడు దశాబ్దములుగా నెప్పటి కప్పటి కేవో క్రొత్తమార్పులు పుట్టుచు నేయున్నవి. మొదటి మార్పునకు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు ఆచార్యులు. రెండవ మార్పునకు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఆచార్యులు. మూడవ మార్పునకు శ్రీ శ్రీ ఆచార్యుడు......ఇందలి ఆచార్య శబ్దము చేత ప్రత్యక్షరమునకుం బ్రత్యక్షతా ప్రసక్తి లేదు." మహాకవులు, విమర్శకులు అయిన శ్రీ సత్యనారాయణ

గారి వాక్యములనే కొంచెమురుకులుగ నిచ్చుకొని వ్రాసి, వ్యాసమును ముగింతును.

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు 1909 లో 'లలిత' అను కావ్యమును ప్రకటించిరి. ఈ కావ్యము యొక్క రెండవ ముద్రణము 1912 లో జరిగినది. ఈ ముద్రణమునకు శ్రీ చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారు ఉపోద్ఘాతము వ్రాసి, కవిని ప్రోత్సహించిరి. ఈవిషయమే శ్రీ శాస్త్రిగారికి, నవ్య కవితోద్యమమునగల ప్రేమను వెల్లడింపజాలియున్నది. వారు నవ్యకవితోద్యమమునకు ప్రత్యక్షముగను, పరోక్షముగను ఎంతయో తోడ్పడి రనుటకు ఈ ఉపోద్ఘాతమే తార్కాణము. ఈ కావ్యముయొక్క 'నివేదన'లో శ్రీరాయప్రోలువారిట్లు వ్రాసిరి. "శ్రీగంటి లక్ష్మన్న పంతులు వారి పరిచయం నాకు కలిగింది......వారొకనాడు నేను వచ్చేసరికి గోల్డుస్మిత్ మహాకవి కావ్యసంపుటం తిరుగవేస్తున్నారు. నన్ను చూడగానే 'గోల్డుస్మిత్ హెర్మిట్' అనే కృతి చదివారా?అని ప్రశ్నించారు. లేదన్నాను. తాము చక్కగా చదివి వినిపించి, అందంతు వివరణము చేశారు. దీనికి కొనిని తెనుగులో పెట్టండి అని నవ్వుతూ ఆదేశించారు. ఆంగ్లమందలి హెర్మిట్ తెనుగులో లలిత—ఒక వియోగిని విలాపంగా పరిణమించింది. ఇది దీని జనకథ....శ్రీలక్ష్మన్న పంతులుగారు చవిచూపిన ఆంగ్లసాహితీ రుచి అంతటనే అంతరించలేదు. నానాటి 'కాసార కవుల' రచనలమీద మరులు కొన్నది. కొంతకాలం ఆ వాసనతో నా రచనలో అవతరించింది కొంత పద్యజాతం..."

(నివేదన—లలిత 1944 ప్రచురణము)

రెండవ ముద్రణమునకు, ఆంగ్లములో పీఠిక వ్రాయుచు శ్రీరామకొండాచార్యులవారిట్లు వ్రాసిరి. *"This poem........ is, I believe, the first successful attempt on the part of a Telugu poet to sing the glories of the sacred passion of love under the direct inspiration of the Votaries of English Muse and as such, marks a new epoch in the development of Modern Telugu Literature........ The author of the poem has drunk deep at the fountains of English Poetry......"*

ఈవిధముగ, ఇతివృత్తమును కొన్ని వర్ణనలను ఆంగ్లమునుండి గ్రహించి వ్రాసిన ఈ కావ్యము, "సనాతన సంప్రదాయముల ననుసరింపక, నాయికా విలాపముతో ప్రారంభమగుచున్నది." 'రొమాంటిక్' కవి కాని, 'గోల్డుస్మిత్'ను అనుసరించుటతో ప్రారంభించిన శ్రీరాయప్రోలువారి కవిత, క్రమక్రమముగ కాసార కవుల వెనువెంటను, షెల్లీ, కీట్సు, బైరన్ మొదలగు కవులవెంటను పోయినది. ఇక్కడ మనము గమనింపవలసిన ముఖ్యవిషయము—ఆంగ్లసాహిత్య ప్రభావము సోకినను, మన కవులు తమ వ్యక్తిత్వమునుగాని, భారతీయ సంస్కృతినిగాని, చాలవరకు, విడువలే దను విషయము. దీనికి ముఖ్యకారణము, మన కవుల తత్త్వదృష్టిలో భేదము రాకుండుట. భావనలోను, రూపకల్పనలోను, ఉన్న వైచిత్ర్యములోను ముందంజవేసిన కవులుకూడ, తత్త్వవిషయమున భారతీయతను విడువలేదు. ఇది భావకవుల విషయమందు పూర్ణసత్యము.

1913 లో ప్రకటితమైన తృణకంకణము, శ్రీ రాయప్రోలువారిని రొమాంటిక్ కవిగా స్థాపించినది. దీని ప్రథమప్రకటనలో *'The Telugu School of Romantic Revival'* అనియు, 'అభినవాంధ్ర కవితామండలి' అనియు ఉన్నది. ఆంగ్ల కవుల కవితారసముతో బాటు, సంస్కృత కవుల వ్యంగ్యవైభవమును కూడ మేళగించి దీనిని రచించినారు. మన కవులు సంస్కృత సాహిత్యమును ఆశ్రయించుటలో వింతలేదు. ఇంగ్లీషు రొమాంటిక్ కవులు గ్రీకు పోకలను పట్టిరి.

శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు, "ఆధునిక కవిత్వమునకు తృణకంకణము ఆదిగ్రంథమని అస్మదాదుల ఆశయము" అని వ్రాసిరి. నవ్యకవిత్వ లక్షణములలో 'భావకవిత్వ' లక్షణములన్నియు పట్టిన గ్రంథ మిది. శ్రీ రాయప్రోలువారిలో పద ప్రయోగమునందును, ప్రకృతి వర్ణనాదులందును ఆంగ్ల కవి 'వర్డ్స్‌వర్త్' యొక్క ప్రభావము కొంత కనబడును. దేశభక్తి ప్రపూరితములైన గేయములు, పద్యములు కొంతవరకు 'స్కాట్' కవియొక్క ప్రభావమును చూపును. మానవత్వమునందు నమ్మకము, ఆదర్శవాదమునందు దృఢిని వేశము 'షెల్లీ' యొక్క ప్రభావమును కనపర్చును. కాని, అతని నాస్తికత్వము ఈయనయందు లేదు.

ఈయన క్రమక్రమముగ పరిణా విశిష్టస్థానమును పొందెను. రవీం వము ఈయనమీద కొంత ప్రఖ్యాతిని పొందినతి వారు గనుక, ఆ మంచివేయ

ఈయన 'స్వప్నకుమారము'లో, కవి కొక సుందరి సాక్షాత్కరించి, అతనికి ప్రేమయొక్క లోతులను వివరించును. ఈ ప్రేమతత్త్వ వివరణమున 'షెల్లీ' యొక్క ప్రభావచ్ఛాయలు గోచరించును. ఆంగ్ల రొమాంటిక్ కవులవలెనే వీరికిని, కథా కథనమందు దృష్టి చాలతక్కువ. భావములకు రూపముల నిచ్చి, వాగర్థప్రసన్నతను సంపాదించి వ్రాయుట వీరికి ఇష్టము. రొమాంటిక్ కవులలో సామాన్యమైన 'పలాయనతత్త్వము' వీరిలో చాలతక్కువ. ఉన్న 'పలాయన' మైనను, ఆదర్శలోకము లోనికి కాక, ప్రకృతిలోనికి. ప్రకృతిలోని సందేశమునకు చెవియొగ్గి వినుటలో ఈయన 'వర్డ్స్‌వర్త్' కవికి సన్నిహితుడు. చంద్రావళి, జడకుచ్చులు, వనమాలలలోని ఖండకృతులు, ధనుస్సుతో వీరు చేసిన 'గారడీ'ని చాలవరకు చూపగలవు.

ఇంగ్లీషు కవులు కవిత్వతత్త్వమును పరామర్శించుచు వ్రాసినట్లే, శ్రీ రాయప్రోలువారును రెండు గ్రంథములను—రమ్యాలోకము, మాధురీదర్శనము—వ్రాసిరి. రమ్యాలోకమును భావకవులకు బైబులు అనవచ్చును. రొమాంటిక్ కవుల ప్రేమతత్త్వము, ప్రకృత్యారాధన మొదలగు విషయములను గూర్చి చక్కగ చెప్పును. మాధురీదర్శనము పూర్తిగ భారతీయ సంప్రదాయమును త్రొక్కినది. కాని, కవి ప్రకృత్యనురక్తుడు కాని, విరాగి కాడు. ఇది ప్రత్యేకమైన సౌందర్య సంప్రదాయమేమో! నేల విడిచి సాము చేయరాదనియే కవి మతము. "పృథివి నే వదల్లు సమాశ్రయింతు ధీః." సంప్రదాయ సిద్ధమైన, అలంకారిక మతము నాదరింపక మాధురీసిద్ధాంతమును ప్రవచించిరి. కావ్యకళను గూర్చి వారిట్లనిరి.

"కలడంద నిత్యసుందరి
లలిత లంబన మనంత లావణ్య సము
జ్జ్వల హాస్య మొకటె, తన్మం
గళ దర్శనయూపణంబె కావ్యకళ బుధా"
— మాధురీ దర్శనమ్.

ఈ అభిప్రాయము, "సౌందర్యమే సత్యము, ...సౌందర్యము" అని చెప్పిన 'రొమాంటిక్' ...కు ప్రతిరూపముగ నున్నట్లు తోచుచున్నది. ...లకు ఆధ్యాత్మికత్వ మిచ్చుట ...క్షణముగదా!

...శాస్త్రిగారు 'కృష్ణపక్ష... ...దనమును ప్రచు... ...వలుమూలల

అలజడి బయలుదేరినది. ఇందులకు కారణము; 'రొమాంటిక్' కవుల కవితకు ముఖ్యమగు లక్షణములలో ఒకటియగు 'దుఃఖము'ను ఈయన ప్రస్తుతించుటయే. భావకవిత్వమునకు శ్రీ దేవులపల్లి వారివలన వచ్చినంత ప్రచారము ఇంక ఎవరివలనను రాలేదనుట సత్యదూరము కాదు. పదముల కూర్పులో ఈయన సిద్ధహస్తుడు. 'కీట్స్'ను తలపింపజేయు శిల్పము కవితలో చూపినాడు. ఈయన బ్రహ్మసమాజమువలన కొంత మారినవాడు గనుక, మత విషయమునను విప్లవ బీజములు కవితలో నాటినవాడు. భావకవుల 'పద జాలము' నొకదానిని సృష్టించి, దానిని ప్రచారమునకు తెచ్చినవాడు. విరహములో వేగిన మనుష్యుడు. తన వచ్చిన కన్నీళ్ళతో ప్రపంచమును తడిపినవాడు. 'నోవాలిస్' (*Novalis*) అను ప్రఖ్యాతి పాశ్చాత్య రొమాంటిక్ కవిని గూర్చి 'రాయిస్' అను విమర్శకుడిట్లనెను. "*He is Philosophical, poetical, critical; but he is everywhere and always the born dreamer.*" ఈ మాటలు శ్రీ దేవులపల్లి వారి విషయమునను సత్యము. ఇది అర్థము చేసికొనని విమర్శకునకు ఈయనకవిత అర్థము కాదు. ఈయన కవితా ప్రవంతి, గమ్యస్థానమును చేరినది కాదు. చేరునదియు కాదు. నిరంతరము ప్రవహించునది. ఈ లక్షణము 'రొమాంటిక్' కవితకు ముఖ్యలక్షణము. ప్రాణము.

'దుఃఖమే' ఈయన కవితలో అంతర్వాహిని. దుఃఖమును వర్ణించు ఘట్టములే, అద్వితీయ మాధుర్యముకలవి. "*Our sweetest songs are those that tell of saddest thought*" అనునది ఈయన విషయమున పరమసత్యము.

నవ్యకవితావిర్భావమును గూర్చి శ్రీ దేవులపల్లివారి అభిప్రాయము కావలెనన్నవారు శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల 'ఏకాంత సేవ'కు వ్రాసిన 'పీఠిక' చదువవలెను. ఇందు వారు నవ్యకవిత్వ లక్షణములను గూర్చి విస్తరించి చూపినారు. అందుండి కొన్ని వాక్యములను ఉదాహరించి చూపెదను—

"ప్రాచ్య-పాశ్చాత్య నాగరికతా సమ్మేళనము వలన మనవారు క్రొత్తవారైనారు......నవ్యకవులకు స్వేచ్ఛప్రాణము. వీరు ప్రాణమైన కోల్పోవుదురు కాని శృంఖలముల ధరింపరు. వీరికి ప్రాణముకన్న గానము తీపు—సంకెలలో సంగీతమా! కట్టుబాటులో కవిత్వమా?.........మరియొక చిత్రము. వీ రొకరికై కవనము చెప్పరు......వీరు గానము చేయుదురు.

ఏలయన—గానము చేయవలయును గనుక చేయుదురు ........తెమ్మెరలేల విసరును? కోయిల ఏల గొంతెత్తి పాడును?.........వీరు ప్రకృతికి బిడ్డలు .........మరియు వీరు ప్రకృతిని సులోచనములతో జూతురు .....వీరి ప్రకృతి పుస్తకములలోని ప్రకృతి కాదు; వీరు ప్రతిబింబము జూచి ప్రేమించు ప్రకృతియే......కనుక వీరికి విశ్వమున ప్రేమింపదగనిది, గౌరవింపదగనిది, వర్ణింపదగనిది ఎయ్యదియు లేదు ......... "సుందరమగు వస్తువే సంతతానందదాయక" మని గంతులిడుదురు. (*A thing of beauty is a joy for evcr—keats*)......వీరి కవిత్వమునకు ప్రధానలక్షణము లెవ్వి? భావనాశక్తి (*Imagination*). బుద్ధిసూక్ష్మత కాదు.........వీరి స్వచ్ఛంద విహారమునకే విశాల విశ్వము చాలదు...వీరు గాలిలో మేడల గట్టుదురు......'ష్లేక్కు'ను పక్షి వాలని లోకము నిరసింపలేదా!......దుఃఖమో, మోదమో, కోపమో, వలపో, ఈర్ష్యయో, భీతియో అతనిని మార్చివేయవలెను.......... ..కవిత్వమునకు ఛందోబద్ధమగు మనోహర శబ్దసముదాయము కూడ కావలయును......కాని కేవలము గణ యతి ప్రాస నియమములు నిరర్థకములు .....సంగీతమునందేమి, చిత్రలేఖనమునందేమి, కవిత్వమునందేమి, ద్వివిధములు కలవు. నయనములకో, శ్రుతిపుటములకో ఆనందము కలుగజేయునవి కొన్ని; హృదయమును తన్మయత్వములో ముంచివేయునవి కొన్ని......ఆంగ్లేయ సారస్వతములో 'పోపు' కవిత్వము మొదటిజాతిలోనిది. 'షెల్లీ' కవిత్వము రెండవజాతిలోనిది. మొదటిరకముకంటె, రెండవరకము వేయిరెట్లు ఘనతరమని నా నమ్మకము.........

ఈ వాక్యములను ఇంత విపులముగ వ్రాయుటకు కారణము, అవి నవ్యకవిత్వ లక్షణములను పూర్ణముగ నిర్వచించి యుండుటయే. 'రొమాంటిక్' కవులనే గాక, టెన్నిసన్ మొదలగు కవుల కావ్యములనుగూడ పఠించిన సంస్కారము శ్రీ దేవులపల్లివారి కవిత్వములో ఎల్లెడల కానవచ్చును. కాని, ఈయనయు పాశ్చాత్యులచే, తత్త్వజ్ఞాన విషయమున, జయింపబడ లేదు. విహాయస వీధులలో ఎంత తిరిగివచ్చినను, భారతీయతను వదలివేసినవాడు కాడు. 'కీట్స్'కవికి, ఈయనకు, భావమునందును చాల పోలికలు కలవు. 'కీట్స్' తన 'లేమియా'(*Lamia*) కావ్యములో—బుద్ధిబలమ సంపాదించిన విజ్ఞానముకన్న, భావనాబలముచేత సంపాదించిన విజ్ఞానము ఎక్కువ సత్యము. అను తత్త్వమును ప్రతిపాదించెను. శ్రీ దేవులపల్లివారు, పైని ఉదాహరింపబడిన వాక్యములలో— "వీరి కవిత్వమునకు ప్రధాన లక్షణము లెవ్వి? భావనాశక్తి. బుద్ధిసూక్ష్మత కాదు"-అని ఈ అభిప్రాయమునే, నవ్యకవులకు ఉపాదేయమైనదిగ, కొంతవరకు చెప్పిరి గదా! సౌందర్యోపాసనయే జీవితమునకు చాలును, అను అభిప్రాయము 'కీట్స్' కవిని చదివిన కలుగును. శ్రీ దేవులపల్లివారి దృష్టియు ఇట్టిదే!

సౌందర్యము, నైరాశ్యము ఒకచోట ఉండును అను దృఢవిశ్వాసము శ్రీ దేవులపల్లివారికి కలదు. నైరాశ్యముచే దుఃఖము. "*Melancholy dwells with Beauty—Beauty that must die*" అనునది ఈయనకు నచ్చిన నమ్మకము. కాని, చావులేని దేనైనను ఉన్నదేమో, అను నమ్మకములేని సంశయముకూడ ఈయనలో ఉన్నదే. ఆత్మప్రేమ (*Self love*) తనయందు తనకు కరుణ (*self pity*) అనునవి రెండును 'రొమాంటిసిజమ్' నందు కనబడును. ఈ రెండు లక్షణములును ఈయన కవిత్వములో—ముఖ్యముగ 'ప్రవాసము'లో—కలవు. ఈయనకు గల విశిష్టధర్మము — భావములలోని తీవ్రత, నిశితత్వము. సామాన్య పదజాలము గాని వ్యక్తము చేయలేనప్పుడు, కొంత సాంకేతికముగ పదముల నుపయోగింపక తప్పదు. రొమాంటిక్ కవులలో సామాన్యులకు అర్థముకానివి—పదములకంటె ముఖ్యమైన భావములు—వాటి తీక్ష్ణత. ఇందుచేతనే— "ఎదియో అపూర్వమధుర రక్తి స్ఫురియించు కాని అర్థముగ్గాని భావగీతములవి... ..........."

శ్రీ దేవులపల్లివారిలో నవ్యకవిత్వములోని 'భావకవిత్వము' పూర్ణరూపమును పొందినది. అందలి మంచి, అందలి చెడ్డ—రొమాంటిక్ కవుల కందరకు సమానమైన ధర్మములే. వెలుగునిచ్చు దీపమే నుసిని ఇచ్చును. ఈ ద్వంద్వములు తప్పవు. అందువలననే—శిథిల శిశిరముల్లో చివురులు, పాషాణపాళిపై ప్రసవములు.

శ్రీ రాయప్రోలువారు, శ్రీ దేవులపల్లి వారు నవ్యసాహిత్యములోని 'మార్గపద్ధతి'లో రెండు దారులు త్రొక్కినవారు. ఇంకను ఎందరో మహాకవులు—, ఆంగ్లసాహిత్య ప్రభావము సోకినవారు—రచనలు 'మార్గపద్ధతి'లో రచించి, ఆంధ్రసాహిత్యమును అలంకరించిరి. ఈ మహానుభావుల కందరకు, పై వారి నిద్దరిని ప్రతినిధులుగ గ్రహించితిని. ఈ

మహాకవులందరును ప్రత్యేక వ్యక్తిత్వము కలవారే. కాని, వారందరిలోను సమానముగ నున్న ధర్మములు, నర్మములు, చాలవరకు తమయందు కలవారు, పై ఇద్దరు.

'రొమాంటిక్' కవులు, చిత్రకారులను కూడ తమలో కలుపుకొనిరని, వెనుక మనవిచేసియున్నాను గదా! ఈ విషయము మన తెనుగు సాహిత్య విషయమునను కొంత సత్యము. చిత్రలేఖనము, కవిత్వము రెండును సమానముగ ప్రేమించి, కృషిచేసిన శ్రీ అడివి బాపిరాజు గారు ఈ సందర్భమున స్మరింపవలసినవారు. ఎందరో నవ్యకవులు తమ కావ్యములను, వారి చిత్రములచేత అలంకరించుకొనిరి. ఆయన తన కావ్యలను, చిత్రములచేత అలంకరించుకొనిరి. ఆయన రచనలలో, బర్న్సు, బ్లేక్ మొదలగు వారి ప్రభావము కాన్పించును. చిత్రలేఖనములో నవ్యత ఎంతేమో కలదు. ఈ విధముగ రెండింటి యందును కృషిచేసిన వీరు విశిష్టవ్యక్తులు.

నవ్యసాహిత్యములోని 'మార్గకవిత్వము'ను, తగిన ప్రోత్సాహమిచ్చి, అభివృద్ధిచేసిన సంస్థలు—సాహితీ సమితి, నవ్యసాహిత్య పరిషత్తులు ఈ సందర్భమున పేర్కొనదగినవి.

నూతన పద్ధతులకు మార్గదర్శకులగు కవులు, సాధారణముగా పాత పద్ధతినే మొదట అనుసరించుట కనబడును. ఈ వాక్యము శ్రీ. శ్రీ విషయములో పరమసత్యము. 1928 లో అంటే అతని 18 వ ఏట; ప్రకటింపబడిన 'ప్రభవ' కావ్యము—

"అలఘుధ్వాంత విలోన సంధరిల రోచిం అర్కమహో గహ్వరస్థలి యందోనిధ యుగ్మ సంతత జల ప్రవాతిరేకంబునన్ విలయాంభోధర ఘోష...
......" తో నిండియున్నది.

ఈ శ్రీశ్రీ యే ఆరేళ్లతరువాత 'మహాప్రస్థానం' వ్రాసినాడు. ఇంత తక్కువకాలములో ఇంత పరిణామమును పొందిన కవిగాని, ఇంత చైతన్యమును పెంపొందించుకొనిన కవిగాని మనకు నవ్యసాహిత్యములో కనబడుట చాల అరుదు.

ఈ పరిణామమును పొందకపూర్వము తన అభిరుచిని గురించి ఈ విధముగా ఒకచోట వ్రాసినాడు. "తెలుగులో భావకవిత్వం, ఇంగ్లీషులో షెల్లీ, కీట్సు ఇత్యాదుల కవిత్వం. Shelley, Tagore, రాయప్రోలు, కృష్ణశాస్త్రి అదీ వరస! రాయప్రోలు ప్రక్కన అబ్బూరి; కృష్ణశాస్త్రి ప్రక్కన వేదుల. నండూరి ఎంకిపాటలు, విశ్వనాథ—నాయని! వీరూ మా కవులు........గురజాడ కవిగా నాదృష్టిలో లేదు."

1930–35 నడుమ మహావిప్లవము ఇతని హృదయ చేతనములో వచ్చినది. 1929 లో 'సుప్తాస్థికలు' వ్రాసినాడు. ఇంక వెనుకకు చూడలేదు.

భావకవులకును, ఇతనికిని ఉన్న ముఖ్యభేదము తత్త్వసంబంధమైనది. ఇతడు ఛందస్సాహితీరీతుల లోని నవ్యతను వారు అర్థము చేసికొనవచ్చును. కాని, ఇతని మనస్సును మాత్రము వారు గ్రహింపలేరు. దానికి కారణము, ఆ కవుల కెవ్వరికిని లేని తత్త్వసంబంధమైన చైతన్యము ఇతనికి ఉండుట. ఆ చైతన్యములోని ఒకభాగము 'మార్క్సిజము' ఆక్రమించినది. భావకవులు ఎన్ని విహారములు చేసినను, వారిలో ప్రాచీనమైన భారతీయధర్మ మేదో ఉండక పోలేదు. ఆవిధమైన, ఆధ్యాత్మిక చైతన్యముకాక, పాశ్చాత్య విజ్ఞానాత్మక చైతన్యము ఇతనిలో ఉండుట విశిష్టత.

ఈ చైతన్యము కలుగుటతోనే, శ్రీ గురజాడ అప్పారావు పంతులు గారి ప్రత్యేకత అర్థమయినది, ఈకవికి. కొతిక సంవత్సరములతరువాత ప్రాచ్యపాశ్చాత్య ప్రభావము, కవిత్వరంగముల నిండి — శ్రీ. శ్రీ వంటి యువకవుల ఉత్సాహములన—ప్రవేశించినది. శ్రీశ్రీ మొదలగువారు, భావకవుల ప్రక్కన వదలి 'గురజాడ' వాల్మీకి'ని అనుసరించుట మొదలుపెట్టినారు. నవ్యకవిత్వములో 'దేశీ' సంప్రదాయమును వీరు చేపట్టినారు. ఈ విషయమున శ్రీ గురజాడకు ఇంగ్లీషు కవులలో జె. ఎమ్. హాప్కిన్సు (J. M. Hopkins) నకు పోలిక కనబడును. హాప్కిన్సుకూడ తన కాలమునకు ముందు పుట్టినవాడే. అతడును ఛందస్సులో నూతనత్వమును తెచ్చి పెట్టినవాడే. చనిపోయిన చాల కాలమువరకు పేరు పొందలేదు. అతని స్నేహితుడైన 'బ్రిడ్జస్' (Bridges), 1889 లో 'హాప్కిన్సు' చనిపోయినపిదప, 1918 వరకుఅతనిపద్యములను ప్రచురించలేదు. శ్రీ అప్పారావుగారీవిషయమున కొంత అదృష్టవంతులు. ఆయన జీవిత కాలములో నే ఆయన గ్రంథ ప్రచురణము, పేరు వచ్చుట జరిగినది. కాని, ఆయన పుస్తకములతో బాటే 'భావ కవిత్వ' కావ్యములును వచ్చుయి, ఆ మార్గపద్ధతికి ప్రాచుర్యమును తెచ్చినవి. కనుక, నరల శ్రీ. శ్రీ. ప్రభృతులు చేపట్టువరకును, శ్రీ గురజాడవారికి ప్రచారము రావలసినంత రాలేదనుట సత్యదూరము కాదు.

1914 లో వచ్చిన యుద్ధము, ఆంగ్లకవులలో ఎన్నో మార్పులను తెచ్చినది. ఎందరో పనికివచ్చు యువకవులు యుద్ధాగ్నిలో ఆహుతి ఐనారు. శాంతి వచ్చినతరువాత, అనుకొన్న మార్పులుగాని, భూతల స్వర్గముకాని రాలేదు. కవులలో నైరాశ్యము పెరిగినది. జీవితములోని 'సెగల నే' కవులు చూపెజొచ్చిరి. ఈ భావములకు మాటలను ఇచ్చినది 1922 లో టి. యస్. ఇలియట్ ప్రచురించిన 'వేస్ట్ లాండ్' (*Waste Land*) ఈ కాలములో, మన కవులు 19 వ శతాబ్దిలోని 'రొమాంటిసిజమ్' తో బాధపడు చుండిరి. కాని, భావకవులతరువాత వచ్చిన శ్రీ. శ్రీ ప్రభృతులు గబగబ అడుగులన్నో వేసి, ఇరువదవ శతాబ్దిలోని పాశ్చాత్య కవులను కలిసికొన్నారు.

ఇలియట్, ఆడెన్ మొదలగు నవ్యాంగ్ల కవులు ఇవొకేటివ్ (*Evocative*) కవిత్వము చాల వ్రాసినారు. దీని ముఖ్యలక్షణము—అనేక రూపములను, ఒకదాని వెనుక ఒకదానిని—మన కన్నులయెదుట పెట్టుట. దీనివలన, కవి ఊహించిన మానసికావస్థను, మనము ఈ రూపముల సాయమున, పొందగలము. శ్రీ. శ్రీ "కవితా ఓ కవితా!" లో ఈ మార్గము పరిస్ఫుటము.

ఇలియట్ మొదలగు కవులయొక్క 'శిల్పము' శ్రీ. శ్రీ కి బాగుగ ఉపయోగించినట్లు తోచును. తత్త్వదృష్టిలో ఇరువురికి ఎంతో భేదము. కాని, శిల్ప విషయమున నవ్యాంగ్లకవుల ప్రభావము శ్రీ. శ్రీ మీద బాగుగ ఉన్నది. దృశ్యములను—ఒక కాలమునకు, స్థలమునకు సంబంధించినవానిని—అతి వేగముగ గంతులు వేయించి, దానికనుగుణముగ వచనమును నడిపి, దానికి కవిత్వశక్తిని ఇచ్చుట, ఈ శిల్ప విషయములలో ఒకటి. 'వేస్ట్‌లాండ్'లో ఇట్టివి ఎన్నో. శ్రీ. శ్రీ యొక్క 'జనార్దనరావు కోసం'లో ఈ గంతులు ఎన్నో ఉన్నాయి.

వచనమునకు లేని 'పరుగు'ను ఛందస్సు పద్యానికి ఇచ్చును. ఛందస్సు సహాయం అక్కరలేకుండా ఆ పరుగును తెచ్చునదియే ప్రోజ్ పొయిమ్ (వచన పద్యము). దీనిని నవ్యయుగములోని పాశ్చాత్య కవులందరు చేపట్టినారనియే చెప్పవచ్చును. శ్రీ శ్రీ ఈ మార్గమునే అనుసరించినాడు 'వ్యత్యాసం' అను రచనలో.

శ్రీ. శ్రీ మీద ఫ్రెంచికవి 'బోదలేర్' ప్రభావముకూడ ఉన్నది. 'బోదలేర్' రొమాంటిక్ కవిత్వమునకు గొడ్డలిపెట్టు. ఇతనిలో 'సింబలిజమ్' (*Symbolism*) ఛాయలు ఉన్నవి. కవితారంగములో, పాశ్చాత్యదేశములలో తలలెత్తిన 'ఇజము' లను చాల వరకు పరీక్షించినవాడే శ్రీ. శ్రీ. ఆంగ్లభాష మనకు యీరఘునంతటికిని సన్నిహితను చేసినది గదా!

ఇరువదవ శతాబ్దిలో, మొదటి ప్రపంచ సంగ్రామానంతరము రచన చేయుచున్న కవులందరి మీద, మన స్తత్త్వశాస్త్రము, నవీన భౌతికశాస్త్రము తమ ప్రభావమును చూపినవి. ఫ్రాయిడ్ యొక్క 'సైకో ఎనాలిసిస్' (*Psycho - Analysis*) సాహిత్య స్వరూపమునే మార్చివేసినవి. అధివాస్తవిక రచనలకు అది దారితీసినది. 'ఆంద్రే బ్రిటో' ఈ అధివాస్తవిక రచయితలకు ఆచార్యప్రాయుడు. 'అరగాం' మొదలగు కవులుకూడ ఈ మార్గమును త్రొక్కినవారే. ఈ మార్గమందు పోయిన రచనలు మనకు చాలతక్కువ. ఉన్నవాటిలో శ్రీ నారాయణ బాబుయొక్క 'మానశంఖం' ప్రశస్తము. నవీన భౌతికశాస్త్రము 'ఫోర్త్ డైమన్షన్' అనుదానిని ప్రవేశపెట్టగా, 'ఇలియట్' మొదలగువారు దానిని 'కవిత్వము'లో ప్రవేశపెట్టినారు. అతని 'ఫోర్ క్వార్టెట్స్'లో ఒకచోట "నా స్మృతియందే నా పుట్టుకయును కలదు" అనునట్టి భావములు, భౌతిక విజ్ఞానమును ఉపయోగించుకొని బయలుదేరినవే యని విజ్ఞుల ఊహ.

ఇతనిలో (శ్రీ. శ్రీ.) పాశ్చాత్యలోకములోని పురాణగాథల ప్రభావముకూడ కన్పించును. 'అవతారం'లో "నరకలోకపు జాగిలమ్ములు, గొలుసు త్రెంచుకు, ఉరికిపడ్డాయి!" అని చదివిన వెంటనే 'సెర్బరస్' (నరకలోకమునకు సమీపమునందుండు ఒక కుక్క) పేరు, పాశ్చాత్య సంస్కృతి నెరిగినవారికి స్ఫురింపక మానదు.

ఎడ్గార్ ఎలెన్‌పో, స్విన్బర్న్ మొదలగు కవుల ప్రభావము—శిల్పవిషయమున—ఈతనిపై ఉన్నది. ఫ్రెంచి కవుల ననేకులను చదివి, అర్థము చేసికొనెను. ఈవిధముగ, ఆంగ్లసాహిత్య ప్రభావమును, పాశ్చాత్య సంస్కృతి ప్రభావమును పూర్ణముగ సోకిన వ్యక్తులలో శ్రీ.శ్రీ. ఒకరు. ఆపైన మార్క్సిస్ట్ దృక్పథము ఒకటి విశేషము. ఈ దృక్పథము కల కవులలో చాలమంది, శిల్పవిషయమునమాత్రము ఇంగ్లీషు, ఫ్రెంచి కవుల ననుసరించుట విశేషములలో విశేషము.

ఈ సంప్రదాయమే తనకును సంప్రదాయము కాగా, కవిత్వములో మాత్రము క్రొత్తదారిని త్రొక్కిన శ్రీ నారాయణబాబును ఇప్పుడు పేర్కొనవ

వలెను. భావకవిత్వమునకు రాయప్రోలు, దేవులపల్లుల వలె, వాస్తవిక కవిత్వమునకు శ్రీ. శ్రీ., నారాయణ బాబులు ప్రతినిధులు. భారతీయ పురాణ ప్రసిద్ధ కవి సమయములను, సన్నివేశములను గ్రహించి వాటిని నవీనముగ అన్వయించుటలో ఈతని ప్రతిభ కలదు. ఈ విషయమున 'ఇలియాట్' కవికి, శ్రీ. శ్రీ. కంటె సన్నిహితుడు. ముఖ్యముగా ఈతనిపై 'ఇమేజిజమ్' యొక్క ప్రభావము కలదు. చక్కగ చెక్కబడిన రూపము, భావమునకు ఇచ్చుటలో ప్రజ్ఞావంతుడు. ఈయన వచనగీతము కొన్నికొన్ని చోటుల వాల్ట్ విట్‌మన్ (*Walt Whitman*)ను, ఎజ్రా పౌండ్ (*Ezra Pound*)ను తలపింపజేయును. ఈతడు ప్రదర్శించునవి రూపములుగనుక నడకలో కొన్ని చోటుల మాంద్యమున్నది. అది, రూపకల్పనను మనస్సునకు హత్తుకొనునట్లు చేయుటలో విశిష్టమైనది. అధివాస్తవికతకు అలంకారప్రాయమైనది. ఈయన వ్రాసిన 'మానశంఖం' బీభత్సమైన ఉపమానములను వాడుటలో ఒక్కొక్కప్పుడు 'సెసిల్ డే లూయిస్'ను జ్ఞప్తికి తెచ్చుచుండును.

ఇప్పుడు వ్రాయుచున్న యువకులందరు, ఈష ద్భేదములతో—శ్రీ. శ్రీ; శిష్టా, నారాయణబాబులు వ్రాసిన పద్ధతిలోనే వ్రాయుచున్నా రనవచ్చును. వ్యావహారిక భాష కవిత్వములోనికి వచ్చినది గనుక, రచనలు గేయరూపములను, వచన పద్య రూపములను హొందినవి. అతి నవీనుల రచనలలో, నవ్యసాహిత్యములోని మార్గకవులను పోల్చినపుడు, ఆ మార్గకవులకును ప్రాచీన కవులకును కల భేదము కంటె, ఈ కాలములోనే కొన్ని దశల భేదములో వ్రాసిన వీరిరువురకు భేద మధికమున్నట్లు కాన్పించును ఇది కాలప్రభావము. నవీనవిజ్ఞానశాస్త్రములు దూరములను ఒయించి, ప్రపంచమునంతటిని 'కుదించిన' దాని ప్రభావము.

ఇప్పటికే విశేషముగ పెరిగిన ఈ వ్యాసమును ముగింపవలసియున్నది. ముగించుటకుముందు చెప్పవలసిన మాటలివి. చరిత్రదృష్టిలో ఈ వ్యాసము వ్రాయబడినదిగాని, కవుల తరతమ భావనిరూపణమునకొరకు గాదు. ఈ కవులు చేసిన కావ్యముల, మంచి చెడ్డల నిరూపణము చేయకపోవుటకు కారణమిది. ఈ వ్యాసములో నిరూపింపబడినవారు, నవ్యకావ్యలోకమునకు ప్రతినిధులుగ గ్రహింపబడిరే కాని, 'వీరే కవులు' అని కాదు. వీరి రచనల బాగోగుల తులనాత్మక పరీక్ష కిందు తావులేదు. నవ్యకవిత్వమును గూర్చి, పరస్పర విరుద్ధమయిన రెండుభావములును—"అంతా మంచి, అంతా చెడ్డ"—లోకములో ఉన్నవి. ఇండే భావమును పూర్తిగా సత్యముకాదు. కవికి, భూతభవిష్యములెంత ప్రధానములైనను 'ఉనికి' వర్తమానమున గనుక, కాలప్రభావ మతనిపై విశేషముగ నుండును ఇదియే అతని కవిత్వములోని 'మంచి'కి 'చెడ్డ'కు ముఖ్యహేతువు. ఈ వాక్యము వ్యక్తిగత ప్రతిభను తృణీకరించుటకు వ్రాసినది కాదు.

నవ్యకవులను అర్థము చేసికొనుటకు—వారి దోషములకు కారణమును గాని, విషయవైవిధ్యమును గాని—పాశ్చాత్య సంప్రదాయవిజ్ఞాన మావశ్యకము. ఈ చరిత్రసత్యమును గుర్తింపనివారు దీనిని విశేషముగ దూషింతురు. ఈ సత్యమును గుర్తించినవారు దీనిని, 'యోగ్యతి'ను మించి పొగడెదరు. ఈ సత్యమును గుర్తింపకపోవుటవలన 'అతిదూషణము,' లేదా 'అతిభూషణము'—నవ్యకవిత్వ విషయమున—జరుగుచున్నది. మనలను 'ప్రణమిల్లజేయు' తెలుగు మహాకవి, ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానములను తనలో సమన్వయింపజేసికొనినవాడునుగాని, ఏఒక్క విజ్ఞానమునకును చెందినవాడు కాలేడని నా ఊహ. అట్టివాని కవితకే విశ్వజనీనత ఉండును. విశ్వజనీనతగల కవితయే మహాకవిత. తద్రచయితయే మహాకవి.

నవాంధ్రమున అట్టి కవిత విజృంభించునని ఆశింతము.



# పొడుగు నీడలు

'హితశ్రీ'

ఆరోజు సాయంత్రం బీచ్ ఇసుకలో అడుగుపెట్టి పెట్టగానే రంగారావు ముఖం ముకుళించింది. ఆ ఎర్రపూల అంచు గల తెల్లచీర అతనికి బాగా గుర్తే. నాలుగురోజుల్నుంచీ ప్రతిరోజూ చూస్తున్నాడు. ఆమే. ఎంతదూరంనుంచైనా గుర్తుపట్టగలడు ఆమెని చూసి నప్పటినుంచీ ఏవేవో దృశ్యాలు సృష్టించుకుంటున్నాడు. అకస్మాత్తుగా ఎవరో సినిమాలోని వ్యక్తి తన దృశ్యాల కాపీరైట్ హక్కుకి భంగం కలిగిస్తున్నాడు. ఎవరా తెల్లషర్టు? తెలుసు! రంగారావు మనసులో అతని కిష్టంలేని ఊహ ఏదో తట్టింది. ఒక్కసారిగా కుంగిపోయాడు. తను పొట్టి బుద్ధిహీనుడు. తనకి తెల్లషర్టు లేకపోతే కుట్టించుకోవాలనైనా తనకెందుకు తోచలేదు?

ఆకాశంలోని ఎరుపురంగు క్రమంగా కొండల వెనకాలకి ప్రవహించిపోతున్నకొద్దీ ఆ ఇద్దరు వ్యక్తులకీ దగ్గరౌతున్నాడు రంగారావు. నడుస్తూ నడుస్తూ సమీపాని ఆగిపోయాడతను. ఆ తెల్లషర్టు మరెవరో కాదు. నిస్సందేహంగా రామకృష్ణ. వాళ్లిద్దరూ ఏవో మాట్లాడుకుంటూ పకపక నవ్వుతున్నారు. నమ్మలేకపోయాడు రంగారావు. నిన్న సాయంత్రందాకా ఆమె ఎవరో ఎరగని రామకృష్ణ ఇవాళ ఎంతో పరిచయం ఉన్నవాడిలాగా ప్రవర్తిస్తున్నాడు. ఇలాంటిది సంభవమని రంగారావు కలలోకూడా ఊహించలేదు. ప్రియమిత్రుడైన రామకృష్ణమీద అతనికి మొదటిసారిగా కోపమూ, ఈర్ష్యా కలిగాయి. స్నేహితుడైన వాడిలాగేనా చెయ్యటం? కాని పూర్తిగా అతనిమీదే నింద తోసివేయటం తప్పేమో! తను స్పష్టంగా చెబితే బావుండేది. కనీసం సూచనైనా చేశాడా? ఓరోజు వెనక్కి పోయాడు రంగారావు—

"ఎవర్రా?"

"ఏమో"

"తెలియదన్నమాట"

"ఉఁహుఁ"

"నువ్వుకూడా ఇవాళేనా చూడటం?"

కాదు. రోజూ చూస్తూనే ఉన్నాను"

"ఎన్నాళ్లనించి?"

"చాలారోజుల్నించి"

"అయితే మరి...?"

ప్రశ్నార్థకంగా అసంపూర్తిగా వొదిలి రంగారావుముఖంలోకి చూశాడు రామకృష్ణ.

"ఎవరయితే మనకేం?"

"అయితే సరేలే. నువ్వేదో అదోలా ఉంటే అడిగాలే"

రంగారావేమీ అనలేదు. కాని అప్పుడప్పుడు దొంగతనంగా ఆమెవైపు చూస్తూనే ఉన్నాడు. రామకృష్ణ గమనించనట్టుగా సముద్రంలో అలల ఆనందంలో భాగం పంచుకుంటున్నాడు. ఏవేవో దృశ్యాలు రంగారావు ఊహాప్రపంచంలో చకచక గడిచిపోతున్నాయి.

"వరదబాధితుల సహాయార్థం..."

"బీచ్‌లోనా?"

"క్షమించండి. కాని మీ ఇల్లు ఎక్కడో..."

ఫలానా.. ఫలానా ...

"థాంక్స్. రేపు కనిపిస్తాను."

"అలాగే."

తరవాత?

ఆకాశమంత శూన్యం. అయినా అదేం ప్రారంభం? మొదట్లోనే యాచన అంత ఫలప్రదమూ కాదు, శుభప్రదమూ కాదు.

"మీకేమీ అనుకోకపోతే..."

"అనుకోనులెండి."

"మరేమీ లేదు. మీతో మాట్లాడాలని ఉంది."

"మాట్లాడటానికేం?"

ఏం మాట్లాడాలి? ఏ విషయం గురించి? ఏదైనా సంఘటన జరిగితే బావుంటుంది.

"ఎంతో కృతజ్ఞురాలిని."

"ఛ. దానికేం. నేను చేసిందేముంది, మహా."

"సమయానికి మీరు కనిపించకపోతే..."

"అలా జరగాలని ఉంది. మీకు సహాయం—నాకు చేతనైనంత వరకేవినా—చెయ్యగలగటం నా అదృష్టం."

ఏం సహాయం? ప్... ఫ. ఆలోచన సాగటం లేదు. అసలివన్నీ ఎందుకు? సూటిగా పోవటం మంచిది.

"మీ రెవరో నాకు తెలియదు. మీ పేరేమిటో తెలియదు. మీ భాషేమిటో తెలియదు. మీరేం చదివారో తెలియదు. ఏం చేస్తున్నారో తెలియదు. కాని మిమ్మల్ని గురించి ఒక్క విషయం తెలుసు. మీరు నా హృదయం అపహరించారు. మీరేమన్నా సరే. డొంక తిరుగుడు లేకుండా చిత్తశుద్ధితో చెప్పాను."

"షటప్." అంటే? నోరుమూసుకుని కాళ్లకి బుద్ధి చెప్పటమేనా?

అదికాదు పద్ధతి. మరేది? ఏమో. ఏదయితేనేం? తరవాత నాసుకోవొచ్చు. తరవాతంటే? వీలైనప్పుడు. ఎవరికి? ఇద్దరికీ—కనీసం ఆమెకి. ఎప్పుడు వీలవుతుంది? అయినప్పుడే. అందాకా...ఆకాశంలో, మేఘాలమధ్య—

ఆ అందాలరాణి పక్కన ఎవరో ఆ అదృష్టవంతుడు. ఓహో! ఏం అదృష్టం! అందరూ చూస్తున్నారు—బీచ్‌లో, రోడ్డుమీద, సినిమాథియేటర్లో, అన్నిచోట్లా. మెచ్చుకుంటున్నారు, ఈర్ష్యపడుతున్నారు. ఆకాశం మీదనించి దిగొచ్చినట్టుగా... గర్వంగా...ఆనందంగా.. పడ్డది. "చీకటి పడుతోందిరా బ్రదర్." బుజంమీద చెయ్యి పడ్డది.

ఉలిక్కి పడ్డాడు రంగారావు—అప్పుడూ, ఇప్పుడూ కూడా. ఇప్పుడింకా సంధ్యే. ఈర్ష్యపడే వాళ్లలో ఇప్పుడు తనుకూడా ఒకడు. ఆఇద్దరూ ఇంకా అక్కడే—తనదే పొరపాటు. కాని రామకృష్ణ! వాడెప్పుడూ అంతే. వాడి మనసులో నిర్ణయాలు తప్ప ఆలోచన లుండనట్లే ఉంది. మొన్నటికి మొన్న—నిన్న కాక మొన్న—

రంగారావు మనసంతా చికాగ్గా ఉంది. రాత్రి ఎనిమిదయింది. హోటల్లో భోజనంకూడా చెయ్యలేదు. చెయ్యాలనిపించలేదు. విసుగ్గా కాంప్ కాట్ మీద పడుకున్నాడు. ఆఫీసర్ ముందు తనెంత చులకనయాడు. సాయంత్రం ఆరుదాటినా ఆ వెధవ జీతాల బిల్లు చెక్ చెయ్యటం పూర్తికాలేదు. తనూ మనిషే. యంత్రంలాగా పొద్దుటినించీ పని చేస్తున్నాడు. ఇంకా కొంచెంసేపు ఆఫీసులో కూర్చోటానికి తనకేమీ అభ్యంతరం ఉండకపోయేదే...కాని మళ్ళీ చీకటిపడితే ఆ ఎర్రపూల అంచుగల తెల్లచీర బీచ్‌లో అదృశ్యమౌతుంది. లేచాడు, జీతాల బిల్లు డ్రాయర్ లోకతోసేసి. ప్రత్యక్షమయాడు జనరల్ మేనేజర్ యముడిలాగా.

"జీతాలబిల్లు చెక్ చెయ్యటం అయిందా?"

"ఇంకా కొన్ని పేజీలు మిగిలాయండి... రేపు."

"అవి పూర్తిచేసేసి వెళ్లండి."

"కొంచెం పనుందండి."

"అర్జంట్."

"కాని..."

"తప్పదు."

"ఇప్పటికే ఆరయింది."

"మీరు చాలా స్లో"

ఒళ్ళుమండింది రంగారావుకి.

"ఏ విషయంలో? ఇంటికి పోవటంలో నేనా?" అనబోయి "క్షమించండి. మీరు పొరబడుతున్నారు" అని మాత్రం అన్నాడు.

ఆఫీసర్‌కి మండింది, ఈసారి.

"నేను నవసరంగా ఏమీ అనదలుచుకోలేదు. నాక్కావలసింది పని. మాటలూ, సోమరితనమూ కాదు."

రంగారావుకి ముఖం జేవురించింది. ఏమనాలికీ "తాహతు తెలుసుకొని మాట్లాడండి"

"ఏమిటీ?"

"మాటలంటే పడేవాళ్లెవరూ లేరు"

"చాలాదాకా ఉందే"

"నేను చాలా సహనం చూపిస్తున్నాను. కాని మీ రపార్థం చేసుకుంటున్నారు. ఉద్రిక్త పరిస్థితికి తరుముతున్నారు"

"షటప్"

"యూ షటప్. ఇదిగో రాజీనామా. మర్యాద నేర్చుకోండి. వెడుతున్నాను"

రంగారావు పెదవులు వొణికాయి. అంతే. అలాగే అనాలి. కాని, కొంచెం తటపటాయించాడు.

సమాధానం ఏమీ రాకపోవటంవల్ల ఆఫీసర్ మరి కొంచెంసేపు మౌనం వహించి తరవాత "ఇప్పుడే చెబుతున్నాను. ఇవాళ ఈ బిల్లుల చెకింగ్ అయితే కాని మీరు వెళ్ళటానికి వీల్లేదు" అని గంభీరంగా అనేసి వెళ్లిపోయాడు.

రంగారావు మనసు మనసులో లేదు. ముఖం చిట్లించుకున్నాడు. కోపంగా కుర్చీలో కూలబడ్డాడు. విసుగ్గా డ్రాయర్ తీశాడు. జీతాల బిల్లు విసిరి డ్రాయర్ మీద కొట్టాడు. చీదరింపుతో కలం తీసుకున్నాడు. ఎంత సాహసం ఈ ఆఫీసర్ కి! తనేం చేస్తే బావుంటేది...ఏవేవో దృశ్యాలు ..

జీతాల బిల్లు ఆఫీసర్ ముఖంమీద విసురుగా కొట్టుకుంది. కలం నేలమీద ధామ్మనిపడి సిరా కక్కింది.

"వీల్లేదూ. ఇదిగో మీ కళ్లముందే ఇప్పుడే లార్డులా వెళ్ళిపోతున్నాను చూడండి.. వీలుందా?"

రంగారావుకి చాలా సంతృప్తిగా ఉంది. పోనీ—అలా కాకపోతే...

సరాసరి జనరల్ మేనేజర్ ఆఫీసుదగ్గిరికిపోయి నుంచున్నాడు. సిగరెట్ పొగ గుప్పుమంది. ఆఫీసర్ ముఖం చిట్లించుకుని ముందుకు చూశాడు.

"వాట్...?"

"ఎస్"

"ఎంత సాహసం!"

"ఇదిగో, అకౌంట్స్ అసిస్టెంట్ రంగారావు రాజీనామా. గుడ్ బై"

చిరునవ్వు! చిన్నబోయిన ముఖం!

రంగారావుకి నవ్వొచ్చింది. అంతే, అలాగ అవమానించాలి. చెప్పుదెబ్బ కొట్టినట్టుగా......... లేకపోతే—ఇంకా ఏడిపించాలంటే...

ఇంకేవేవో దృశ్యాలు!

కలం ఆగిపోయింది. మనస్సు పనిచేస్తోంది.

"ఏమిటి? ఇంకా కాలేదా?"

ఉలిక్కిపడ్డాడు రంగారావు.

"స్లో. స్లో. ఆశ్చర్యం! ఇలాంటివాళ్లని నే నెక్కడా చూడలేదు."

రంగారావుకి చప్పున గుర్తొచ్చింది, పొరపాటు. పోనీ, ఇదే మంచి అదును.

"మొదటే చెప్పాను, ఈపని పూర్తికాందే ఇక్కడినించి కదలటానికి వీల్లేదని. ఇక మీ ఇష్టం."

జనరల్ మేనేజర్ శాంతంగా అన్నాడు. చర్రున కోపంవొచ్చింది రంగారావుకి. అతని పెదవులు వొణికాయి. కాని...కాని...రంగారావు ముఖం చిట్లించుకున్నాడు. మాట్లాడలేదు. మేనేజర్ కూడా ఏమీ మాట్లాడలేదు. వెళ్ళిపోయాడు.

రంగారావు విచారించాడు. పశ్చాత్తాపపడ్డాడు. అని ఉండాలిసింది. తలవాచేట్టు చీవాట్లు పెట్టఉండాలిసింది...అప్పుడూ—మళ్ళీ రూంలో కూడా అలాగే అనుకున్నాడు అతను. ఏమిటో అసంతృప్తిగా, అశాంతిగా ఉంది. అవును. ఎప్పుడో తప్పకుండా ఆ మేనేజర్ కీ తనకీ యుద్ధం జరుగుతుంది. జరిగితీరుతుంది. తనలాంటి మానాభిమానాలు కలవాడు ఇలా ఎంతకాలం సహిస్తాడు. ఎప్పుడో ఒకరోజు ఆ ఆఫీసర్ ముఖంమీద కాగితాలు విసిరికొడతాడు. ఎప్పుడు? ఎప్పుడో ఒకరోజు! తప్పదు.

ఎవరో తలుపు తట్టారు. ఇంకెవరు? రామకృష్ణే. ఈ గొడవలో రామకృష్ణ సంగతి మర్చిపోయాడు. స్నేహితుడికి రమ్మని ఉత్తరం రాసి వాడి సంగతే మర్చిపోయి పడుకున్నాడు, ఈ పగల గొడవలో—

"స్టేషనుకి రాలేదేం?"

"మనస్సు బావుండలేదురా."

"ఏంజరిగింది?"

చెప్పాడు. రామకృష్ణకూడా రంగారావు అభిప్రాయాలతో ఏకీభవించాడు. ఎప్పుడో ఒకసారి తప్పకుండా బుద్ధిచెప్పాలంటే 'తప్పకుండా' అని వంతపాడాడు. భోజనాలూ అవీ అయి పడుకోబోతుండగా మాటవరసగా అడిగాడు రంగారావు.

"అయితే నీకు సెలవు సులభంగానే దొరికిందన్నమాట."

"అహా."

"మీ ఆఫీసర్ మంచివాడిల్లే ఉన్నాడు"

"ఆ. మంచివాడే.

"అడగ్గానే ఇచ్చాడా?"

"అంత మంచివాడు కాదులే"

"వీల్లేదన్నాడా"

"ముమ్మాటికీ వీల్లేదన్నాడు. ముమ్మాటికీ వీలుందన్నాను. అయితే సరే అని ఒప్పుకున్నాడు"

రంగారావు ఆశ్చర్యపోయాడు.

"సరిగ్గా చెప్పు. అసలేం జరిగింది?"

"ఏముందీ? ముందు మర్యాదగా సెలవు కావాలని అడిగాను. అవసరమని చెప్పాను ఇవ్వటానికి వీల్లేదన్నాడు. 'వీల్లేందుకుండదు? కాకపోతే రాజీనామా ఇవ్వాలిసి రావొచ్చు. అంతేగా' అన్నాను. అంతకుముందు ఓసారి ఛీఫ్ అకౌంటెంట్‌తో ఓ చిన్న ఘర్షణ జరిగిందిలే. లెడ్జర్ పోస్టింగ్స్ పూర్తి కానిదే ఎంత చీకటిపడ్డా ఇంటికి వెళ్ళటానికి వీల్లేదన్నాడు. వెంటనే లెడ్జర్ మూసేసి వచ్చాను. పక్కన జనరల్ మేనేజర్ కూడా ఉన్నాడు. ఇద్దరూ నోళ్ళు తెరుచుకుని చూస్తూ ఊరుకున్నారు. మళ్ళీ అలాంటి సంఘటన జరగటం పాపం ఏ ఆఫీసర్ కిష్టం ఉంటుంది. సెలవిచ్చేశాడు.' రంగారావు నోరు తెరుచుకుని విన్నాడు. అతని ఆశ్చర్యానికి అంతులేదు.

"ఉద్యోగంనించి తీసెయ్యలేదా?"

"తప్పెవరిది? నాదికాదుగా. అవిధేయత అనొచ్చు. కాని దేనికైనా హద్దుంది. వాళ్ళు హద్దు మీరితే అది వాళ్ళకి తెలియచెప్పటం మన విధేమో. ఏమయితేనేం. నాకుమటుకు ఈ వ్యాసన చెప్పలేదు. ఏమనుకున్నారో, ఏమో. నేను దేనికైనా సిద్ధంగానే ఉన్నాను. అందువల్ల ఆ నిమిషంలో ఆ విషయం ఆలోచించలేదు"

ఎప్పుడూ అంతే రామకృష్ణ! తనకి మొదటి నించీ తెలుసు. ఎందుకూ, ఆరోజు సాయంత్రం జీవితంలో మర్చిపోటానికి వీల్లేనిది—

వీధుల్లో ఎక్కడ చూసినా బారులు బారులుగా జనం. పొద్దుటనించి అంతే. రేడియోలో—తెలుగులో వార్తలు—చివరి అంశం విన్నప్పటినించీ అంతే నినాదాలు. ఉద్రేకం. అన్ని కాలేజీల విద్యార్థులు, అన్ని సంస్థల్లో ఉద్యోగులు, పెద్దలు, చిన్నలు స్త్రీలు అంతా—వీధులనిండా బారులు తీర్చిపోతూ ఒకేక—

పోలీసులు భయంతో చూస్తున్నారు. తిరుగుతున్నారు......గొప్ప సంచలనం. ఉన్నట్టుండి జనం గుమిగూడారు. ఏదో జరిగింది ఏదో ఏమిటి? రిజర్వుపోలీసులు ఎవరినో కొట్టి అరెస్టుచేశారు. ఉద్రేకం పెరిగిపోయింది. విడుదల చెయ్యాలని తీవ్రంగా అరిచారు జనం. కలెక్టరు ఆఫీసు ఆవరణలోకి రాకుండా పోలీసుల కాపలా...

రంగారావుకి ఆపుకోలేనంత క్రోధం, ఉద్రేకం కలిగాయి. ఏమిటి దౌర్జన్యం! పోలీసులు లాఠీలతో జనాన్ని నెట్టుతున్నారు. బాయొనెట్లు పట్టుకు జడిపిస్తున్నట్టుగా పోజులు పెట్టి నుంచున్నారు. అందరి ముఖాల్లో తీవ్ర అసహనం, కోపం, ఉద్రేకం ప్రతిఫలించాయి—ఎవరో కుర్రాడిని వెనక్కి బలంగా తోశాడు రిజర్వుపోలీస్. రంగారావుకి ముఖంలోకి నెత్తురు చిమ్మింది. ఇటే వొస్తున్నాడు అతను—తుపాకీ, లాఠీ...నెట్టుతూ, జనాన్ని.

రంగారావు మనసులో ఏవేవో దృశ్యాలు... ఆ లాఠీ ఠపీమని పట్టుకులాక్కుంటే—

ఎవరో పడిపోయాడు...పడిపోయాట్ట. పోలీసు కొట్టాడు. డౌన్ విత్ వయొలెన్స్. అహింసా వాది శ్రీరాములుగారికీ జయ్...ఆ కుర్రాడు...కుర్రాడు ...స్టూడెంట్ ...బి. కాం. చదువుతున్నాడుట. ఎవరో గుర్తుపట్టారుట. జనం అరుస్తున్నారు. ఎవరు? రంగారావా? జయ్ రంగారావ్‌కి. రంగారావుని వెంటనే విడుదలచెయ్యాలి. అరె అప్పుడే ఆఫీసు లోపలికి తీసికెళ్లారు—అరెస్ట్! అరుపులు. గోల.

ఊరుకుంటారా జనం, మరి. విడుదల చేశారు. అఖండ విజయం. ఎవరో భుజాలమీద మోసుకుపోయారు. హీరో...రంగారావ్. త్యాగి! వీరుడు! యోధుడు!—

పోలీసు వెనక్కి నెట్టాడు—రంగారావుని. ఆలాఠీ! రంగారావు వెనక్కి తూలాడు. ముందుకి దూకి ఆ లాఠీని...

ప్చ్. ఎంత బావుండేది, ఆ లాఠీ లాగిపారేస్తే! లాగి పారేస్తాడు, ఈసారి. అవును, మరి. మితిమీరి విజృంభిస్తుంటే—. ఎప్పుడో ఓసారి...

అరె. ఎవరినో పోలీసు లాటీచార్జి చేశాడు. కిందపడ్డాడు కుర్రాడు. ఎవరు. ఎవరు? మూగారు జనం...రామకృష్ణ. అవును, రామకృష్ణే! అన్నాడు బయటికి. విన్నారెవరో. రామకృష్ణట. జనం మూగారు తనచుట్టూ. చెప్పాడు. క్లాస్‌మేట్. వి

కాబో విద్యార్థి...జయ్. రాకృష్ణకీ. డౌన్‌విత్ వయొలెన్స్. అహింసా వాది శ్రీరాములుగారికి జయ్. రామకృష్ణని వొదిలేయాలి. ఒకటే గోల. వాలి పోయారు పోలీసులు. భుజాలమీద మోశారు వాడిని. హీరో. జయ్ రామకృష్ణకీ...యోధుడు! వీరుడు!

అరె. చూస్తూండగానే వీడు—! అసలు రామకృష్ణ ఎప్పుడూ అంతే. తను మాట్లేదూ, ఆ రోజు డిబేట్ లో—

'పరిశ్రమలు జాతీయం చెయ్యటం అనర్థదాయకం.'

అటూ ఇటూ టకటక మాట్లాడేశారు విద్యార్థులు. సంకుచితత్వం ప్రబలి స్వార్థం మాత్రం అధికారం చెలాయిస్తూ మనుషుల మనసుల్ని బానిసలుగా చేసి సొంతలాభానికి తరిఫీదు ఇస్తున్నప్పుడు పరిశ్రమల్ని జాతీయం చెయ్యటం తప్ప అన్యథా శరణ్యం లేదు. స్వప్రయోజనాలకోసం, దేశక్షేమాన్ని, మానవ సమాజ శ్రేయస్సునీ నిర్లక్ష్యంచేసి శ్రామికుల్ని, సామాన్యుల్ని పీడించే పాడుపనికి దోహదం కలిగించిన పెట్టుబడిదారీ విధానంనించి పరిశ్రమలు విముక్తిపొందాలి? ప్రభుత్వపరం కావాలి. అప్పుడే దేశక్షేమం పదిలం.

వివాదాలవల్ల లాభం శూన్యం. సొంతలాభం కోసం పరిశ్రమల పెట్టుబడిదారులు అన్యాయంగా ఇతరుల్ని పీడిస్తున్నారనటంలో అర్థం లేదు. ఉత్పత్తి ననుసరించే ఉత్పత్తిదారులు ప్రతిఫలం పొందుతున్నారు. బ్రిటన్‌లో జాతీయం చెయ్యబడ్డ పరిశ్రమల గతేమయింది? అవి పెట్టుబడిదారీ వర్గాలకింద ఉన్న పరిశ్రమలకంటే ఉన్నతస్థాయిలో ఉన్నాయా? జరగాలిసింది మనుషుల్ని శంకించటం కాదు. సరిగ్గా అర్థం చేసుకోటం.

వాద ప్రతివాదాలీ విధంగా జరిగాయి.

చర్చ జరుగుతున్నంతసేపూ రంగారావు మనసులో దుమారం రేగుతూనే ఉంది. చర్చ అతనికి చాలా అసంతృప్తి కలిగిస్తోంది. తనీ విషయంమీద బాగా చదివాడు. ఎవరూ మాట్లాడాలిసిన విధంగా మాట్లాడలేదు. పరిశ్రమలు వ్యక్తి పరంగా ఉన్నందువల్ల కలిగిన లాభనష్టా లేమిటి? సాంకేతికంగా, ఆర్థికంగా, పారిశ్రామికంగా, సామాజికంగా వ్యక్తి యాజమాన్యం ఏ ఏ ఫలితాలు సాధించింది? ఏ ఏ ప్రయోజనాలు పొందింది. ఆ విధానంలోగల లోటుపాట్లేమిటి? ఈ లోటుపాట్లని ఏవిధంగా సవరించటానికి వీలవుతుంది? వీలుకాదా? అలా ఐతే పరిశ్రమల్ని జాతీయం చెయ్యటంవల్ల ఈ సమస్య పరిష్కరింపబడుతుందా? వ్యక్తి యాజమాన్యం సాధించలేని ఔన్నత్యం జాతీయ ఆధ్వర్యం సాధించగలుగుతుందా? ఏవిధంగా? ఇలా ఆలోచిస్తే నిష్పక్షపాతంగా ఉంటుంది. కొన్ని పరిశ్రమల్ని ప్రభుత్వమే నిర్వహించాలిసి ఉంటుందని స్పష్టమౌతుంది. అలాగే కొన్ని పరిశ్రమల్ని వ్యక్తులు నిర్వహించటమే శ్రేయస్కరంగా కనిపిస్తుంది...

ఇదంతా తను గొప్పగా విశదీకరించగలడు. అలా తను ఏకధాటిగా, అనర్గళంగా లెక్చరర్‌లా మాట్లాడేస్తే—

రంగారావు మనసులో ఏవేవో దృశ్యాలు... ప్రతి లెక్చరరూ తనవైపే చూస్తూ పాఠం చెబుతున్నాడు. విద్యార్థులంతా ఫలానా రంగారావు నా స్నేహితుడంటే నా స్నేహితుడని...ఇంకా...... ఇంకా. అందమైన అమ్మాయిల గుసగుసలు...అతనే .. రంగారావు—ఆ రోజున డిబేట్ లో...ఓహో! —అప్పుడు...ఓరగా— మెరుపుల్లా మురిపించే చిరునవ్వుల దొంతరలు—

"ఇంకెవరైనా మాట్లాడాలని ఉంటే మాట్లాడొచ్చు" అధ్యక్షుడు అన్నాడు.

రంగారావు కదిలాడు. లేస్తే! తను పేరివ్వలేదు. తయారు చేసుకోకుండా అప్పటికప్పుడు టకటక మాట్లాడేస్తే! తనకి ఇంగ్లీషు బాగానే వొచ్చు. మాట్లాడగలడు—

అధ్యక్షుడు మళ్ళీ ఆహ్వానించాడు.

రంగారావు ఊహాపథంలోనించి దిగలేదు.

"అధ్యక్షు మహాశయా! సోదరీ సోదరులారా!" గంభీరంగా వినపడ్డది. ఉలిక్కిపడ్డాడు రంగారావు. రామకృష్ణ! కొంచెం తడుముకుంటున్నాడు...నిలదొక్కుకున్నాడు. ఏదో మాట్లాడేస్తున్నాడు. టకటక ...అరె, అన్నీ తన పాయింట్లే. లెక్చరర్లు తలూపుతున్నారు. అందరూ ముగ్ధులైపోతున్నారు......రామకృష్ణ!

ఈ రామకృష్ణ ఎప్పుడూ ఇంతే. వాడి నేమనాలి! రామకృష్ణ వాడికి తగిన పేరు కాదు— చిచింద్రి అంటే...

కాని ఆ క్షణాన రంగారావుకి రామకృష్ణని చిచింద్రీ అని మెచ్చుకోటానికి మనసొప్పలేదు. కొంచెం ఈసడింపుతో కూడుకున్న పేరైతే గాని—

"రంగారావ్."

సముద్రంవైపు చూస్తూ నుంచున్న రంగారావు ఈ పిలుపు విని ఆలోచనలు ఫటాలున భగ్నం కాగా వెనక్కి తిరిగి చూశాడు. అతని గుండె గబగబ కొట్టుకుంది. ఆ ఇద్దరూ తనకి దగ్గరగా వొచ్చారు. రామకృష్ణ తనదగ్గరకి రమ్మన్నట్టుగా సంజ్ఞ చేశాడు. వెళ్లాలనిపించలేదు రంగారావుకి. తన గొప్పతనం చూపలేదని కాబోలు, ప్రదర్శించుకోటానికి తయారయాడు.

రంగారావు ఏదో సంకోచిస్తున్నట్టుగా అలా అక్కడే నిలబడి ఉండటం చూసి రామకృష్ణ మళ్ళీ పిలిచాడు. వొద్దనుకుంటూనే రంగారావు కదిలాడు. పక్కన ఆమె తను మూర్ఖుడనుకుంటుందేమో అని భయం. లేకపోతేనా వాడికి బుద్ధొచ్చేట్టు తను గిరుక్కున వెనక్కి తిరిగిపోయేవాడు. "ఇతను నా క్లాస్‌మేట్. రంగారావు. ఇక్కడ ఓ కంపెనీలో అకౌంట్స్ అసిస్టెంట్‌గా పని చేస్తున్నాడు. ఈమె శోభాదేవిగారు. మొన్నే ఇంటర్ పాసయారు."

పరస్పరాభివాదాలయాయి. రంగారావుకి ముఖం ముడుచుకోవాలనే ఉన్నా, తీరా ఆమె తన ముఖం ఎల్లప్పుడూ అలాగే ఉంటుందేమోనని అపోహ పడుతుందని చిరునవ్వు ప్రదర్శించాడు. కాని మనసులోని వికారం ముఖంలో అప్పుడప్పుడు ద్యోతకమవుతూనే ఉంది. ఆమె ఎక్కువగా ఏమీ మాట్లాడలేదు. తనూ మాట్లాడలేదు. ఆ రామకృష్ణే వాగేస్తున్నాడు. మరి కొంచెంసేపటిలో ఆమె సెలవు తీసుకుంది. రూమ్‌కి వెళ్లేదాకా రామకృష్ణతో సరిగా మాట్లాడకుండా ముభావంగానే ఉన్నాడు రంగారావు. అతనంటే ఎంత కోపంగా ఉన్నా ఆమెతో ఎలా పరిచయం చేసుకున్నాడో తెలుసుకోవాలని రంగారావుకి మహా కుతూహలంగా ఉంది. ఉండబట్టక అడిగేశాడు. తను నోరు చేసుకుని అడిగినందుకైనా సమాధానం తిన్నగా చెప్పనేలేదు రామకృష్ణ.

"మాట్లాడుకుంటే వీలే దొరకదా?" అని మాత్రం అన్నాడు. ఆ వీలు దొరక్కనేగా తన సంతోషమంతా వాడికి ధారపోయాలిసొచ్చింది!

ఈ సంఘటన జరిగినతరవాత మూడు రోజులు వరసగా బీచ్‌కి పోవటానికి వీల్లేకపోయింది. సాయంత్రం కాగానే ఏ సినిమాకో దారి తీసేవాడు రామకృష్ణ. పొద్దున్నే ఒంటరిగా ఎక్కడికో వెళ్ళి భోజనం వేళకి తిరిగొచ్చేవాడు. రంగారావుకి మనసులో బాధగానే ఉంది. రామకృష్ణ ఎక్కడికెడుతున్నాడో తనకి తెలుసు. కావాలని తనని బీచ్‌కి రానియ్యకుండా చేస్తున్నాడు. కాని అతని చొరవ తనకి మహా ఆశ్చర్యం కలగచేసోంది.

ఆరోజు పొద్దున్నే మామూలుగా ఎక్కడికో వెళ్లొచ్చాడు రామకృష్ణ. వొచ్చీ రావటంతోనే "ఇవాళేరా, జేరా మనకు వెళ్ళేసేరోజు" అన్నాడు. ఇప్పటికే మొదట అనుకున్నకంటే ఓరోజు ఎక్కువ ఉన్నాడు. అయినా మాటవరసకన్నాడు రంగారావు.

"ఏంతొందర?"

"మళ్ళీ మా మేనేజర్‌కి కోపం తెప్పించటం దేనికి?"

"మేనేజర్ కోపం కాదుగా మనకి ముఖ్యం"

ఉద్దేశపూర్వకంగా అని రామకృష్ణ ముఖంలోకి చూసి వ్యంగ్యంగా నవ్వాడు రంగారావు.

"కాదులే. ఐనా మళ్ళీ త్వరలో రావాలిగా ఎలాగో."

రంగారావు ముఖం చిట్లించుకున్నాడు. అసలు విషయం చెప్పడు. అదో జబ్బు. నలుగురూ తనని హీరోలాగా గౌరవించాలని, పూర్తిగా చేసేదాకా ఏమీ చెప్పడు. బహుశా వ్యవహారం నలుగుతూనే ఉంది కాబోలు ఇంకా. కొంచెం ఉక్రోషం వొచ్చింది రంగారావుకి. ఆ స్థితిలో అనేశాడు.

"ఎందుకూ?"

ఆ మాటలో ధ్వనించిన మాత్సర్యం రంగారావుకి ఆశ్చర్యం కలిగించింది. కాని రామకృష్ణ అదేమీ గమనించనట్టుగానే, యథాలాపంగా అడిగిన ప్రశ్నకి జవాబిస్తున్నట్టుగా అన్నాడు.

"నీ పెళ్ళికి పిలవ్వా ఏమిటి?"

"పెళ్ళేమిటి?"

"చేసుకోవా?"

"బహుశా, నీకంటే ముందు కాదేమో!"

దబ్బుతీశాడు.

"ఇంకా నే నెవర్నీ ప్రేమించటంగానీ, ప్రేమించబడటంగాని — అలాంటి సూచనగానీ, అవకాశంగానీ లేదుగా."

రంగారావు నిర్విణ్ణుడయాడు, కోతి! కాని—

"నా దగ్గర దాచకు."

"దాచలేదు గనుకనే నిజం చెప్పాను. అందరికీ నీలాంటి అదృష్టం ఉండొద్దూ?"

"అదృష్ట మేమిటేౕ?"

"నీ కుండా ఆగిపోతుందేమో నసే భయం లేక పోతే, వొచ్చీరావటంతో నే అసలు విషయం చెప్పేసే వాడిని."

"ఏమిటది?"

"ఆ ఎర్రపూల అంచుగల తెల్లచీర ధరించే అమ్మాయి లేదూ?"

"ఆఁ...ఆమె?"

"నిన్ను పెళ్ళి చేసుకోటాని కిష్టపడటానికి అభ్యంతరం ఆమె కేమీ ఉండదు."

రంగారావు అప్రతిభుడయ్యాడు. రామకృష్ణ వైపు కళ్ళప్పగించి అలాగే చూడసాగాడు. ఆ అవస్థలో ఉన్న రంగారావు భుజం తట్టాడు రామకృష్ణ, అభినందన పూర్వకంగా.

"నిజమా?"

"ముమ్మాటికీ."

నమ్మశక్యం కావటం లేదు రంగారావుకి. ఈ తలవని తలంపు పరిణామం ఏమిటి? రామకృష్ణని తను ఎంత అపార్థం చేసుకున్నాడు! రామకృష్ణ! వా డెప్పుడూ అంతే. మనసులో కృతజ్ఞతాభావం వెల్లివిరిసింది. కాని పైకి ఏమీ తోణకకుండా ఓ చిన్న సందేహం వెలిబుచ్చాడు.

"నీ కెలా తెలిసింది?"

"ప్రయత్నం చేసింది నేనైతే నాకు తెలియక ఇంకెవరికి తెలుస్తుంది?"

కొంచెంసేపు రంగారావు నిశ్శబ్దంగా ఉండి వివరాలకోసం అభ్యర్థించాడు. రంగారావు గుణగణాలని తా నెలా తెలివితేటలతో ఆమె ముందర పొగిడిందీ, ఆమె ఆసక్తితో ఎలా విన్నదీ చిన్న కథగా చెప్పాడు.

"ఆమె ఏమంది? ఒప్పుకుందా?"

"నీ మొహం. ఒప్పుకున్నట్టు ఎవరైనా చెబుతారా? అది మనం గ్రహించాలిసిన విషయం. ఇహ మిగిలిందల్లా నువ్వు మాటమాత్రం అనటమే. అంతా సాఫీగా జరిగిపోతుంది."

రంగారావు మేఘాల్లో విహరించాడు. కలలో అనుకున్న విషయం! కేవలం కలే ఐపోతుందేమోనని చింతించిన విషయం! ఇప్పుడు యథార్థం కాబోతుంది. రామకృష్ణ! ఇది అతనికి అఖండ విజయం. అతను సాధించిన అన్ని విజయాలకీ ఇది తలమానికం. అతను సాధించిన విజయం!

హృదయవీణ అకస్మాత్తుగా అపశ్రుతి పలికింది—ఘోరమైన అపస్వరం!

రంగారావు చలించాడు.

చంద్రుడూ, వెన్నెలా సూర్యుడి దలవ!

రంగారావు ముఖంలో కాంతి అదృశ్యమైంది. ప్రయోజకుడు రామకృష్ణ! అతని ప్రయోజకత్వం నీడన—ఘటికుడు, రామకృష్ణ! అతని ఘటికత్వం చాటున—సమర్థుడు, రామకృష్ణ! అతని సామర్థ్యం వెలుగున—రంగారావు!

చేతకానివాడు రంగారావు! భూతద్దంలో తన చేతకాని తనాన్ని చూసుకున్నాడు రంగారావు. తనకి కావలసింది తను సంపాదించుకోలేనంత అసమర్థు డాతను? పరుల సహాయంవల్ల, దయవల్ల బ్రతికాలిసినవా డా?

ఆ క్షణంలో రంగారావుకి తనమీద చెప్పలేనంత అసహ్యం వేసింది. కోపం వొచ్చింది. తన వ్యక్తిత్వం ఆహుతి కాబోతోంది. కావటానికి వీల్లేదు.

"నీకు వీలైనప్పుడు ఆ కాస్త మాటా అనేస్తే.."

"అనను." దృఢంగా అన్నాడు రంగారావు.

"ఏం?" ఆశ్చర్యంగా అడిగాడు రామకృష్ణ.

"అంతే."

"ఆమె అందంగా లేదా?"

"ఉండొచ్చు"

"చదువు చాలదా?"

"అదికాదు"

"మరేమిటి?"

"ఏదయితే ఏం? నా నిశ్చయం అదీ"

"ఆమె అంటే నీకిష్టం లేదా?"

రంగారావు మాట్లాడలేదు.

"నేను నమ్మను. ఆరోజున నిన్ను బీచ్‌లో చూసినవా డెవ్వడూ నమ్మలేడు. అసలు సంగతి చెప్పు"

"నా కిష్టంలేదు" అనేశాడు రంగారావు.

"బాగా ఆలోచించుకో"

"అక్కర్లేదు"

కొంచెం వికృతంగా నవ్వాడు రామకృష్ణ. తాపీగా సిగరెట్ ముట్టించి పొగ వొదులుతూ ఆలోచిస్తున్నట్టుగా ఏమీ గుర్తించనట్టు చూస్తున్నాడు. రామకృష్ణ అంతగా ఆశ్చర్యపడినట్టు కనిపించేసరికి రంగారావు కొంచెం తెల్లకిందులయ్యాడు. రామకృష్ణ అదిరిపోతాడని తను అనుకున్నాడు. కాని అలా జరగలేదు. ఏమయినా తను ఆత్మాభిమాని ప్రవర్తించాలిసినవిధంగా ప్రవర్తించాడు. దానివల్ల గొప్ప నష్టం కలిగినా అంతగా చింతించవలిసిన అవసరం లేదు. ఇప్పుడు రామకృష్ణ తనకంటే వివిధంగా గొప్పవాడు!

ఆసాయంత్రం రామకృష్ణ వెళ్లిపోయాడు. వెళ్ళిపోయేముందైనా నిజమైన కారణం చెప్పమని తనని బలవంతం చేస్తాడనుకున్నాడు రంగారావు. కాని అలాంటిదేమీ జరగలేదు. రైలు కదలబోతుండగా అడిగాడతను.

"మళ్లీ ఎప్పుడొస్తావు?"

"నీచేతుల్లో నే ఉంది"

"నాచేతులో ఏముంది, సిగరెట్టు పీకతప్ప?"

"కాసేపటికి అదీ ఉండదులే. ఈప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదురా రంగారావ్"

"వేదాంతంలోకి దిగావేం?"

రామకృష్ణ నవ్వాడు, సమాధానం చెప్పాలిసిన అవసరం లేదన్నట్టుగా.

రంగారావు మెదడులో ఏవో ఆలోచనలు. వేళ్ల మధ్యనకాలుతున్న సిగరెట్టు వేడి వేళ్లకి కొంచెం సోకింది. కాలే పీకతప్ప ఓ క్షణం చూసి అవతలికి విసిరేశాడు రంగారావు. రామకృష్ణ నవ్వుతూ అన్నాడు.

"యూ ఆర్ ఆల్వేస్ టూ కాన్షస్ ఆఫ్ యువర్ సెల్ఫ్. ఎప్పుడూ నిన్ను నువ్వు జ్ఞాపకం చేసుకుంటూనే ఉంటావు. సిగరెట్టు నీవేళ్ళకి ఓసారైనా చురకవేస్తే చూడాలని ఉందిరా"

"అంత జాగ్రత్త మనిషిని కానందుకు అభినందించటానికి బదులు ఈర్ష్య పడుతున్నావుట్రా! నీవేళ్ళ చురకలుచూసి సంతోషపడు. చాల్లే"

రామకృష్ణ నవ్వలేదు. రంగారావు నవ్వు ఆపేశాడు. రైలు కదిలింది. జేబు రుమాళ్లు ఊగాయి.

స్టేషన్ దాటి నెమ్మదిగా అడుగులేసుకుంటూ నడవసాగాడు రంగారావు. రామకృష్ణ తనగురించి ఏమనుకుంటూంటాడు? తనొక్కడే కాదు హీరో—ధీరుడు, అభిమాని, త్యాగి...ఇంకా...ఇంకా... ... ఇంకా ఉన్నారు. ఎప్పుడో వొస్తుంది ఉత్తరం, వాడి దగ్గర్నించి. రంగారావు పైకి తనకి కనబడేటంత చేతకానివాడు కాడు. ఆచరణలో అసమర్థుడు కాడు.. అవసరం వొస్తే ఏమైనా...ఆఖరికి ఎర్ర పూల అంచుగల తెల్లచీర అయినాసరే—నిర్లిప్తంగా నిర్లక్ష్యం చేయగలడు—అన్నట్టు, ఆ అమ్మాయి ఏమనుకుంటుందో? పాపం!

బీచ్‌లో ఎదురౌతుంది మామూలుగా—

పలకరించదు. ఎరగనట్టుగా—

తొపత్రయపడుతోంది...

ఏం చెయ్యాలి? మథనపడుతోంది కాబోలు. ఉన్నట్టుండి—ఓరోజు—ఓ సాయంత్రం ఆమెని ఇహనస్పెన్సులో ఉంచదు. కుండ బద్దలు కొట్టినట్టుగా—

"అయాం సారీ. క్షమించండి." ఇంకేం చెప్పక్కర్లేదు. అర్థం చేసుకుంటుంది. రంగారావులాంటి వాడు అందరికీ అందుబాటులో ఉండేవాడు కాడు. విచారిస్తుంది, పాపం, ఏం చేస్తాడు? ఇంతకీ రామకృష్ణ! వాడే. కాని జరిగిందేదో జరిగిపోయింది.

అదె! ఆ అమ్మాయి ఎదురుగా వొచ్చేస్తోంది. ఆలోచనల్లో గమనించలేదు. తను బీచ్‌లో నడుస్తున్నాడు. మందమందగా ఆమె, మెల్లమెల్లగా తను సమీపిస్తున్నారు.

ఎందుకూ? ఇప్పుడే చెప్పేస్తాడు తను, సూచనగా. తనెంత బాధపడ్డాడు నిన్నటిదాకా. ఆమెని కూడా అనవసరంగా...

ఆ అమ్మాయి తనవైపు చూస్తోంది. క్రోధ. నిజానికి ఆ సాయంత్రం నాటి క్రోధ అంతా మూర్తీభవించినట్టుగా ఉంది. ఆ రామకృష్ణ అంతా పాడుచేసేశాడు. ఛీ. ఏదో పెద్ద సహాయం చెయ్యబోయి...... కాని, వాడికి మాత్రమేం తెలుసు, తనలా అంటాడని...

తను చూడనప్పుడామె తనవైపు చూస్తోంది

ఆగింది—సముద్రపు శోభ చూసే మిషతో. దుర్మార్గంగా, నిర్దయగా తను ప్రవర్తిస్తే ఆ సుకుమారకోమల శరీర హృదయం పెనుగాలికి తల్లడిల్లినట్టుగా...

కాని ఏం చెయ్యగలడు? అర్జునుడు మత్స్య యంత్రాన్ని కొట్టి జయించిన ఫలితంగా ఆ పని చెయ్యలేని, లేక చెయ్యని ఘిగతా నలుగురూ—

అసంభవం!

ఆమెని సమీపించాడు. పోనీ, తరవాత చెప్పొచ్చు. ఆమె తనవైపు దొంగతనంగా ఎగాదిగా చూస్తున్నట్టు స్పష్టం. ఏమనాలి?

"నేను... నేను. మర్చిపోయినట్టున్నారు..... రంగారావుని." అలా అనాలని అనుకోలేదు. కాని అన్నాడు. అంతే! ఆడవాళ్ళముందు నమ్రత ముఖ్యం.

"ఓ...అవునవును."

పాపం. తనకోసమే అంత పెందరాళే బీచ్ కొచ్చాడనుకుంటోంది కాబోలు. అసలు విషయం తెలియదుగా—తను ఆ పూట సెలవు పెట్టి స్టేషన్ కెళ్ళి రామకృష్ణని సాగనంపి వొచ్చాడని...

పెదవులు కదిలిస్తోంది. అడుగుతుంది కాబోలు. అడగడేం? సంకోచిస్తోంది.

ఆమె అడిగితే—

నిసుగుపుట్టి అయిదుగంటలు కాగానే ఆఫీస్ విడిచిపెట్టి వొచ్చేశానని తాను చెబితే—

అయిదింటికే రానిస్తారా అని ఆమె సందేహం వెలిబుచ్చే—వీల్లేదన్నాడు ఆఫీసర్, కాని వాడి ముఖంమీద లెటర్ కొట్టేసి వొచ్చేశాడని తాను చెబితే—

అభిమాని! వెధవ ఉద్యోగం, ఆత్మాభిమానం ముందంత? స్వతంత్రుడు—ఉదాత్త భావాలు కలవాడు...

అలాగే ఆమె అనుకుంటుంది. పోనీ, ఆమెకాకపోతే మరో ఆమె...ఎర్రపూల అంచు కాకపోతే—మరోరంగు...

"ఆరోజు...మిమ్మల్ని పరిచయం చేసిన... ఆయన...ఆయన..." తడుముకుంటోంది. ఏమిటంత మతిమరుపు?

"రామకృష్ణ." అందిచ్చాడు.

"ఆఁ, ఆఁ...అవును. ఆయన మళ్ళీ కనిపించలేదే."

పిడుగు పడ్డట్టయింది రంగారావు నెత్తిమీద. "కనిపించలేదా?"

"ఊహు. మా నాన్నగారితో ఏదో మాట్లాడాలన్నారు. మళ్ళీ రాలేదు. ఏదో బిజినెస్ టకదా! బీచ్ లో కనిపిస్తారేమోనని చూశాను. అడ్రెస్ మర్చిపోయి ఉంటారేమో." రంగారావు ఉక్కిరిబిక్కిరయాడు.

"ఊరి కెళ్ళిపోయాడులెండి. మిమ్మల్ని అంతకిముందు వారెరుగా?"

"లేదండీ. నన్ను ఎవరో అనుకుని పలకరించారట. అన్నీ చెబితే, 'పోనీ, అదీ మంచిదే లెండి. మీ నాన్నగార్ని బాగా ఎరుగున్నవాళ్ళతో పరిచయం ఉంది' అని ఏవో చెప్పారు."

రంగారావుకి తలా తోకా అందటంలేదు. బుద్ధిపూర్వకంగా రామకృష్ణ తనని వంచించటానికి ప్రయత్నించాడా? వాడికేం లాభం? ఇలాంటి చిలిపి చేష్టలు వాడికలవాటులేదే. తనని చూసేసరికి వాడికలా బుద్ధి పుట్టిందా?

ఏమైనా, ఆ క్షణంలో రంగారావుకి రామకృష్ణని నమిలి మింగేసేటంత కోపం వచ్చింది. అయితే, అకస్మాత్తుగా రంగారావు మెదడులో భావకిరణం మెరిసింది. ఇప్పుడు...ఇప్పుడు...ఎర్రపూల అంచుగల తెల్లచీర ధరించిన శోభకీ తనకీ మధ్యని ఉన్న అగడ్త మరి లేదు. అభివందనీయుడు రామకృష్ణ!

అనుకోని పరిస్థితిలో తను శోభ ఎదట నుంచుని ఉన్నాడు, నిశ్చేష్టంగా. ఏవో మాట్లాడాలి! కాని...కాని ఇప్పుడు తను ఆనందసాగరంలో మునిగి తేలుతున్నాడు. ఇప్పుడు ఏం మాట్లాడినా అవకతవకగా ఉంటుందేమో! స్తిమితపడాలి.

రామకృష్ణ మాటలు ఇప్పుడు తనకి అర్థమౌతున్నాయి. వాడలా ఎందుకు ప్రవర్తించాడో తెలిసిపోయింది! వాడెప్పుడూ అంతే! సూటిగా చెప్పడు కదా, ఖర్మ!

కొన్ని నిముషాలు మౌనంగా గడిచాయి. మర్చిపోదామన్నా వీల్లేకుండా తన అదృష్టం తనని అందలమెక్కించి ఊరేగిస్తోంది. కాసేపదంతా మర్చిపోయి

ఆ సంతోషం కనపడనీయకుండా ఏమన్నా అనగలిగితే...!

అసలు దేనికీ అది సరైన సమయం కాదు. దర్జాగా, ముభావంగా, అనవసర జోక్యం యిష్టంలేని వాడిలా అనేశాడు.

“మీ ఏకాగ్రతకి భంగం కలిగించటం యిష్టం లేదు. వొస్తా.” ఆమె చిన్నగా నవ్వింది.

అడుగు ముందుకేశాడు.

ఏవేవో దృశ్యాలు...

సిగరెట్ పీక సెగ తగిలింది వేళ్ళకి.

రంగారావుకి నవ్వొచ్చింది. తను అజాగ్రత్త మనిషి కాదు. తననిగురించి తను ఎప్పుడూ శ్రద్ధ తీసుకోగలడు—ఏ పరిస్థితిలోనైనా సరే.

సిగరెట్ పీక విసురుగా అవతలికెళ్ళి పడ్డది. రంగారావు అన్నట్టుగా శోభ సముద్రపు శోభలో తన్మయత్వం పొందటంలేదు, ఆసమయంలో. ఆమె అంత మూఢురాలేమీ కాదు.

రంగారావు ప్రవర్తన నెలరోజులనించీ ఆమె కనిపెట్టక పోలేదు. ఆరోజు సాయంత్రం తనకి సుదూరంలో కూచున్న రంగారావూ, రామకృష్ణా ఏం మాట్లాడుకున్నారో కూడా మరీ ఊహాకందనివిషయం కాదు, ఆమెకి. రామకృష్ణ కేవలం మిషతో తనని పలకరించాడనీ తెలియక పోలేదు. రంగారావుకి తనని ఎందుకు పరిచయం చేశాడో కూడా అభేద్యమైన రహస్యంకాదు. రంగారావు మనసులో ఏముందో ఎక్సరే తియ్యాలిసిన అవసరమూ లేదు. రంగారావుని గురించి తెలుసుకోవాలిసిందీ ఇంకేమీ లేదు. శోభకి తెలియనిదల్లా ఒక్కటే—రామకృష్ణ అడ్రెస్!



# శివాజీ రాజవిజయః

మూలం :

శ్రీ రవీంద్రనాథ ఠాకూరు



అనువాదం :

శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి

కస్యాంవా ప్రాక్ శతాబ్ద్యా మహని పునరనుత్ప్రేక్షణీయేచ కస్మిన్
శైలే తుంగే వివిక్తే క్వ నిబిడగహనే గాఢతామిస్రపుంజే
రాజన్ ! నామ్నా శివాజీ కృతవసతి రభూస్త్వం మహారాష్ట్రదేశే
కోవా భావస్తదాగాత్ తవనిటలతటం జాతిరఘానిమిత్తే.

"పాశైర్ధర్మైః స్వరాజ్య ప్రథితగుణమయై ర్బద్ధమీహేఽరివర్గైః
ఛిన్నం భిన్నం విశీర్ణం విదళిత మధునా భారతం వర్షమేకం,"
సోయం భావోఽవతీర్ణస్తవ మహితమతిం భానమానస్సమానః
విద్యుచ్చంచత్ప్రభాభి స్సకలజనహితే విష్ణు దివ్యప్రభావత్.

వంగేష్వేతేషు తస్మిన్నహని నహిజనః స్వప్నమధ్యాత్ప్రబుద్ధః
నైవోదన్తాస్త్వదీయాః శ్రవణ పథమగు శ్శ్వైరగాథా విచిత్రాః
నైతే గేహాద్బహిస్త్వత్సహాకృతి కరణేఽథా విషుర్యుద్ధభూమిం
నేదుర్నైవాంగణేఽస్యాః జయకల నినదామంగలాశంసిశంఖాః

ఆస్తీర్యస్వోత్తరీయం మృదువిమల లసచ్ఛ్యామలం వంగమాతా,
శాంతాస్యైకా వివస్వత్యయతి శిఖరిణాం పశ్చిమాంభోధితీరే,
సంధ్యాకాలేఽతిరమ్యే కపిశ ఘన ఘటాచ్ఛన్న డిజ్మండలాన్తే
తంద్రాయత్తాం కరోతిస్వయమురసి శతగ్రామసంతాన జాలం.

తతో మహారాష్ట్ర వనాంతరేభ్యో। బభుః కదాచి ద్గిరిదంతరేషు
కల్పాన్త శంపాగ్ని సమప్రభానః। త్వద్వజ్రకీలాస్సహవీరమంత్రైః

ముగల్భటోష్ణీష పటాంచలాని। యదా విచేలుః ప్రళయోగ్రవాతైః
పక్వేవ పర్ణప్రతతిర్నవంగ। ప్రజాస్తమస్రాంతేషు రిహోస్ర ఘోషే.

ఝంఝూరవత్సుబ్ధ నిశీథమధ్యే। శూన్యాతతో దీపాళిసౌధరాజిః
పశ్చాత్ప్రకోష్ఠాంతరగారమధ్యే। దీపాళిరాసీత్తిమిరే విలీనా

శవాదగృధ్రోచ్చరవాను మిశ్రిత్। బీభత్స చీత్కారపరంపరాసు
శ్మశానశయ్యారచితా మహిమ్నా। భస్మావశేషా ముగలుప్రభూణాం.

ముష్టిభిః పరిమేయాసు। భస్మరేఖాసు తత్క్షణే
ముగల్రాజ్యస్య సీమానో। నిశ్శేషత్వముపాగమన్.

తదానయన్స్వాంగపురోపకంఠం। వణిక్పథం శ్వేతవణిక్ప్రకాండః
సింహాసనం స్వీరవయాః పదాఢ్యా। పథాంధకారేషు సురంగయాసు

గంగోదకై స్నానభిషిచ్యవంగ। ప్రజాః పురశ్చక్రు రథప్రకామం
నిశావసానే సహిమానదండః। విశామభూద్దుస్సహ రాజదండః

తదాభవాన్ భావుక! కుత్ర దేశే! లీనో మహారాష్ట్ర కులాగ్రవీర !
నామక్వ తే ? గైరిక కేతనం క్వ ?। మలీమన స్తుచ్ఛవిధేర్విపాకాత్ .

త్వాం దస్యు బుద్ధ్యాహి పరంహసన్తి। విదేశగాథా వికటాట్టహాసైః
త్వత్పుణ్యచేష్టాస్సకలాశ్చ దస్యోః। వ్యర్థప్రయాసా ఇతి తే భణన్తి

సంస్తంభయ త్వద్బహుజల్పితాని। విదేశగాథే వికృతేతిహాసే
మిథ్యామయి త్వద్వచనాసు ధాతుః। తథ్యాతురాణాం విజయోస్తినూనమ్

అనాశయోగ్యం తవపల్గుగాథాః। కథం వినాశం గమయన్తి చిత్రం:
సత్యం తపోయత్ నహిత్రిలోక్యాం। బాధ్యేత కేనాప్యనిశం చకాస్తి

రాజర్షి వీరత్వ ముదారభావో। విధాత్రలోకే గణనాముపాత్తైః
కాలోఽనవద్యో నభవేత్కదాపి। ప్రతారిత స్తత్క్షణ మాత్రతోఽపి.

స్వదేశలక్ష్మీ పముపాననాలయే। తవానవద్యా మసుభిః ప్రపూజనాం
ప్రభూతసత్త్వా మథసాధనం చిరాత్। వివేదకో వా భరతావనిశ్రియః

అజ్ఞాతాఖ్యాతరూపా స్థితిరిహభవతా కందరేష్వద్రి భూమా
రాజర్షే! దీర్ఘకాలా దవహితమనసా స్వీకృతా దేశహేతోః
వర్షావారిప్రవృద్ధ్యా గిరివరనికరా నాపగేవాఽద్రిజన్యా
భిత్త్వాపూర్ణాజసాత్వం బహిరిహా భావసం ప్రాప్తవాన్ శౌర్యసింధో

విశ్వం జగద్విస్మయమాన చిత్తం। విలోక్యమేనే నవకేతనాగ్రం
కేషాం పతాకాంబరచుంబిసీయం। కాలేగతే కుత్ర నినిద్రపాంసౌ

మన్యే తథాహం కవిరత్రభారతే। పూర్వేఽనుపశ్యన్ మనసా వికాసినా
వృత్తాన్య పూర్వాణ్యథ వంగ భూతలే। దధ్యావ శేరీతవదిక్తటాత్ కుతః?

తమోఽతిగాఢం త్రిశరత్‌శతానాం। విదార్య వీర్యేణ తవప్రతాపః
మయూఖజాలం పరితః ప్రసార్య। ప్రాచ్యామిహప్రాదురభూత్ పునశ్చ

కదాపి నో నశ్యతి నాశ్యతేవా। సత్యం శతాబ్దీశతకానువృత్తం
నోపేక్షణైః శుష్యతినావమానైః। నకంపతే తీవ్రతరాభిఘాతైః

నశ్వే యదా సత్యమిదం విలీనం। కాలేచ కస్మిన్నితి భావ మాయుః
సత్యం తదా తేఽతిథిపూజ్య వేషం। ద్వారంయయౌ భారతమందిరస్య

అద్యాపి మన్త్రీనినదస్సచ తద్విశాలే! నేత్రేచ, భావిని సమాహిత దృష్టిపాతం
కృత్వాక్షిమైక్షిపత తత్రవిశిష్ట దృశ్యం। త్వత్ప్రాకృతం క ఇహ వేత్తి జనోఽనభిజ్ఞః

శరీరహీనస్తుసాంనిధే! త్వం। తపశ్శరీరం సముపేక్ష్య కేవలం
పురాతనీం తా ముపగమ్యశక్తిం। సమాగతః కార్యభరం గృహీత్వా.

నాసన్ ధ్వజాస్తే ద్య వమూధినీవా। నాయోధనాశ్వాః న, ఖరాస్త్రజాలం
నాద్యాస్తిరిక్షే ధ్వనతిప్రకామం। విమోహాయస్తే హరశబ్దధారా

అవాతరన్నామతవాద్యదూరాత్। లోకాత్పితృణా ముపకస్తు మూర్త్యాం
స్వామిన్ సమాహ్వాన్ స్వయమేవవంగ। ప్రాణోహ్యాదితావ్వ మవృణోత్ ముహూర్తే

స్వప్నే స్వపీహాత్రి శతాబ్దకాలే। నా తర్కయతోఽపి నరస్తదిత్థం
యత్తే మహానామ వినారణేన। సంయోజయే ద్వంగ మరాఠదేశాన్.

అంతర్హితం త్వత్తపసాం ప్రకృష్టం। తేజశ్చిరాత్కుత్రచి దేవదేశే
అకాండ ఏవాద్య దదాత్యసూననో। నవప్రభాతేఽమృతసూక్తి రూపాన్

ప్రాన్తాన్మహారాష్ట్ర భువః కదాచిత్। సమాహ్వయోధర్మ నృప! త్వమస్మాన్
నోరాడితిత్వం న పురస్కృతోఽసి। ఘోరధ్వనౌ నో నబభూవలజ్జా

పుస్ఫోరతే ఖడ్గలతా తటిత్ప్రభా । వంగాన్తరిక్షే మహితత్విషా యదా
తద్ఘోరదుర్యోగదినే భియావయం । లీనానతద్రుద్ర విలాస వేదినః

సింహాసనం యమ కటాక్షకరాళముచ్చై
రారూఢవా నమర దేహాకలానవద్య!
అత్యున్నతే తవలలాట తటే కిరీటం
యద్రాజతేస్య సురుచి ర్నకదాపి లీనా

రాజన్ ! ప్రతీమ స్తవ రాజతాం వయం
త్వద్రాజ భావః ప్రకటోద్య భారతే ।
రాజా మహాంస్త్వం తవ మిత్రతాంగతం
కోట్యష్టకం వంగమహీ తనూభువాం.

ఆకర్ణయామ న తదా వచనం త్వదీయం
నత్వాం శిరాంసి తనుమోఽద్య వయం త్వదాజ్ఞాం
త్వద్ధ్యాన మంత్రవశగా స్సకలాశ్చ దేశాః
సమ్యఙ్మిళన్తి సకలైరిహ భారతేంగైః.

భిక్షూత్తరీయేణ విరచ్య కేతుం క్షిపేమ దీనావన హేతు మగ్రే
ధర్మైకరాజ్యం భరతస్య వర్షే భావీతి వాచం కురు మోఽస్య విత్తమ్.
వంగప్రజా యుఙ్మహారట్టవీరాః ఏకేన కంఠేన జయేత్ శివాజీ
ఇతీరయన్తు ప్రథితోత్సవార్థం స్వాలంకృతాస్తుల్య పదం ప్రయాన్తు.

సభాముఖే భాసుర భారతస్య
ప్రాగ్దక్షిణే ప్రత్యగథోత్తరాచ
సహానుభూయాసు రిహైక దేశే
సమానతిం పుణ్యతరైక నామ్నా.

(శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డిగారి సౌజన్యముతో వారి యాంధ్రానువాదమునకు సంస్కృతానుసరణము.)

# కోపర్నికస్



శ్రీ ఆయపిళ్ళ సంగమేశ్వరరావు

యూరపు ఖండములోని బాల్టిక్ సముద్ర తీరమున నున్న పోలండు దేశములోని విశ్చులనదీ తీరస్థితమైన 'థోర్న్'—ఇప్పుడు 'టోర్న్'—అనబడు పటణము మన మేధావి కోపర్నికస్ జన్మస్థానము. ఈయన 1473 వ సంవత్సరం, ఫిబ్రవరి 19 వ తేదీన జన్మించాడు.

నిజంగా కోపర్నికస్ ఆధునిక విజ్ఞాన యుగ స్థాపకులలో ఒకడని చెప్పవచ్చును. మనం భూమి మీద ఎక్కడివాళ్ళం అక్కడనే వుంటున్నాం. సూర్యోదయం సూర్యాస్తమానం జరుగుతూనే వుంది. అలాగే చంద్రోదయం, చంద్రాస్తమానం కూడ జరుగుతూన్నాయి. పోగా దీన్ని బట్టి సూర్యచంద్రులు భూమిచుట్టూ తిరుగుతున్నారా అనిపిస్తుంది! ఆ కాలం నాటి ప్రజలకు ఈ విషయం ఈలాగే గోచరించిందనడంలో ఆశ్చర్యమేముంది? కాని, ఈ గ్రహముల అవినాభావసంబంధము మన కిప్పుడు తెలుసు. దీన్ని మొట్టమొదట తెలియపర్చిన మేధావి కోపర్నికస్. కోపర్నికస్ తన జీవితాన్ని గ్రహసంబంధ బాంధవ్యాలు తెలుసుకోనే ప్రయత్నంలోనే సార్థకపర్చుకున్నాడు.

కోపర్నికస్ జీవించిఉన్న దినాలలో భూమి కేంద్రముగా సమస్తమైన ఈ ప్రపంచము సృజింపబడిందని, ఈ భూమిచుట్టు గ్రహములన్నీ – సూర్యుడు కూడ—వలయాకారముగ నుండు త్రోవలలో తిరుగుచుండునని అభిప్రాయము ప్రబలముగ నుండేడిది. కాని కోపర్నికస్ "సమస్తమైన ఈ ప్రపంచానికి మధ్యస్థమైన వస్తువు భూమికాదు. సూర్యుడు" ని ధైర్యముచేసి చెప్పగలిగాడు. ఈ సందర్భంలో— "స వా ఏష న కదాచ నాస్తమేతి నోదేతి" "సూర్యునకు నిజముగా ఉదయము అస్తమానమనునవి లేవు." "ఉదయాస్త మానములను నవి కేవలము భ్రమజనితములు. భూమికి ఒక ప్రక్క దినమైనపుడు రెండవ ప్రక్క రాత్రియగును" అని—వేదకాలమునాటి మన పూర్వులు భూమాధ్యస్థము నంగీకరింపలేదనియు, సూర్యునిచుట్టు భూమి తిరుగుచున్నట్లు స్థిరపఱచిరనియు మనము గమనింపదగినది. అంతేకాకుండా కోపర్నికస్ భూమే సూర్యునిచుట్టు తిరుగుతుందని చెప్పాడు. అంతటితో సరిపెట్టక భూమి తనలో తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ తిరుగుతుందని, ఈ స్వయం భ్రమణకాలం ఒకరోజు లేక ఇరువదినాలుగంటల పరిమితికాలం అని కూడ విశదపర్చాడు. ఈనాడు మనం కోపర్నికస్ సిద్ధాంతాలను నమ్మినా, ఆనాటి ప్రజాబాహుళ్యానికి అవి నచ్చలేదు. వాటిని వారు మెచ్చుకోలేకపోయారు. దీనికి కారణం ఆనాటి విజ్ఞానశాస్త్రదృక్పథంలోని తేడా. అంతేకాకుండా కొంతవరకు మతసంబంధమైన దృక్పథప్రభావం దీన్ని సోకింది. ఈ దృక్పథాల విషయం కొంచం అవగాహన చేసుకుంటే కాని ఈయన జీవితాన్ని, గొప్పతనాన్ని గుర్తించడం సాధ్యపడదు. నిజంగా ఈయన చనిపోయిన—1543 సంవత్సరం—తరువాత శతాబ్దన్నర సంవత్సరములవరకు భూమధ్యస్థ ప్రపంచం ఈయన రవి కేంద్రీభూతమైన ప్రపంచానికి చోటు నివ్వలేదు.

## భూమిమీద మానవుని జీవితం

బహుశా 2½ లక్షల సంవత్సరముల క్రితంనుంచి మానవుడు భూమిమీద నివసిస్తూ వచ్చాడు. ఉద్భవించగానే ఉదరపోషణార్థం, కాయ, కసరు, అడవి మృగాల పచ్చిమాంసం మొదలగువాటితో కాలక్షేపం చేశాడు. ఈ మృగాల చర్మంతో తన దిగంబరత్వాన్ని కప్పుకొన్నాడు. తరువాత కొండగుహాలు వసతులుగా ఏర్పర్చుకొన్నాడు. ఆటుపిమ్మట తన తెగవారితో దేశసంచారం మొదలుపెట్టాడు.

రమారమి పదివేల సంవత్సరముల క్రితం, తన కాలాన్నంతటిని ఉదరపోషణ కోసరమే కాకుండా ఇంకోలాగ వినియోగించుకొనే మార్గాన్వేషణ చేశాడు. పంటలు పండించడం, సాధుజంతువుల

పోషణం, పాలు తీయడం మొదలగునవి అభ్యసించాడు. తోడనే తన వేటకాని జీవితం, ఒక కృషీవలుడు లేదా ఒక మందకాపరి జీవితంగా మార్చుకోగలిగాడు. ఇదే మానవుడు తన కిరాతకతత్వంనుంచి ఈనాటి పరిస్థితిని అందుకోడానికి మొట్టమొదటి మెట్టు. ఆనాటి జనం అధికాహారోత్పత్తి చేశారు. ఆకాలంలోనూ భూమి దున్ని పంటలు పండించలేనివారున్నారు. వీరిని ఆహారోత్పత్తి చేయువారు పోషించెడివారు. ఈ రెండవ తెగవారు మిగతా పనులు చేసేవారు. ఈ మిగతా పనులు మానవుని జీవిత ప్రగతికి కారణాలు కాగలిగాయి.

వీటిలో ముఖ్యమైనవి, రాతిపనిముట్లు ప్రయోగించడం, లోహములు (*Metals*) తయారుచేయడం, కుండలు, ఇటుకలు తయారుచేయడం, ఇళ్ళుకట్టడం, గాజుసామగ్రి ఉత్పత్తి మొదలగునవి. దీంతో వృత్తిని బట్టి జాతి నిర్ణయానికి పునాది వేయబడింది. ఒక జాతి తాను ఉత్పత్తిచేసిన వస్తువుల వినిమయంతో (*Exchange*) తనకు కావలసిన ఇతర పదార్థములు మిగత జాతులవద్దనుంచి సంపాదించేది.

వీటన్నిటిలో అతిముఖ్యమైన పనిముట్లు వ్రాతకు పనికివచ్చేవి. మానవుడికి జ్ఞానం కలగడం తడవుగా ప్రపంచాన్నిగురించి తెలుసుకోడానికి ప్రయత్నించాడు. దాంతో మానవుడు, "సజీవంగా బతకాలంటే కావలసింది తిండేకాదు" అన్న విషయాన్ని గ్రహించాడు. బుద్ధివికాసానికి ప్రయత్నించాడు. ఇది మనోద్భవానికి కారణం. దీంతో సృష్టి వైపరీత్యం ఏమిటూ అని అవలోకిస్తే రాత్రి పగలు ననుసరిస్తుంది; కాలాలు ఒకదాని తరువాత ఒకటి, విత్తనం నాటినదగ్గరనుంచి పంట పండేవరకు, వరుస తప్పకుండా వస్తాయి; మానవుని జీవిత, జంతు జీవితాలలోని ఘట్టాలు క్రమంగా జరుగుతాయి; ఇదే విధంగా ప్రకృతిలోని ప్రతిక్రియ నియబద్ధమై, క్రమబద్ధమైనదని తెలుసుకున్నాడు. ప్రకృతిలో ప్రత్యహం జరిగే ఈ చర్యావేదనము విజ్ఞానశాస్త్రపు పునాది. ఓడ, గాలిఓడ, రేడియోలాంటి నూతన కల్పనల కారణం మానవుడికి కల్గిన ప్రకృతిజ్ఞానం. ఇటువంటి క్రమబద్ధమైన విషయావిష్కరణమే విజ్ఞానం. మొట్టమొదటగా ఇటువంటి అచంచలమైన క్రమబద్ధమైన విషయావిష్కరణం ఆకాలంలో జరిగింది.

## నభోముఖం

మొట్టమొదట మానవుడు నా చుట్టూ వున్న ప్రపంచం ఏమిటూ అని ఆలోచించడానికి మొదలుపెట్టాడు. వెంటనే ఆకాశం, దానియందున్న వస్తువులు వీనిసృష్టి నాకర్షించాయి. నభోమూర్తులైన-ముఖ్యముగా, సూర్యచంద్రులను దేవుళ్లనుచేసి పూజించాడు అవడంలో ఆశ్చర్యమేముంది! "ఈ ఆకాశస్థిత మూర్తుల సంచారం ఏమైనా కొన్ని పద్ధతుల ననుసరించి వుందా? లేదా?" అనే విషయంగురించి ఆలోచించడం మొదలుపెట్టాడు. వీటి సంగతి తేటతెల్లము చేసిన ఒకేఒకవ్యక్తి 'కోపర్నికస్'. ఈయన స్పష్టీకరించినది, ఆకాశ స్థితిపదార్థముల విజ్ఞానము. దీన్నే జ్యోతిశ్శాస్త్రమందాము. ఇది ఆధునిక నభోమూర్తుల విజ్ఞానానికి పునాది.

మనం ఒకకొండమీదకాని లేదా ఒక గంట స్తంభముమీదకాని నిల్చుని మేఘావృతముకాని నల్లని ఆకాశాన్ని పరీక్షిస్తున్నామనుకొందాము. ఒక నిశీథ రాత్రి ఈ పరీక్ష సమయమనికూడ అనుకొందాము. అప్పుడు నక్షత్రములన్ని చిన్నచిన్న కాంతిబిందువులు (*Points of Light*) లాగ మిణుకు మిణుకుమంటూ గోచరిస్తాయి. కాని కొన్ని ఎక్కువ కాంతివంతంగాను, కొన్ని తక్కువ కాంతివంతంగాను కనిపిస్తాయి. ఆకాశంలోని నక్షత్రాల పొందిక (*Arrangement*) క్రమబద్ధమైనదికాదు. ఇవి అక్కడక్కడ ఆకాశమంతట నక్షత్రసముదాయములుగా అమరించబడి వుంటాయి—సప్తమహర్షులు, పిల్లలకోడిలాంటివి. వీటికి పేర్లు ఏలాగ వచ్చాయో అని ఇప్పుడు తెలుసుకోడానికి ప్రయత్నంచెయ్యడం అప్రస్తుతము. ప్రతీదానికి ఒక పురాణగాథ వుంది. ఇంకా ఇలా పరీక్షచేస్తూవుంటే సూర్యుడేలాగయితే తూర్పునుదయించి, పశ్చిమాన్నస్తమిస్తున్నాడో అలాగే నక్షత్రగణంలోని ప్రతీనక్షత్రం తూర్పునుదయించి పశ్చిమాన్నస్తమిస్తుంది. అంతే కాకుండా పరీ




నభోగోళము

తిలో మనకి ఈ నక్షత్రగణమంతా ఒక పెద్ద గోళముయొక్క లోపలితలానికి అతకబడి మన చుట్టూ తిరుగుతూన్నట్టుగ కనబడుతుంది. 'క' అనే బిందువుదగ్గర మనం వుండి పరీక్షిస్తే 'న' నక్షత్రం 'ఉ' దగ్గర ఉదయించి 'అ' దగ్గర అస్తమిస్తుంది. అంటే ఆకాశగోళము రోజు కొక పూర్తి భ్రమణం చేస్తుంది. అంచేతే ఈ నక్షత్రాలన్నిటినీ రాత్రి ఒకే సమయమప్పుడు ఆకాశంలో సంవత్సరమంతా ఒకేదగ్గ రున్నట్టుగా చూడలేము. ఈ నక్షత్రగణము మిగతా నభోమూర్తుల భ్రమణ వేదనకు ఎంతయో తోడ్పడుచున్నది. ఉదాహరణగా చంద్రుడొక్కొక్క రాత్రి ఒక్కొక్క నక్షత్రమునకు దగ్గరగా ఉంటాడు. ఈలాగ ఆకాశమునంతటను ఒక నెలలో భ్రమణం చేస్తాడు. ఇదేవిధంగా సూర్యుడు ఒక సంవత్సరంలో భ్రమణం చేస్తాడు. ఈ నక్షత్రాలన్నీ ఎల్లప్పుడూ ఆకాశంలోనే ఉంటాయి. కాని పగటివేళలోని సూర్యకాంతిలో వాటిని చూడలేము. ఈ సూర్య చంద్రులే కాక మిగతా సంచరించే గ్రహములు మరి ఐదు మన పూర్వీకులకు తెలుసును. అవి బుధుడు, అంగారకుడు, శని, శుక్రుడు, బృహస్పతి. అప్పటికి తెలిసిన జ్యోతిశ్శాస్త్ర మది. కేలండర్లు లేని ఆ కాలంలో సూర్యచంద్రుల పరిభ్రమణమే వారికి కేలండరు.

## ఆది జ్యోతిశ్శాస్త్రజ్ఞులు

ఆధునిక జ్యోతిశ్శాస్త్రపు మాతృకనుగూర్చి తెలుసుకొనేముందు 'నైలు' 'టైగ్రిస్—యూఫ్రెటిస్' మహానదీ తీరప్రాంత పురాతన నాగరికతను గూర్చి కొంచం తెలుసుకోవాలి. వానలులేని ఈజిప్టు దేశపు నభోమండలం, సంవత్సరం పొడుగునా చాలా భాగము మేఘావృతము కానిదిగా వుంటుంది. నక్షత్రాలు చాలా కాంతివంతంగా ప్రకాశిస్తాయి. అందుచేత అక్కడే జ్యోతిశ్శాస్త్రం పుట్టి విస్తరించడానికి అనుకూల పరిస్థితులున్నా యనడంలో అతిశయోక్తి ఏముంది? ముఖ్యంగా 'బాబిలోనియా' దేశీయులలోను,—ఇప్పటి 'ఇరాక్' దేశీయులలోను—మొట్టమొదటగా నిజమైన 'నభోమూర్తుల విజ్ఞాన'పు జాడలు గోచరిస్తాయి. క్రీ. పూ. 3,000 సంవత్సరాల నాటికే అక్కడ నాగరికత వర్ధిల్లుతూండేది. వీరు పట్టణాలలో నివసిస్తూండేవారు. వీరికి వ్రాయడం, చదవడం వచ్చు. అంతేకాకుండా వీరు చేసిన పరిశోధనల ఫలితాలను మెత్తటి తడిమంటి దిమ్మలమీద వ్రాసి, తరువాత వాటిని ఇటుకలరూపంలో భద్రపర్చేవారు. ఇప్పటికి కూడ శిథిలమైన ఆయా నగరాలలో ఇటువంటి ఇటుకలు కనబడుతూంటాయట! ఒక వంద సంవత్సరముల క్రితమే మనకు వీటిని చదవడం తెలిసింది. బాబిలోనియా జ్యోతిశ్శాస్త్రం ఇలాగుండేదని చెప్పడానికి ఆధారములీ ఇటుకలే.

ఈ నభోమూర్తుల పరిశోధనలు—మతాచార్యులు చేస్తూండేవారు—అంటే తోకచుక్కల రాకపోకలు, సూర్యచంద్ర గ్రహణాల వైఖరిలాంటివి. ఈ సందర్భంలో ఒక్క విషయం జ్ఞాపకముంచుకోవాలి. వీరు పరిశోధన లూసుపోక కాని, లేదా విజ్ఞానసముపార్జన కోసం కాని చేయలేదు. అయితే దేనికీ బాధపడ్డా రంటే, నభోవీధిలో జరిగే యీ మార్పుల ననుసరించి మానవపరిణామ భవిష్యత్తుగురించి ముందుగా తెలుసుకొనే వీలుంటుందనే నమ్మకం వారి నావరించింది కనుక. తోకచుక్క ఉదయించినా, సూర్యగ్రహణం గోచరించినా, అధికమైన క్షామం లేదా మహాభయంకరమైన యుద్ధం ముందు రాబోతూందని తలచేవారు. వెంటనే ఈ విషయం పాలించే చక్రవర్తికి, ప్రజలకు రాబోతూన్న ఆపదను ఎదిరించడానికి సిద్ధంగా ఉండమని తెలియపర్చి హెచ్చరించేవారు. అంతేకాకుండా ఈ నభోమూర్తుల ప్రభావమే ప్రతీ మానవుని బాగోగులకు కారణమన్నారు. అదే జ్యోతిషశాస్త్రమైంది. ఇది పిచ్చినమ్మకమైనా దీన్ని నమ్మేవారు ప్రస్తుత ప్రపంచంలో లేకపోలేదు. "జ్యోతిష" శాస్త్రాభివృద్ధి నిజమైన జ్యోతిశ్శాస్త్రాభివృద్ధికి దారితీసింది.

వీరు చంద్రుని, కాలపరిమితిని తెలుసుకోడానికి ఆదర్శప్రాయునిగా పెట్టుకున్నారు. వీరు, సూర్యచంద్రాది నభోమూర్తులు నక్షత్రమండలం చుట్టూ, ఒక పటకాలాంటి వర్తులాకారపు జాడలో తిరుగుతాయని అభిప్రాయపడ్డారు. దాంతో ఈ గ్రహ పటకాన్ని (*Planetary belt*) పన్నెండు విభాగములు చేసి, ఒక్కొక్క విభాగమునకు దాని దగ్గరనున్న నక్షత్రసముదాయపు పేరు పెట్టారు. వీరి ననుసరించిన గ్రీకు దేశీయులు ఈ పటకానే "రాశిచక్రము" (*Zodiac*) అని అన్నారు. పై పన్నెండు భాగాలని 'రాశిచక్రపు గుర్తులు' (*Signs of the zodiac*) అని అన్నారు. గ్రీకులు, సూర్యుడు ఈ ద్వాదశ గుర్తులు తిరిగివచ్చుటకు ఒక సంవత్సరం కాలం పడుతుందని—అచంచలమైన వేగంతో భ్రమణంచేస్తే ప్రతీ గుర్తుని సమాన కాలపరిమితిలో దాటగలడని విశదీకరించారు. కాని బాబిలోనియనులు

ఈ గ్రహములు ఎప్పుడూ ఒకటే వేగంతో భ్రమణం చేయవనియు, ఒక గుర్తుని దాటిన కాలానికి, మరొక గుర్తుని దాటిన కాలానికి తేడా వుంటుందని ప్రయోగాత్మకమైన ఉపపత్తి (*Experimental proof*) చూపించారు. ఈ విషయావిష్కరణమే 'గ్రహసిద్ధాంతాల'కి పునాది. అంతేకాకుండా బాబిలోనియనులు బ్రహ్మాండ చిత్రం (*Picture of the Universe*) ఏలాగుంటుందనే విషయంగూర్చి ఆలోచించి విశదీకరించారు. "భూమి, గుండ్రముగా నుండి మధ్యభాగము ఎత్తుగా పర్వతమువలె నుండి చుట్టూ సముద్రపుటుంగరముచే ఆవరింపబడిన ద్వీపము. ఈ సముద్రాన్ని చుట్టివున్న పర్వతశ్రేణి విశ్వానికి విధాత సృష్టించినగోడ. ఇదే నభోమండలాధారభూతమైన స్తంభము. గుల్లఅయిన నభోగోళంలో పూర్వ ద్వారం, పశ్చిమద్వారం అని రెండు ద్వారములున్నాయి. నభోమూర్తుల ఉదయాస్తమానములనగా, ఈ ద్వారములగుండా వాటి సంచారము. భూగర్భంలోను, ఆకాశంతర్భాగంలోనూ కూడ నీరుంది. ఊటల పూర్వకంగా భూగర్భంలోంచి, వర్షపూర్వకంగా నభఃస్థలినుండి, నీరు భూమ్యుపరితలాన్ని చేరుతుంద"ని.

జ్యోతిశ్శాస్త్రములో ఆనాడు బాబిలోనియనులకు సరిపోల్చ దగినవారు ఈజిప్టు దేశీయులు. కాని వీరి జ్యోతిశ్శాస్త్రాభిప్రాయములు అతి మోటు (*Crude*) రకమైనవి. అంటే నభోమండలాన్ని భూమిమీద నిల్చున్న ఆవుతోనో లేదా కాళ్ళు చేతులు భూమిమీద ఆని వంగున్న స్త్రీతోనో పోల్చేవారు. అంతేకాకుండా నభోమండలమంతా నీటి సముదాయమనిన్నీ, నభోమూర్తులు పడవలలో తిరుగుతారనిన్నీ, సూర్యుడు నభోమూర్తుల భగవంతుడనిన్నీ, రాత్రిసమయములందు సూర్యుడు భూమి అంతర్భాగంలో కలిసిపోయిన వారి స్థలములను పర్యటిస్తాడనిన్నీ అభిప్రాయపడేవారు.

## గ్రీకుల రాక

3,000 సంవత్సరముల క్రితం యూరపు మధ్య భాగంలో ఉద్భవించిన తెగ, ఇంకా చిన్న చిన్న తెగలుగా విడివడి, గ్రీసు, ఆసియా మైనరు పశ్చిమ తీరం, దక్షిణఇటలీ, సిసిలీ ప్రాంతాలకి వలసపోయారు. వీరిలో ప్రతీ తెగ ఒక్కొక్క చిన్నరాజ్యం స్థాపించుకుంది. వీరందరి భాషాసంప్రదాయం, మత సాంప్రదాయం ఒకటే అయినా క్రీ. పూ. 350 సంవత్సరము వరకు ఎల్లప్పుడూ వారిలో వారికి యుద్ధములు జరుగుతూండేవి. ఈ సంవత్సరంలోనే గ్రీసు, అలగ్జాండరు ప్రభువు పాలించిన 'మాసిడోనియా' సామ్రాజ్యంలో భాగంగా చెయ్యబడ్డది. అప్పటినుంచి గ్రీకుల నాగరికత వ్యాప్తి పొందింది. దాని ప్రభావము కొంతవరకు హిందూదేశముమీద కూడ లేకపోలేదు. ప్రస్తుత కథలో ప్రధానస్థానం గ్రీకులదే. నిజంగా చెప్పదల్చుకుంటే నక్షత్ర విజ్ఞాన శాస్త్రానికే కాకుండా, శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన ప్రతీ చింతన వీరితోనే ఆరంభించిందేమో! కోపర్నికస్ ఛేదించిన 'ఆకాశస్థిత పదార్థ విజ్ఞానపు' చిక్కు మొట్టమొదటగా విడదీయడానికి ప్రయత్నించినవారు ఈ గ్రీకులే.

ప్రస్తుత ప్రపంచపు నాగరికత పై గ్రీకు నాగరికత ప్రభావముండడానికి కారణం వారు ఆనాడు అన్ని విధముల హాయిగా ఉండడమే. వారికి ఎక్కువగా తీరిక కాలం దొరికేది. కాలం దొరికితే సరిపోతుందా? అంతకన్న ముఖ్యమైనది విజ్ఞాన దృక్పథం, విజ్ఞానాన్వేషణ వారిలో పెంపొందాయి. వారు, ప్రపంచపు మిగతా భాగాలలోని ప్రజల నాగరికతను గూర్చి ఎప్పటికప్పుడు తెలుసుకుంటూండేవారు. అంతేకాకుండా గ్రీసుదేశంలో వారికి పూర్వం నివసించిన తెగయొక్క సంస్కృతి, నాగరికత వారి కబ్బింది. బహుశః ఈ పూర్వీకులవల్లే గ్రీకులకు శిల్పాభిరుచి కూడా పంపొందిందేమో! వీటన్నిటికంటె ముఖ్యాతిముఖ్యమైన విషయం,—వీరే స్వయంగా రాజ్యస్థాపకులవడంచేత ఎవరి భావములు వారు నిర్భయంగా, నిరాటంకంగా ప్రజాబాహుళ్యంముందు బయలుపర్చడానికి స్వాతంత్ర్యం ఉండేది. అది మంచిదైనా, చెడ్డదైనా దాన్ని హేతువాద పూర్వకంగా (*reasoning*) విమర్శించే శక్తి వారికుంది. ఈ విషయాన్ని క్రీ. పూ. 300 సంవత్సరములో నున్న 'యూక్లిడ్' క్షేత్రగణిత సిద్ధాంతంలో (*Geometry*) మనం విరివిగా చూస్తాము. ఈ సందర్భంలో మనకు జరిగిన గొప్ప ఉపకారం-ఆనాడు మతం అంత విరివిగా, వ్యాప్తి చెందలేదు. దాని దారి దానిది కాని ఇతర విషయాల్లో జోక్యం కలుగజేసుకునేది కాదు. ఆనాడు మతానికి జోక్యం ఏర్పడితే ఎందరు విజ్ఞానులు హింసింపబడి ఉందురో! విజ్ఞానం గతి ఏమయ్యేదో!

ఈ విధమైన హేతువాదం రసాయనిక, భౌతిక శాస్త్రాలలో పనికిరాలేదు. కారణం వాదం ఎక్కడ మొదలుపెట్టాలో తెలియకపోవడంచేత. వీటికి కావలసింది ప్రయోగం చేయడం (*Experimentation*),

వాటి ఫలితాలను కూర్చి వాటి అన్యోన్య సంబంధం (*Correlation*) గుర్తించి సిద్ధాంతం చేయడం. వీరు, ఎంత ప్రతిభాశాలురైనా, ఈ విషయంలో మాత్రం పాపం సిద్ధహస్తులు కాలేకపోయారు.

### విజ్ఞానారంభం

మొట్టమొదటగా విజ్ఞానానికి పునాదులు వేసిన వారు గ్రీకు శిల్పులు, గ్రీకు పనివారు. నైలు నదీతీర ప్రాంతాలను కొలిచే ప్రయత్నంలో ఈజిప్షియన్ సర్వేయర్ వినియోగించిన కొలతబద్దలు, కొలిచే విధానం, గ్రీకుల క్షేత్రగణిత సిద్ధాంతానికి మాతృకలు. గ్రీకు విజ్ఞానాన్వేషణ స్వలాభాపేక్ష లేనిది. కోపర్నికస్ విజ్ఞానాన్వేషణ ఈ జాతికి చెందింది. ప్రపంచం ఎలా నడుస్తున్నదనే విషయం తెలుసుకుందామనే కుతూహలమే కోపర్నికస్ ముప్పది సంవత్సరముల పరిశోధనకు దారితీసింది. ఆనాడు తక్కువ తరగతికి (*Low class*) చెందిన గ్రీకులలో, ఈనాటి రసాయనికశాస్త్రానికి సంబంధించిన పనిశ్రమలున్నా వాటిని ఒక శాస్త్రంగా పెంపొందించలేకపోయారు. ఏది ఏలాగున్నా ఈ మూడు వందల ఏళ్ళ తరబడిగా పెంపొందుతూ వచ్చిన ఈ మహావిజ్ఞానానికి మూలము ఆనాటి గ్రీకు పనిమనుషుల మోటు (*Crude*) విజ్ఞానం. అందుచేతనే ఈనాటి విజ్ఞాని తానార్జించిన జ్ఞానాన్ని ఈనాటి పనిమనుషుల (*Manufacturers*) చేతిలో పెట్టి ఋణవిముక్తుడవుతున్నాడు. ఆధునిక పరిశ్రమలకు, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి మొదలు, సెల్యులాయిడ్ ఏళ్ళ తయారీవరకు కావలసింది విజ్ఞానజ్ఞానమే. (*Scientific knowledge*)

### పైథాగరస్

పూర్వకాలం ప్రపంచ సృష్టిని గురించి అనేక కట్టుకథలు చెప్తూండేవారు. ఈనాడుకూడా అలాంటి మనుషులు లేకపోలేదు. కాని ఆనాడు గ్రీకులు కొందరు దీనినిగురించి ఆలోచించకపోలేదు. "ఈ ప్రపంచసృష్టికి భగవంతుడు కారణమై ఉండడు. ఏవో కొన్ని క్రమమైన పద్ధతులవలన సృష్టింపబడివుండవచ్చును" అనే ఈపుక్కిటిపురాణకథలను త్రోసిపుచ్చి విషయాన్వేషణ సాగించారు. ఈకాలానికి చెందినవాడు 'పైథాగరస్' క్రీ. పూ. 16వ శతాబ్దంలో 'సామాస్' ద్వీపంలో జన్మించాడని, ఈజిప్టులో చదువు సాగించి, యూరపంతా పర్యటించి, దక్షిణ ఇటలీలోని 'క్రోటోనా'లో స్థిరనివాస మేర్పరుచుకొన్నాడని ఇప్పటికి మనకు దొరికినాధారములను పరిశీలించి నిర్ణయింపబడినది. ఈయన తన జ్ఞానాన్ని ఎక్కడా వ్రాసి అట్టే పెట్టలేదు. అది ఎవరికి తెలియకూడదనే స్వభావముకల మనిషి. మొత్తంమీద కొందరి విద్యార్థులను చేరదీసి కొంతచెప్పి మన కుపకారం చేశాడు. "ఒక లాగబడిన తీగమీద దెబ్బ కొట్టినప్పుడుద్భవించే శబ్దం, కంపనానికి విడిచిపెట్టబడిన తీగ పొడవుమీద ఆధారపడి వుంటున్న"దనేలాంటి భౌతిక శాస్త్ర పరిశోధనలుకూడ ఈయన చేశాడు. దీన్ని పరిశీలించి, సృష్టికి కారణభూతమైంది నీరని కొందరు, గాలిఅని కొందరు, అగ్ని అని మరికొందరు తగవులాడుకొంటూన్న రోజులలో ప్రతీ వస్తువుసృష్టికి ఆధారభూతమైనవి అంకెలని అన్నాడు. ఇటువంటి ఈయన అభిప్రాయాలు జ్యోతిశ్శాస్త్ర పురోగమనానికి కొంత తోడ్పడ్డాయి. పైథాగరస్ సూర్యచంద్రాదుల గమనాన్ని గురించికూడ చెప్పాడు.

"సూర్యుడు ఆకాశంనుండా 'కఖగఘ' వర్తులాకారపు మార్గంలో, ఒకే వేగంతో తిరగడానికి ఒక సంవత్సరం పడుతుంది. అప్పుడే ఆకాశ గోళం ఒకరోజులో 'చ, ఖ, భ, ఘ' వర్తులమార్గంలో సూర్యుడు,




సూర్యభ్రమణం (పైథాగరస్)




విశ్వపటము (ఫిలోలాస్)

సూర్యుడు భ్రమణం చేసే త్రోవతో సహా తిరుగుతుంది. ఇదే సూర్యోదయ సూర్యాస్తమానములకు, సంవత్సరములో ఆ కాలముల తేడాకు కారణం" అని. ఇదే విధంగా చంద్రగమనంకూడా విశదీకరించేడు. మిగతా గ్రహముల గమనాన్ని గూర్చి ఈయన చెప్పిన ఒకే ఒక విషయం ఏమిటంటే, ఈ గ్రహాలన్నీ కూడ వాటి వాటి ప్రయాణాలు వర్తులమార్గంలోనే ఒకదానికొకటి సంబంధం లేకుండా సాగిస్తాయిఅని. దీన్నే పైథాగరస్ మరణానంతరం 'ఫిలోలాస్' అభివృద్ధిచేసి విశ్వపు ముక్కటి ప్రజాబాహుళ్యానికి అందించాడు. పైదానిలో 1—ఒక గ్రహము; 2—సూర్యుడు; 3—చంద్రుడు; 4—భూమి; 5—ప్రతిభూమి (*Counter Earth*); 6—కేంద్రాగ్ని జ్వాల.

ఈ కేంద్రాగ్ని జ్వాలనే కొందరు శాస్త్రజ్ఞులు సూర్యుడని, అందుచేత 'ఫిలోలాసే' కోపర్నికస్ విశదీకరించిన విశ్వసృష్టి వైపరీత్యాన్ని, 2000 సంవత్సరములకు పూర్వమే చెప్పాడని ఫిలోలాస్ రవి కేంద్రీభూతమైన ప్రపంచావిష్కరణకు మొట్ట మొదటివాడని అంటున్నారు. ఫిలోలాస్ ఈ ఆఖరు విషయం చెప్పలేదు. భూమి మిగతా గ్రహములతో కలసి ప్రపంచ మధ్యభాగము—దీన్నే మనం విశ్వకేంద్ర మందాము—చుట్టూ తిరుగుతున్నదని చెప్పిన వాళ్ళలో మొట్టమొదటివాడయితే అయివుండవచ్చునని పాఠకులు గమనించవలెను.

## తత్త్వజ్ఞులు - గ్రీకు జ్యోతిశ్శాస్త్రము

విశ్వాన్వేషణ మొట్టమొదటగా ప్రారంభించినవారు గ్రీకులని ఇదివరకు తెలుసుకున్నాం. అంతటితో ఊరుకోక వీరిలో కొందరు తమ దృష్టిని, ప్రజలు, ప్రజావికాసం, ప్రజాప్రవర్తన మొదలగు విషయాలపైని మరల్చారు. గ్రీకులలో ఈవిధమైన కుతూహలోద్భవానికి కారణభూతుడైనవాడు "సోక్రటీస్" (*Socrates*). ఈయన క్రీ. పూ. 5 వ శతాబ్దంలో 'ఏథెన్స్'లో నివసిస్తూండేవాడు. ఈయన ప్రారంభించిన సంచలనాన్ని, ఈయన తరువాత ఈయన సమకాలిక శిష్యుడైన 'ప్లేటో' (*Plato*) కొంతవరకు విస్తరింపజేశాడు. "మానవునికి కావలసింది కొన్ని విషయాల జ్ఞానమే కాదు, ఆ విషయాలలో మంచిచెడ్డలు నిర్ణయించగలిగే శక్తికూడా కావాలి." అని ఈయన అభిప్రాయము. దీన్నే "జ్ఞానము లేక బుద్ధి" (*Wisdom*) అన్నాడు. భగవంతు డొక్కడే బుద్ధిగలవాడు. మానవులు ఈ బుద్ధిని ప్రేమించి గలిగినవారుగా ఉండడానికి సాధ్య పడుతుంది. వీరే 'తత్త్వజ్ఞులు' (*Philosophers*). ఈ జ్ఞానాన్వేషణనే మనం తత్త్వశాస్త్రం (*Philosophy*) అని అంటాము. 'పైథాగరస్' కూడ ఒక తత్త్వజ్ఞుడే. 'ప్లేటో' ప్రభావము నభోమూర్తుల విజ్ఞానాన్వేషణకి అనుకూల పరిస్థితు లేర్పడడానికి బదులు, ప్రయోగాత్మకమైన పరిశోధన మార్గానికే స్వస్తి చెప్పింది. తరువాత 2000 సంవత్సరముల వరకు ఇటువంటి కృషి జరగడానికి వీల్లేకపోయింది. గ్రహగతులు, విశ్వనైఖరిని గురించి పైథాగరస్ విశదీకరణకు, ప్లేటో విశదీకరణకు ఏమీ తేడా లేదనే చెప్పవచ్చును.

ప్లేటో తరువాత ఆయన శిష్యుడు 'అరిస్టాటిల్' (*Aristotle*) కార్యరంగంలో ప్రవేశించాడు. అలగ్జాండర్ ప్రభువు పాలించిన 'మాసిడోనియా' నగరంలో ఈయన క్రీ. పూ. 384 నుంచి 322 వరకు జీవించియున్నాడు. ఈయన ప్రభావము సోకని ప్రకృతి శాస్త్రమున్నదిలేదు. కోపర్నికస్ సిద్ధాంతాలు చాలా కాలం వరకు వ్యాప్తిచెందకుండా అడ్డు తగిలిన భావాల వెన్నెముకే ఈయన సిద్ధాంతం. అరిస్టాటిల్ చనిపోయే కాలానికి గ్రీకు విజ్ఞానశాస్త్రపు ప్రభావము (*Greek Scientific Activity*) అలగ్జాండరు ప్రభువుచే నిర్మించబడిన, మధ్యధరా సముద్రతీర ప్రాంతమందలి ఈజిప్టు దేశంలోని అలగ్జాండ్రియా మహాపట్టణానికి వలసపోయింది. గ్రీకుల ఆకాశస్థపదార్థ విజ్ఞానపురోగమనం చాలభాగం ఈ కాలానికి చెందినదే.

ఈ సందర్భంలో మన భారత జ్యోతిశ్శాస్త్రజ్ఞులకూడ భూమినిగురించి చెప్పలేకపోలేదు. ఆ అభిప్రాయాలలో విజ్ఞానమునిపంచుకొనే తీరు (*attitude*) తక్కువ. కాని వేదకాలంనాటి మన జ్యోతిశ్శాస్త్రం మాత్రం చాల సరియైనదని గ్రహించాలి. క్రీ. పూ. 6 వ శతాబ్దివాసియైన గ్రీకుతత్త్వజ్ఞుడు 'థేల్సు' (*Thales*) కూడ ఈ విషయం కొంతవరకు చెప్పాడు. ఈ అభిప్రాయాలన్నీ ఎలాగున్నా ఆనాడు అతనిని బాధించిన విషయం, గోచరమైన ఈ గ్రహగతులను (*Observed motions of the planets*) ఎలాగ వివరణ చేయడమనేదే. ఇదే గ్రహసిద్ధాంతానికి (*Planetary theory*) ప్రాతిపదిక. ఆనాడు ఆయన మొట్టమొదటగా స్పష్టీకరించిన గ్రహసిద్ధాంతం సులువైనది; సులభగ్రాహ్యము. కాని ఈ సిద్ధాంతం సూర్యగమనాన్ని విశదీకరించినా, చంద్రుడు ఇతర పంచగ్రహగమనాన్ని స్పష్టీకరించలేకపోతూంది. తరువాత గ్రీకు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు, ఈ గ్రహ

సిద్ధాంతాన్ని మార్చారు. భ్రమణం చేస్తున్న గ్రహం, భూమిమీదున్న ప్రేక్షకునికి 'ఖ' దగ్గరున్నపుడు కంటె, 'క' దగ్గరున్నపుడు దగ్గరగాను, అతి వేగంగాను భ్రమణం చేస్తున్నట్టు కనపడుతుంది. దీన్నే 'ఎక్సెంట్రిక్' పద్ధతంటారు. గ్రీకు శాస్త్రజ్ఞులు గ్రహగమనాన్ని ఇంకోవిధంగా కూడ భావించారు.




సులభగ్రాహ్యమగు గ్రహసిద్ధాంతము




ఎక్సెంట్రిక్

“గ్రహం ఒక చిన్న వర్తులాకారపు (*Epicycle*) బాటలో తిరుగుతుండగా, ఈ బాట కేంద్రం, భూమిని కేంద్రంగా చేసుకొని పెద్ద వర్తులాకారపు (*Deferent*) బాటని చుట్టుతుంది”ని వీరి అభిప్రాయం.

ఈ విశదమైన అన్వేషణ రవికేంద్రస్థమైన ప్రపంచానికి దారితీసింది. ఈ విషయంలో క్రీ. పూ. 4 వ శతాబ్దానికి చెందిన 'హెరాక్లైడ్స్' అనే గ్రీకు తత్వజ్ఞుడు కొంత పనిచేశాడు. తరువాత పైథాగరస్ జన్మస్థానమి అయిన 'సామోస్' ద్వీపానికి చెందిన “అరిస్టార్కస్” క్రీ. పూ. 3 వ శతాబ్దంలో సూర్యకేంద్రీకృతమైన ప్రపంచాన్ని గురించి కొన్ని సిద్ధాంతాలు చేసి, తరువాతి సంవత్సరములలో “పూర్వకాలపు కోపర్నికస్” (“*Copernicus of Antiquity*”) అనే బిరుదాన్ని సంపాదించుకొన్నాడు. అరిస్టార్కస్ దీనిలో ఇంకా ఎక్కువ కృషి చేసియుండలేదు. ఇప్పటికే భూమ్యస్థిత ప్రపంచం ప్రజాభిరుచిని కోల్పోయినా, తరువాత 1800 సంవత్సరములకు




వర్తులాకార గతిభేదము

కాని ఆధునిక శాస్త్రాంగీకరణను పొందిన కోపర్నికస్ సిద్ధాంతం వినబడలేదు. ఈ మధ్యకాలంలో గ్రీకు తత్వజ్ఞులైన “హిప్పార్కస్” (క్రీ. పూ. 2 వ శతాబ్దం) “టాలమీ” (క్రీ. శ. 2 వ శతాబ్దం) భూమ్యస్థిత ప్రపంచ స్పష్టీకరణకే ప్రయత్నించారు. అందులోనే పరిశోధనలు సల్పారు.

## మధ్య శతాబ్దములు

టాలమీ నివసిస్తూన్న అలగ్జాండ్రియా నగరం ఆయన కాలంలో రోమను మహాసామ్రాజ్యంలోని భాగం. క్రీస్తుమత ముప్పవించి ప్రజ్వరిల్లుతూన్న రోజులవి. నాల్గవ శతాబ్దారంభానికి రోమను సామ్రాజ్యమంతా క్రైస్తవమత భూయిష్ఠమైనది. రసూరమి ఈ శతాబ్దపు చివరి రోజులలో రోమను సామ్రాజ్యం క్షీణదశను ప్రాప్తించింది. దాంతో జర్మనులు సామ్రాజ్యసౌధపు గృహ ప్రవేశం చేసి, స్థిరవాసము ఏర్పర్చుకొని, రోమను నాగరికత ప్రభావం పొందసాగారు ప్రారంభించారు. అందుచేత ఈ కాలంలో నిర్మాణాత్మకమైన విజ్ఞానాన్వేషణేమీ జరగలేదు. ఇది ఇలాగనే క్రీ. శ. 400 నుంచి 1000 వరకు నిలిచింది. ఈ కాలాన్నే “చీకటి యుగము” (*Dark Ages*) అన్నారు.

ఇది ఇలాగుండగా క్రీ. శ. 7 వ శతాబ్దంలో అరేబియాలో (అరబ్బు దేశంలో) మహమ్మదీయ మతావిర్భావం జరిగింది. మతం పేరిట యుద్ధాల పూర్వకంగా సామ్రాజ్యవ్యాప్తి జేశారు అరేబియనులు. ఇది తూర్పున హిందూదేశంవరకు పశ్చిమాన్ని ఈజిప్టు, ఇప్పుడు స్పెయినబడు అప్పటి ఉత్తరాఫ్రికావరకు జరిగింది. వీరు ఆనాటి గొప్పరచనలయిన టాలమీ, అరిస్టాటిలుల రచనలను భాషాంతరీకరణం కావించి

భద్రపరిచారు. ఏలాగైతేనేం 12వ శతాబ్దంలోని క్రైస్తవ పండితులు వీటిని సంగ్రహించారు. ఇప్పుడివి మతాధికారుల చేతులలో పడ్డాయి. తర్కశాస్త్రంలో అరిస్టాటిల్ గొప్పవాడు. ఆయన తర్కం ఆనాటి ప్రజాభిరుచిని పొందించింది. ఇంత ధీశాలి అయిన అరిస్టాటిల్ ప్రకృతి విజ్ఞానపరిశోధనలు ఆనాటి ప్రజలకు సందేహాన్ని కల్గించలేదు. ఇదే జరిగిన పెద్ద ప్రమాదం. అరిస్టాటిల్ ప్రకృతిశాస్త్రపరిశోధనలు సత్యదూరములన్న విషయం ఈనాటి పాఠకులకు విదితమే. ఇదే విజ్ఞానశాస్త్ర పురోగమనంమీద (*Scientific Advancement*) మతప్రభావం పడడానికి ఆరంభం. ఇది క్రీ. శ. 16వ శతాబ్దంనాటి పరిస్థితి. ఈ పరిస్థితి రవి కేంద్రీభూతమైన ప్రపంచాన్ని ఎదుటపెట్టిన కోపర్నికస్, వాని అనుచరులు ఆనాటి మతాధికారులలో తలవుపడడానికి కారణము.

## కోపర్నికస్ యుగము

అర్థంకాని మార్పులలో కూరుకున్న, క్రైస్తవ మత సాంప్రదాయాలు రాజ్యం చేస్తున్న రోజులలోని విజ్ఞాని కోపర్నికస్. అలాంటప్పుడు మహాశక్తుల ప్రభావం ఆయన జీవితంమీద ఆయన విజ్ఞాన సిద్ధాంతాలమీద పడినదనడంలో ఆశ్చర్యమేముంది?

ఆ కాలంలో యూరప్, చదరంగంబల్లమీద గళ్ళలాగ చిన్నచిన్న భాగాలుగా చీలి ఉండేది. ఒక్కొక్క భాగం ఒక్కొక్క ధనవంతుని అధీనమందుంటూండేది. ఆనాటి రైతులు ఇతర స్థానములకు పోయి వర్తక వ్యాపారములు చేసుకొనే అభిలాష కలవారు. కాని వీరిని ధనవంతులు విడిచిపెట్టేవారు కారు. ఈ ధనవంతులు, సంపదార్జనకోసమై ప్రక్కనున్న భాగాలను కబళించే ప్రయత్నంలో యుద్ధాలుద్భవించేవి. అది సామ్రాజ్యస్థాపనకు, చక్రవర్తుల ప్రతిష్ఠకు దారి తీసింది.

ఇది ఇలాగుండగా మతాధికారులలో కూడా పంపకాలు జరిగి ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క మత కేంద్రం స్థాపింపబడింది. రాజు మతాధికారుల చేతులలో కీలుబొమ్మ. అంచేత సామ్రాజ్యపరిపాలన మతాధికారి చేతిలోనే ఉండేది. దాంతో మతం పేరిట మతాధికారి ప్రజల దగ్గరనుంచి ఏవో విధంగా-పాప క్షమాపణార్థంలాంటిది — డబ్బు గుంజి తానొక చిన్న రాష్ట్రాధిపతి కాగల్గేవాడు.

ఈ రాజకీయ కల్లోల పరిస్థితులలో, గ్రీకు ధీశాలుర కునికిపట్టయిన "కాన్‌స్టాంటునోపిలు"ను టర్కులు ముట్టడిస్తారని తెలియగానే, వీరు 1453 సంవత్సరంలో (కోపర్నికస్ ఉద్భవానికి 20 ఏళ్లకు పూర్వము) ఇటలీకి వలసపోయారు. అచిరంగా ఇటలీ క్రొత్త విజ్ఞానానికి కేంద్రమైంది. అటుపిమ్మట కొలంబస్ అమెరికా ఆవిష్కరణ కాలానికి కోపర్నికస్ వయస్సు 19 సంవత్సరములు. ఈ కాలంలోనే అచ్చు యంత్రం నిర్మాణం జరిగింది. దీంతో జ్యోతిశ్శాస్త్రవిజ్ఞానంలోనే కాక యావత్ విజ్ఞాన ప్రపంచంలోనూ నూతన శకారంభం జరిగింది. విజ్ఞానాన్వేషణ త్వరితంగా పురోగమించింది.

## కోపర్నికస్ జీవిత చరిత్ర

### పూర్వవంశము - జననము

ఏదైనా ఒక నూతనమైన సంచలనం జరిగేసరికి, దీనికి కారణం ఏమిటా అని మొట్టమొదటగా ప్రతీ మానవుడు ప్రశ్నించుకుంటాడు. శాస్త్రదృష్ట్యా కాని కళాదృష్ట్యా కాని, ఈ నూతన సంచలనకారులు —ఒక "కోపర్నికస్" లేదా ఒక "షేక్స్‌పియర్" లేదా "మెనూహిన్"వంటి—మహామేధావులయితే ఆ సంచలన స్పష్టీకరణ (*Explanation*) కోసం మనం ప్రయత్నించడం న్యాయ్యం. కనక కోపర్నికస్ జీవితచరిత్రనుగురించి తెలుసుకోనేముందు కొంచెం ఈయన పూర్వులనుగురించి తెలుసుకోడం కొంత సహాయకారి కాగలదు. గ్రంథవిస్తరభీతిచే ఆ విషయాలన్నీ ఇక్కడ వ్రాయడంలేదు. ఈయన కుటుంబాన్నిగురించి రెండు ముక్కలు వ్రాస్తాను. మన కోపర్నికస్ తండ్రి నికోలస్ కోపర్నిగ్ (*Nicholas Koppernigk*) ఒక గొప్ప ధనికుడును వర్తకుడు. ఈయన 1458 సంవత్సర ప్రాంతంవరకు క్రకో (*Cracow*) పట్టణంలో వర్తక వ్యాపారములు చేస్తూ తరువాత 'థోరన్' పట్టణానికి మార్పు చెంది స్థిర నివాస మేర్పర్చుకొన్నాడు. ఇచ్చటే ఈయన 1483 లో కాలధర్మం చెందాడు. కోపర్నికస్ తల్లి 'వాక్జెన్రోడ్స్' కుటుంబానికి చెందిన ధనవంతుల కుమార్తె 'బార్బరా వాక్జెన్రోడ్'. (*Barbara Waczenrode*) ఈ దంపతులకు—ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమారులు. వీరందరిలో చిన్నవాడు మన జ్యోతిశ్శాస్త్రజ్ఞుడైన కోపర్నికస్.

### బాల్యము - విద్యాభ్యాసము

చిన్నతనమందే తండ్రిని పోగొట్టుకొన్న ఈ నల్గురి బిడ్డల పోషణ, వారి మంచి చెడ్డల గమనిక,

మేనమామయిన 'లూకా వాక్జ్రోడ్' పైన బడింది. కోపర్నికస్ జీవితనాకాగమనంలో ఈయన ప్రభావం ఎంతైనా ఉంది. "సూర్య చంద్రగ్రహ నక్షత్రము లన్నియు, తూర్పునుదయించి పశ్చిమమునన స్తమించు నటుల స్థూలదృష్టికి గోచరముచున్న దికనుక, ఈనభో మూర్తులన్నియు భూమిని కేంద్రముగా జేసికొని భూమిచుట్టూ భ్రమణము చేయుచున్నవి. అంచేత ఈ మహావిశ్వమునకు భూమి యే కేంద్రమనెడి" భూమా ధ్యస్థ్య సిద్ధాంతమును అప్పటికే 'టోలమీ' ప్రభృతులు చేసియున్నారని పాఠకులకు విదితమే. ఆ విషయము లే మన కోపర్నికస్ క్రాకో విశ్వవిద్యాలయములో విద్యార్థిగా నభ్యసించెను. తరువాత ఇతను ఇటలీ దేశములోని రోము, బెలోనా, పాడువా (*Padua*) విశ్వవిద్యాలయములలో విద్య నభ్యసించెను. గణిత శాస్త్రమందు త్తమపరీక్షలిచ్చుటయేకాక, మత హితైక జీవనతత్పరుడై 'కేనన్ లా'(*Canan Law*) (క్రైస్తవ మత న్యాయశాస్త్రము) కూడా అభ్యసించాడు.

## ఉద్యోగ ప్రాప్తి - బహుముఖ కార్యదీక్ష

దీని ఫలితముగా 'ఫ్రానబర్గ' లోని 'కెథడ్రల్'లో కేననీ ఉద్యోగము చేశాన్నాడు. ఇక్కడ కేననీగా ఉంటున్నప్పుడే సూర్యుని మధ్యాహ్నపు టెత్తును కనుగొన్నాడు. మనం ఇక్కడ ఒక విషయం గమనించాలి. తానుపయోగించెడి పనిముట్ల విశిష్టత, వాని సున్నితత్వము (*Sensitiveness*), తానుపయోగించుచున్న పద్ధతుల నిశిత త్త్వము మొదలగు విషయములనుగురించి తనకు పూర్వం 1,000 సంవత్సరను క్రితం గ్రీకు జ్యోతిశ్శాస్త్రజ్ఞు లుపయోగించిన పనిముట్ల పద్ధతులకంటె అతిమోటైనవి (*Crude*) అన్న విషయం కోపర్నికస్‌కు తెలుసును. అంచేతే ఒకసారి 'రెటికస్' (*Rheticus*) అన్న పేరు గల స్నేహితునితో కోపర్నికస్ "ఒక కోణాన్ని పది నిమిషాలు ఇటు అటు దగ్గరలో సరిగ్గా కొలవగలిగితే, పైథాగరస్ లంబకోణ త్రిభుజంలోని భుజముల అవినాభావసంబంధాన్ని సిద్ధాంతీకరించినప్పుడు పొందిన ఆనందం పొందుతాను" అన్నాడట!

'క చ భ జ'—లోహ చదరపు పలక లేదా రాతి చదరపు పలక; 'క' ని కేంద్రముగా జేసుకొని 'క చ' వ్యాసార్థముతో గీసిన 'చ జ' పావు వృత్తపు కోణమానిని; 'క ఘ' పలకకు లంబముగా అమర్చబడిఉకడ్డీ. సూర్యుడు దక్షిణాపథంగా గమనంచేస్తే 'క ఘ' నీడకోణమానిని పైబడి ఖ క గ కోణం నిర్మిస్తుంది ఇది సూర్యుని మధ్యాహ్నపుటెత్తు.




మొదటి విధము

'చ జ', 'చ ఫ' అనునవి సమానము పొడవు కల్గిన కర్రలు. ఇవి 'చ' దగ్గర అతకబడినవి. 'జ ఫ' అనునది ఒక పెద్దకర్ర. ఇది 'చ జ' కు 'జ' దగ్గర అతకబడినది. 'క' అనునది ప్రేక్షకుని నెత్తిపైన, నిట్ట నిలువుగా ఆకాశములోని బిందువు.

ప చ జ కోణము = ప చ క కోణము. స చ భ = $90^0$ – క చ స కోణము. దీని నుపయోగించి సూర్యు నెత్తే కాకుండా, ఆకాశస్థ పదార్థపు టెత్తు దేనిదైనను కనుగొనవచ్చును. ఈ యంత్రమే కోపర్నికస్ చని పోయిన 40 సంవత్సరములవరకు అచ్చట నుంచబడ్డది. తరువాత 1584 లో డేనిష్ జ్యోతిశ్శాస్త్రజ్ఞుడైన 'టైకో బ్రాహీ' (*Tycho Brahe*) కి బహుమతిగా ఇవ్వబడింది.




రెండవ విధము

అనంతర మితడు విద్వాంసుడుగా, వైద్యశాస్త్ర ప్రవీణుడుగా, న్యాయపరిపాలకుడుగా, సంస్కారిగా అఖండమైన యశస్సార్జించి గౌరవప్రదమైన జీవనము చేస్తూండేవాడు. ఈయన ఆర్థికశాస్త్రంలో కూడ పండితుడే. ఒకప్పుడు దేశములో జరిగిన నాణెముల చర్చలో ప్రభుత్వ మీయనయభిప్రాయము నపేక్షించిఆహ్వానమంపి రావించింది. ఈయన జీవితములో రాజకీయసంపర్క మప్పు డొక్కటే. తరువాత మరెప్పుడూ కలిగించుకోలేదు.

తరువాత మరొకప్పుడు అంటే 1514 సంవత్సరములో పాశ్చాత్య పంచాంగసవరణార్థం ఏర్పర్చబడిన సభవారు ఈయనకు ఆహ్వానమంపగా "సూర్య చంద్రాది గ్రహముల గమనాన్ని గురించి తెలుసుకొనేంతవరకు పంచాంగ సవరణ సాధ్యపడదు. అది తెలుసుకొందుకే ప్రయత్నిస్తున్నాను." అంటూ ఆహ్వానాన్ని త్రోసిపుచ్చాడు. తరువాత 40 ఏళ్లకు ఈయన పంచాంగ సవరణార్థం ప్రచురించిన గ్రంథాన్ననుసరించి 1582 సంవత్సరంలో 13 వ పోపు 'గ్రిగరీ' పంచాంగ సవరణ చేశాడు.

## గ్రహవేధ

కోపర్నికస్, సూక్ష్మపరిశీలనలో కంటె యోచనాయత్తచిత్తుడై సునిశితమైన ప్రజ్ఞ కలవాడు. వివిధ గ్రహగతులనుగూర్చి పరిశోధనలు సల్పి లెక్కలుతయారుచేసి ప్రకటించేవాడు. "సూర్య చంద్రాది గ్రహములు భూమిచుట్టూ వర్తులాకారపు బాటలలో తిరుగుచుండునవియూ, ఆయా గ్రహములకు వక్రగతులు, ఋజుగతులు కలవనియు, ఈ వక్రగతులకు కారణము పెద్ద వలయములేకాక చిన్న చిన్న వలయములు గ్రహములు నిర్మించుకుండెననియు" టోలమీ ప్రభృతులు చేసిన సిద్ధాంతము ఈయనకు నచ్చలేదు. ఈ గ్రహములన్నియూ చక్కగా తూర్పు నుదయించి పశ్చిమాన అస్తమించడానికి కారణం భూగమనమే నన్నాడు కోపర్నికస్. "ఒక బండిలోని మనిషి కదులుతున్న బండి కదలిక తెలియకయుంటే ఎదురుమార్గంలో ప్రయాణం చేస్తున్నట్టుగ గోచరిస్తున్న ప్రక్కనున్న వస్తుసముదాయపు (వృక్షములు మొదలగునవి) కదలికననుసరించి తెలుసుకుంటాడో అలాగే భూగమనాన్ని గురించికూడ తెలుసుకోవచ్చు"నన్నాడు కోపర్నికస్. అంటే కనబడుతూన్న సూర్యగమనానికి (*Apparent Motion of the sun*) ఎదురుమార్గంలో భూమి తిరుగుతూన్నదన్నమాట ఇంకా విపులీకరిస్తే భూమి పశ్చిమంనుంచి తూర్పుకు తిరగబట్టే సూర్య చంద్రాది గ్రహములు తూర్పునుదయించి పశ్చిమాన అస్తమిస్తూన్నట్టుగా కనబడుతుందన్నమాట. ఈవిధమైన పరిశోధనల పంటే కోపర్నికస్ విశ్వవిశదీకరణ. అట్లు చేయడమేకాకుండా టోలమీ ప్రభృతుల సిద్ధాంతం తప్పని అంతకు పూర్వము అక్రమముగ కాలగర్భములో కప్పబడిన 'అరిస్టార్కస్' మొదలగు ప్రాచీన గ్రీకు శాస్త్రవేత్త లభిప్రాయములతో తన సిద్ధాంతమేకీభవించుచున్నదని స్థిరపర్చుకొన్నాడు.




కోపర్నికస్‌కు పూర్వము




కోపర్నికస్ సిద్ధాంతాన్ననుసరించి

ఈ పరిశోధనల ఫలితాలన్నీ క్రోడీకరించి 1530 సంవత్సరం నాటికి ఒక గొప్ప గ్రంథము వ్రాశాడు. ఇది 1534 సంవత్సరం ప్రాంతంలో ముద్రితమైంది. పక్షవాతవ్యాధితో బాధపడుచుండినను తన జీవితాశయమైన ఈ గ్రంథము ముద్రితమైందని విని, చూచి అతిసంతుష్టాంతరంగుడై 1543 వ సంవత్సరంలో స్వర్గస్థుడైనాడు.

కాని ఈయనసిద్ధాంతం ఆకాలంనాటి పండితాంగీకరణను సంపాదించలేకపోయింది. కారణం ఆనాడున్న అరిస్టాటిల్, టోలమీ ప్రభృతుల సిద్ధాంతాలప్రభావం. అంతకన్న ముఖ్యమైన కారణం ప్రజల స్థూలదృష్టికి గోచరమౌతున్న పరిస్థితులన్నిటిని వ్యతిరేకించింది కోపర్నికస్ సిద్ధాంతం. మాటకి (1) సూర్యచంద్రులు తిరుగుతూన్నట్టుగ కనబడితే కాదు భూమి తిరుగుతున్నదన్నాడు కోపర్నికస్. (2) భూమి కేంద్రమంటే సూర్యుడన్నాడు కోపర్నికస్. ఆకాలంలో కోపర్నికస్ వట్టి పిచ్చివాడు, అవివేకి, బుద్ధిలేనివాడు అని ఎవరికి తోచినట్టుగా వారు తిట్టడంకూడా లేకపోలేదు. 'లూథర్' *(Luther)* అనే ఆయన ఈయనగురించి ఇలా అన్నాడు. "సూర్యచంద్రులుకాదు భూమియే తిరుగుతున్నదని చెప్పదల్చుకున్నాడీ నూతన జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు. ఒకడు నడుస్తున్న బండిలోనో, ఓడలోనో కూర్చుని భూమి, చెట్లు తిరుగుతున్నాయి. తాను స్థిరంగా కదలకుండా మెదలకుండా ఉన్నాననుకొన్నట్లుంది. కాని ప్రస్తుత ప్రపంచపురీతి ఇదే. ఎవడైన ఒకడు తెలివిగలవాడు కావాలంటే ఏదోఒక స్వంతభిప్రాయం వెలిబుచ్చాలి. అదే అన్నిటికంటె మంచిది. ఎంచేత? అది అతని స్వంతభిప్రాయం కాబట్టి! లేకపోతే ఈ తెలివి తక్కువ వాడు జ్యోతిశ్శాస్త్రాన్నే తల్లక్రిందుగ చేయదల్చుకొన్నాడు! కాని పవిత్రమైనశాస్త్రంలో 'జోషువా' *(Joshua)* సూర్యుణ్ణాగమన్నాడేకాని, భూమిని కాదే!"

## ముగింపు

తరువాత వచ్చిన శాస్త్రజ్ఞులు—టైకో బ్రాహీ, గెలీలియో, కెప్లర్, న్యూటన్—పరిశోధనలు కోపర్నికస్ సిద్ధాంతాన్ని బలపర్చాయి. గెలీలియో కాలం నాటికి ప్రజాబాహుళ్యం ప్రాత క్రొత్త సిద్ధాంతాల వివాదంలో తటస్థత్వం *(Neutrality)* స్వీకరించారు. "నీకు బాగాఅర్థంకాని, దేన్నీ నిందించకు" అన్నది వారి దీక్షావాక్యమైంది. పోగా కెప్లరు మహాశయుడీతనిసిద్ధాంతాన్ననుసరించి గ్రహగతులనుకూర్చి సూత్రీకరించి మహత్తరమగు నీ సత్యమును ఋజువు చేశాడు. ఈసందర్భంలో రసాయనిక శాస్త్ర ప్రపంచంలో 'డాల్టన్' మహాశయుని అణుసిద్ధాంతానికి 'అవగాడ్రో' *(Avogadro)* మాలిక్యూలు సిద్ధాంత మెలాగో, జ్యోతిశ్శాస్త్ర ప్రపంచంలో కోపర్నికస్ సిద్ధాంతానికి కెప్లర్ సిద్ధాంతం అలాగైంది. ఈ విషయంలో కెప్లర్ అభినందనీయుడు.

ఎప్పటికైనా "సత్యమేవ జయతి నానృతమ్"



# వరద వెల్లువ



శ్రీ మొక్కపాటి
కృష్ణమూర్తి

కడలి తరంగమాలికల గానగ నైన నవోదయప్రభల్
దలపున బారి యేవియొ సుతారపు టూహాలు తేరివచ్చెడిన్;
గలిత నవీనకాంతి దులకాడిన శ్రావణి తీర్పుక్రొమ్మొయిల్
గలల విముగ్ధ వేణిపయి గ్రాలెదు నీ నవకేతకీద్యుతిన్ !

చలశబరీభరాలసలు, చంచల విద్యుదపాంగ వీక్షణల్
తలగి, తపః ప్రచండకరతాడిత గాత్రలు, మేఘ బాలికల్
గలిత నవప్రమోద పరిగీత హృదబ్జములం గరంబు మా
లలు పచరించి తెచ్చిరి ప్రఫలాస్యదుదగ్రతరంగ, గౌతమిన్ !

ఈ గోదావరి వారిపూరములు గావే యింతదాకన్ సుధల్
మాగానీలను రంగరించి, కవి సమ్మాన్యప్రభా రేఖలై,
భూ, గోత్రాతము మున్న శేష జనముల్ పొంపొంది దీపింపగా
నాగశ్రీ ఫణరమ్య వేణులయి, కంటన్ నేడు నుగ్లాయెగా !

పచ్చని పంటచేలె యిటు పాడరిపోయెను, వెచ్చ నిల్లులే
యుచ్చులుగా దగుల్వడియె, నూడ్చుకుపోయెను సర్వసంపదల్
పచ్చని కాపురా ల్వఱద పాలయి గ్రుగ్గినవస్న నింక ని
ష్పచ్చరమైన పామరుల బాములు నూహల కందివచ్చునే !

ఏటికోడల్, నురుంగులును, సీదరగాలులు, మబ్బు పిల్లలున్
మాటికి నా యెడంద నెదో మాధురి పెట్టెడు; నీదినమ్ము, ము
మ్మాటికి నీబడుంగు చిఱుమానిసి యంత్యపు వెల్తి జూపుటా
రాటము లీ మనోహర విరావములన్ సొగసే భజించునా ?

నీళుల పాయలు; నిసుకల
పాళుల చిఱు తరగ లొరయు పావంచములున్,
పసవల దూరపు తెరలును,
తెలి రెల్లుల పూలె బ్రదుకు ? తెరలు వఱదలో !

---

కథానిక :

# సంఘ సేవ!



శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న

## 1

రెండేళ్ల క్రితం. సరిగ్గా పండుగ రోజుల్లో నేను ఏదో పనిమీద భీమునిపట్నం వెళ్ళి, మా కామాక్షత్తయ్యగారింట్లో దిగాను. నిజానికి ఆవిడ నాకు మేనత్తా కాదు, ఏమీ కాదు. మా నాన్నగారూ ఆవిడ భర్తా ఒకే కంపెనీలో ఉద్యోగం చేసేవారు కలకత్తాలోను. కొన్నేళ్లపాటు ఒకేయింట్లో చెరోవాటా వేసుకుని ఉండేవాళ్లు. ఆ తరవాత ఆయన ఏదో వ్యాపారంలోకి దిగిపోయారు. అవి నాకు బొత్తిగా చిన్నతనపు రోజులు. వాళ్ల పిల్లలతో ఆడుకుంటూ ఉండేవాణ్ణి. అసలు పిల్లలంతా వాళ్లింట్లోనో, మాయింట్లోనో ఏకమొత్తంగా ఉండేవాళ్లం, కాని యెవరియింట్లో వాళ్ళు ఉండడం అనే అలవాటు ఎప్పుడూ లేదు. అదుగో, ఆ రోజులనుంచీ చనువు, నాకూ ఆ కుటుంబానికీన్నీ, ఆవిణ్ణి కామాక్షత్తయ్య అనీ, ఆమె భర్తని సుందరం మావయ్యనీ, కూతుర్ని "బాజీ" అని—బాబాలాగ వాడుకూనే ఉండేదిలెండి—పిలిచేవాణ్ణి. ఈ వరసలకి అర్థం పర్థం లేకపోయినా, నాటికీ నేటికీ పరస్పరంగా మా రెండు కుటుంబాలలోనూ ఆత్మీయతా అభిమానమూ మాత్రం అలా అంటిపెట్టుకుని ఉండిపోయాయి. ఇప్పుడు నేను బాగా పెరిగి పెద్దవాణ్ణయినా ఆ అనుభవం మాత్రం వదల లేదు. "బాజీ" యీ మధ్య నీళ్ళాడిందనీ, యింకా తల్లిదగ్గిరే ఉందనీ తెలిసింది. సరే, నలుసుర్నీ చూడవొచ్చును, పనీ చూసుకోవొచ్చును అనుకుని మా కామాక్షత్తయ్యగారింటికి వెళ్లాను, మరి.

ఇల్లు చేరుకునేసరికి భోజనాలవేళ అయింది. విస్తరిముందు కూచుంటూ ఉంటే కాకి అరిచింది.

"ఇంకెవరు మిగిలిపోయారమ్మా, అలా గొంతుక చించుకుంటున్నావ్? ఇప్పుడు గానీ యెవరయినా దిగడితే, మళ్లీ అత్తిసరు పెట్టాలి." పిల్లల తల్లిఅయినా బాజీబాజీయే! అంతలో "అమ్మమ్మా, పాపారావు తాతయ్య వొచ్చేడే" అంటూ మనవడు సావిట్లోంచి ప్రకటన చెయ్యనే చేసేడు. బాజీ ఏవిటో పట్టరాని ఉత్సాహంతో ముందు వాకిట్లోకి పరిగెత్తింది. 'ఎవరూ' అన్నట్టు, చేతులో పప్పుపిడచ బచ్చలకూర పులుసులో ముంచుతూనే, మొహం పైకెత్తిచూశాను.

"పాపారావుగారనీ—మనవాళ్లే—మీ మావయ్యగారూ ఆయనా కలిసి చదువుకున్నారుట. చిన్నప్పట్నుంచీ స్నేహితులు. అతనుకూడా పాపం, చాలా మంచివాడు, నెమ్మదయిన వాడున్నూ......పాపారావు బాబయ్య సంగతే అంటున్నానూ." ఈ చివరిమాట బాజీతో అంది కామాక్షత్త.

"అమ్మా, పాపారావు బాబయ్య బొత్తిగా చిక్కిపోయాడే యీమాటూ." అంది బాజీ.

"అట నప్పగా అంతేనే. అయినా, లోకంలో యిబ్బందులన్నీ తనవే అని నెత్తినవేసుకుంటాడు. పుణ్యంవే కాని—"

"మరేం. అసలు యిప్పుడెక్కడో బొత్తిగా పల్లెటూళ్లో ఉంటున్నాట్ట."

"మొదట్నుంచీ అతని ధోరణే అంత. మహా మెత్తని మనస్సు, పాపం. తనకికూడా చూసుకోకుండా బీదకీ బిక్కికీ అలా యిచ్చేస్తూ ఉంటాట్ట, చేతులో యేది ఉంటే అది. మళ్ళీ పైకి పిసరంత తొణకడు సుమా. అలాగ నిమ్మకి నీరెత్తినట్టుంటాడు, వెర్రిబాగుల వాడిలాగ."

"నాకు యిప్పట్లో జ్ఞాపకంవేలమ్మా. చిన్నప్పుడు యెన్ని పటాకీలు కట్టియిచ్చేవాడనీ! దీపావళి ఇంకా నెల్లాళ్ళుందనగా ఆరంభించి అది కట్టడం కాదు! పెద్ద అయింతరవాత పాఠాలూ అలాగే చెప్పేవాడమ్మా. అన్నయ్యా అనేవాడు కాదూ, కాలేజీ మేష్టర్లకంటె బాబయ్యే ఎంతో బాగా చెబుతాడనీ?...ఏవో వ్యాసాలూ అవీకూడా రాస్తూఉండే వాడుకదూటే?"

"అన్నీ చేతనవునే అతనికీ. సరస్వతీపీఠం. కానయితే యేం గ్రహచారమోకాని మీ నాన్నగారు పోయినదగ్గిర్నుంచీ అతనికి మతిపోయింది. ఏఁవిటో "లోకం, మూర్ఖం" అంటూ యిందులో పడిపోయేడు మరి."

"రెండేళ్లు అయిందికదమ్మా. పాపారావు బాబయ్య కంటపడీ?"

"అయిందికాదూ? మీ నాన్నగారు మంచం పట్టినప్పుడు వొచ్చాడు. పోరునేగా. అంతే. తరవాత ఆయన కన్ను మూశాక, ఆ నాలుగు దినవారాలూ జరిపించి, తను మకాం యెత్తేశాడు. మరి ఫికరేలేదు. నాటికి నేడూ, మళ్లీని! దుఃఖం భరించలేకనే దూరంగా పోయాడే, పాపం. అన్నదమ్ముల్లాగ ఉండేవారాయె!"

## 2

తల్లిమాటలు వింటూనే బాజీ నాపక్కన యింకో సంచికంచం, పీటా వేసి నీళ్లూ అవీ పెట్టింది. వొడ్డిస్తూ ఉంటే, పాపారావుగారు స్నానం ముగించుకుని వొచ్చాడు. పరిచయాలయాయి. స్ప్రకు కొస్తతగ్గించి, మళ్ళీ ఒక్క అయిదం పక్కికి వొచ్చి సావకాశంగా తిరిగీ ఉపక్రమించాను, నాభోజనం, ఆయనతో కబుర్లు చెబుతూను. అన్నానేకాని, కబుర్లన్నీ బాజీయే చెబుతోంది ఆయనతోను.

"ఔనూ, బాబాయ్, యీ శీతాకాలంలో మావూరు రారాదూ? సర్కస్సులూ, కార్నివాల్సూ అవీ రెండుకళ్లు చాలవు, చూడ్డానికి. క్రిస్మస్‌లో నాలుగురోజులుండి వెళుదువుగాని. ఏం? మావారు కూడా చాలా సంతోషిస్తారు. ఆయన్ని చూసనే లేదుగా, నువ్వు?"

"అలాగేనమ్మా, వొస్తాన్లే" ఏదో బరువుగా, నిరుత్సాహంగా అనేశాడు, పాపారావుగారు— ఆవిషయం మాట్లాడకుంటే బావుణ్ణు అన్నట్టు.

"వొస్తాన్లే అంటేకాదు. తప్పకుండా రావాలి"

"ఇంతకన్నా ఆప్యాయంగా పిలిచి ఆదరించే వాళ్లు యెవరు బాజీ, నాకూ? కాని, వెధవది ఏదో ఒకటి అలా తింటసంలాగ అడ్డు తగులుతూనే ఉంటుంది. అసలు యెన్నిసార్లు వొద్దాం అని ప్రయత్నించినా ఎప్పటికప్పుడే ఏదో యిదయిపోతూనే వొస్తోంది మరి." ఆ బ్రాహ్మడు ఏదో నూతుఁలోంచి మాట్లాడుతూన్నట్టు అనిపించింది నాకు. ఏదో నాలిక చివరిదాకా వొచ్చి ఆమాట చెప్పకుండా అవతల వాళ్ల మనస్సు నొప్పించకుండా ఊఁ తికమకలు పడిపోతున్నాడు.

"ఇన్నాళ్ళూ ఏదో అయిపోయిందిలెద్దూ" బాజీ వొత్తిడిచేసింది.

"ఇప్పుడయినా కంటపడ్డావు కనకా. కాకపోయినా బొత్తిగా ఆ పల్లెకొంపల్లో ఆలనా, పాలనా సంరక్షణా? ప్రజలకి ఏదో చేద్దాం అని నువ్వు పడుతూన్న శ్రమా అదీ చాలా మంచిదేకాని, నువ్వు దృఢంగా ఉంటే మాటకదూ మిగతావన్నీనూ?"

"నిజఁవే, బాజీ, నిజఁవే. 'స్వయంతీర్ణః పరాం స్తారయేత్' అన్నారు. నేను మొదట ఆరోగ్యంగా ఉండాలే అనుకో—"

"మరి నీకు ఏఁవయినా విశ్రాంతి అనేది దొరుకుతోందీ? అందులోనూ ఈ వయస్సులో, ఆ పల్లెటూళ్లో ధూళీ దుమ్మూ—"

"అలాగ కొట్టిపారెయ్యకు, బాజీ. పల్లెటూరి గాలీ నీరూ యెంత ప్రశస్తంగా ఉంటాయనీ?"

మొత్తానికి విషయం తేల్చకుండా, ఏవో "సంఘం" పనులూ అవీ ఉన్నాయి అంటూ భోజనం ముగించాడు పాపారావుగారు. సావిట్లో బల్ల మంచం మీద కాస్సేపు నడుంవాల్చి సాయంత్రం ప్రయాణం అయి వెళ్ళిపోయాడు. కోరా ఖద్దరు లాల్చీ నీర్కావి రంగుపంచేనూ ఆయన కట్టుకున్నవి. పై మీద అన్ని అవసరాలకీ ఆదుకునే ఓ తువ్వాలు! అలాంటిదే ఒక సజ్జు చేతిసంచీలో ఉంది. అది చేతపుచ్చుకుని బయలుదేరాడు పాపారావుగారు. దగ్గిరున్న బస్సు స్టాండుకి కాదు; అంతకన్నా దగ్గిరలో దొరికే జట్కాకోసఁవూ కాదు. అలాగ సాయంత్రపు నీరెండలో జభరుగా అడుగులు వేసుకుంటూపోయాడు, క్రోసున్నర పోతేనేగాని అవుపడని చిట్టివలస!

తను స్వర్గతుల్యం అని చెప్పి వర్ణించిన ఆ పల్లెటూరు చేరుకునేసరికి బాగా చీకటి కమ్ముకుంది. కొట్టుగది గుమ్మం తెరుస్తూనే అగ్గిపుల్ల అరగదీసి ఓ గుడ్డి బుడ్డీ దీపం లైటు వెలిగించాడు. లాల్చీవిప్పి, పంచె ఎగగట్టి, కాళ్ళూ మొహం కడుక్కుని కడుపునిండా గ్లాసుడు నీళ్ళు తాగాడు. అంతలో కళ్ళు మూతలు పడ్డాయి. చాపమీద జంబుఖానా పరుచుకుని ఒళ్లు మరిచి నిద్దరపోయాడు. ఉదయాన్ని లేస్తూనే కొట్టు తుడుచుకుని, ఏటినుంచి నీళ్లు మోసుకువొచ్చి మండీ

మంచిని పచ్చికర్రలతో చెయ్యి కాల్చుకున్నాడు—చేసింది పెసరకట్టూ, అన్నమున్నూ. పొరుగువాళ్ళు యిచ్చిన చల్లమక్కతో సహా మూతి తుడుచుకుని అదరాబాదరాగా మిల్లుకి వెళ్ళిపోయేడు.

## 3

ఆఖరుకి ఆయనగీత అలా మారిపోయింది. ఒకానొకప్పుడు తనూ నాలుగువేళ్లూ నోట్లోకి పోతూ ఉన్నవాడే. కాస్త భూమీ పుట్రా, యిల్లూ వాకిలీ ఉండేవి తనకీని! విజయనగరంలోనే బి. ఏ. ప్యాసయ్యాడు. తరవాత ఉద్యోగాల తర్జన భర్జనలో పడి, ఆ ఆలోచన తెమిలే వేళకి నాలుగోపడి పైపడగా, యిహనా చింత విరమించుకున్నాడు—ఉన్నది నిలబెట్టుకుంటే చాలదా యేమిటి యీ జానెడు పొట్టకీని అనుకొని. చదువుకున్నవాడూ సౌమ్యుడూ అవడం మూలాన్ని సొసయిటీలో పదిమందితోనూ పరిచయం ఉండేది. పక్కనే ఉన్న సుందర్రావు మావయ్య అయితే కేవలం తన యింటిమనిషిలాగే చూసుకునేవాడు. రోజులు నెమ్మదిగా హాయిగా గడిచిపోతూ ఉండేవి. అంతలో సుందర్రావు మావయ్య "స్టాక్ ఎక్స్చేంజి"లో తల దూర్చాడు. పాపారావుగారు అతనికి ఆసరాగా నిలుచున్నారు. అప్పులు చేసి మదుపులు పెట్టినా లాభించినన్నాళ్ళు బాగానే లాభించింది మొదట్లోను. కాని ఉండి ఉండి ఓనాడుమాత్రం మరి లేవకుండా నడ్డి విరిచేసింది. తన కళ్లముందే—చూస్తూ ఉండగానే—యిల్లు గుల్ల అయిపోవడం పాపారావుగారు గమనించారు. ఇహ నేమాత్రం అశ్రద్ధ చేసినా అప్పులు ఎగగొట్టాడన్న అప్రతిష్ఠ పాలు కావలసి వస్తుంది. అటు సుందరం మావయ్యకూడా యించుమించు అదేస్థితిలో ఉన్నాడు. ఎటొచ్చీ, కాస్త గుడ్డిలో మెల్ల. కొంత ఆస్తి అప్పటికప్పుడే భార్యాపిల్లల పేర రాసేశాడు.

పాపారావుగారికి ఏనాడో కళత్ర నష్టం సంభవించింది. అప్పట్నుంచీ ఆయన అలానే ఉండిపోయాడు. ఇంక యిరస్తా పరస్తా యెవ్వరూ లేరు; కనక నే—ఏమాటకి ఆమాటే అనుకోవాలి మరి—సుందరం మావయ్యా ప్లాన్లకి తను చేతికి ఎముక లేకుండా సాయపడుతూ ఉండేవాడు. అయితే, సుందరం మావయ్యమట్టుకు తలపెట్టీ కీడు చేసేడా? గ్రహచారం కాకపోతేను! ఇంతకూ కాలం, కర్మం అలా సమకూడాయి. లెక్కలు సరిచూసుకోవడంలో సుందరం మావయ్యే పాపారావుగారికి అయిదు వేలదాకా యివ్వాలని తేలింది. కాని మావయ్య యిచ్చేస్థితిలో ఉన్నాడా? కాని కాలం—ఘోరకలి—యిద్దరి నెత్తినా ఒక్కలాగే పెట్టింది శఠగోపం. వారం తిరగకుండా సుందరం మావయ్య మంచం పట్టాడు. నాలుగో నాటికి హరీమన్నాడు. పాపారావుగారికి యిది గోరుచుట్టుమీద రోకటిపోటు! తన మాటకేం? ఒంటిగాడు. ఎలాగయినా వెళిపోతుంది. కాని సుందరం భార్యాపిల్లలూ మాటో? ఉన్నది కాస్తా అప్పులవాళ్లు చేసేసుకుపోతే, యిహ వాళ్లు తినేదేముంది? బతికేదెలాగ? ఇంట్లో చూస్తే ఎమ్మిడీగాక కొత్తిగా చిన్నపిల్లలూ, ఆడవాళ్లున్నూ.

ఒక చెంప వొల్లమాలిన దెబ్బతిని, అటు అప్పుల పాలయిపోయి, యిటు అన్నదమ్ములాంటివాణ్ణి పోగొట్టుకుని—అతనికి పిచ్చెత్తినట్టు అయిపోయింది. ఉన్నకాడికి ఆస్తీ పాస్తీ తెగనమ్మి, అప్పులు తనవీ, మావయ్యవీ పూర్తిగా తీర్చుకుని ఆ ఊరినుంచి బిచాణా యెత్తేశాడు. పోయిన తన ప్రాణమిత్రుడికి ఏ అప్రతిష్ఠా రాకుండా ఉండాలని తను చేసిన వ్యవహారం సంగతి యింట్లో యెవ్వరితోనూ చెప్పలేదు, పాపారావుగారు.

## 4

ఇందాకా కుడీయెడమా కానకుండా ఖర్చుచేసే అతనికి అకస్మాత్తుగా పరిమితంగా కాలక్షేపం చెయ్యాలంటే ఏం దారీ తెన్నూ కనపడ్డేదు. చేతుల్లో మిగిలిన డబ్బా ఏవంతో, గంపెడంతబాలేనా. గోటికి గోరూ అన్నీ హారతి కర్పూరంలాగ హరించుకుపోతున్నాయి. తన పూర్వపు స్నేహితుల్ని ... కలుసుకున్నా అతనికి ఆమాత్రం పుట్టకపోయేది కాదు. కాని ఆత్మాభిమానం అడ్డు తగిలింది; యెప్పుడూ ఎత్తిపట్టే ఉండవలసిన చెయ్యి, యిప్పుడు "దేహి" అనిపించడానికి అతని మనస్సు ఒప్పిందికాదు.

సిగరెట్టు కాల్చుకోకుండా జీవితం యేమిటనీ, కోటులేకుండా బయటికి ఎలాగ వెళ్లడం అనీ అనుకునే ఆ ఆసామీ, ఖద్దరులాల్చీ ముతక పంచె కట్టుకుని చెప్పులయినా లేకుండా తిరగడం అలవాటు చేసుకునేసరికి బాగా ఏడాది పట్టింది. ఇంకా అతనిదగ్గిర మిగిలిన పూర్వస్మృతి చిహ్నాలు ఓ క్షీరాబ్ధి పట్టు పంచా, దానిజత ఉత్తరీయమున్నూ.

ఇన్నాళ్ళూ అతను తనకితానే మిగిలిపోయాడు. పేదరికం ఓ పెద్ద జబ్బు. మనిషి ఆదినుంచీ పేదరికపు పెంపుడుబిడ్డ అయితేతప్ప లేకపోతే యీ జబ్బు

పాపమాపేసరికి సంఘం దవ్వుదవ్వులకి తొలిగిపోతుంది. ఇంకా ఆ మనిషిమాటా? అతను కొంత సున్నితహృదయుడైతే లోలోపలే క్రుంగిపోతాడు; అలా క్రుంగిపోతూనే తెలుసుకుంటాడు, అందాకా తనవెంట తిరుగుతూ ఆప్యాయంగా వుంటూన్నవాళ్లే తనని యెంత త్వరగా మరిచిపోతారోనని!

ఆ కర్మాగారంలో తనలాంటివాళ్లు ఒకరిద్దరు లేకపోలేదు. ఎక్కౌంట్సు పరిశీలిస్తూనో, గాంగు కూలీలపని తనిఖీ చేస్తూనో, వాళ్లూ తానూ తారసపడినప్పుడు అకస్మాత్తుగా ఎందుకో కళ్లు మెరిసేవి. హృదయాలు స్పందించేవి. అయితే యెవరిదారిన వాళ్లు చూసుకుంటూ ముక్తసరిగానే దాటుకుపోయేవాళ్లు. అంతకన్నా లోతుగా ఒకర్ని ఒకరు తెలుసుకోవడానికి మనసు వొప్పేది కాదు. అహంకారమో, ఆత్మగౌరవమో అడ్డుతగిలేవి. ధైర్యం చాలేదికాదు. కాని యెంతకాలం అలా కాలం వెళ్లబుచ్చగలరూ? తమకి తెలియకుండానే మాటలు యేవో పూర్వస్మృతిపథాలని అనుగమించేవి. ఆ తరవాయి ఎక్కడో యెవరి జీవితంలో [illegible] అన్నా లోకంలో అమానుషత్వమే తెలిసొచ్చేది.

అలాంటి పరిస్థితుల్లో మనిషికి వింతగా గోచరిస్తుంది జ్ఞానం. క్లుప్తంగా కాలక్షేపం చెయ్యడం నేర్చుకుంటూ—అలవరుచుకుంటూ—బతకడానికి అసలు ఆర్జన అనేదే అవసరంలేదని గ్రహిస్తాడు. బ్రష్షూ పేస్టూ వాడితేనేగాని పళ్ళు శుభ్రంగా ఉండవని దృఢంగా నమ్మిన [illegible] పుల్ల యెంతెలా కళ్ళు విప్పింది! ఉదయాన్న కాఫీ, పది గంటలకి భోజనం, మధ్యాహ్నం ఫలహారం, రాత్రి భోజనానంతరం మళ్ళీ పాలూ—యివన్నీ అరగక జబ్బులూ—వాటినుంచి కోలుకోడానికి మందులూ, టానిక్కులూ—అబ్బ! అదంతా ఓ తతంగం! రాత్రిళ్ళు రేడియో వింటేనేగాని నిద్రపట్టక గంగవెర్రులెత్తిపోయే తనకి, చాప పరుచుకుని నడుం వాల్చడంవే తెలువుకాదూ యీ రోజుల్లోనూ శ్రీ! [illegible]!

ఆదిలో అలా తనలో తానే ఉపన్యాసాలు చెప్పుకున్నాడు, పాపారావుగారు. పాపం, ఆయన్ని అపార్థం చేసుకోకండి. అదంతా "అభావ విరక్తి" కాదు. ఆయన ఆత్మాభిమానం చాలా గట్టిదెబ్బతింది. అవమానంతో కుంగిపోయి మూలమూలల మూలుగుతోంది ఆ ఆత్మ. ఆత్మాభిమానం కొంతపడిపడం యెంత లోపం! ఆ లోపం పూడుస్తాయి, యీ ఉపన్యాసాలు. ఆయనకి అంతకంటె మోక్షం లేదు!

## 5

పరిస్థితులు యిలా ఉంటూంటే కార్మిక వర్గానికి యేదో పండుగ వచ్చింది. మే ఒకటో తేదీ కాబోలు. అంతా చందాలూ అవీ పోగుచేసి, యేదో ఆర్భాటం చేస్తున్నారు. అల్లుల్లో మల్లుడు పెద్దవాడని వాళ్లకందరికీ పాపారావుగారు పెద్ద అయిపోయాడు. సాయంత్రం మీటింగుకి యిసకవేస్తే రాలకుండా ప్రజ! గరివిడి, గర్భాం, నెల్లిమర్లనుంచి కూడా కార్మికులు బస్సు చేసుకుని మరీ వొచ్చారు. పాపారావుగారు బ్రహ్మాండంగా ఉపన్యసించేరని మర్నాడు పేపర్లు ఘోషించాయి.

ఆ ఉపన్యాసం "బాజీ" కొడుకు వాళ్లమ్మకీ, అమ్మమ్మకీ చదివి వినిపించాడు. ఆ ఉపన్యాసానికి తనూ వెళ్లానన్నాడు. పాపారావుగారిని ఆకాశం గెత్తున పొగిడేశాడు. కామాక్షత్తయ్య అమాంతం కొంపె అంటుకుంది. కేవలం ఒక తల్లికడుపున పుట్టినట్టు మెలుగుతునే తన భర్త గతించడంతోనే పట్టరాని వ్యాకులత పొంది, పాపారావుగారిటు సంఘసేవకీ మానవ కల్యాణానికీ పూనుకున్నాడని నిశ్చయం చేసుకుంది. "అవును మరి. అతనికేం డబ్బులేదా? చదువు లేదా? ఉన్న యిల్లూ వాకిలీ ఒక్క దెబ్బని అమ్మి పారేశాడు, డబ్బయి వేలకి గాబోలు; అక్కడికి యింకా నష్టానికే అమ్మేశాడు. ఏదయితేనేం? కావాలంటే కాలుమీద కాలు వేసుకూర్చుని తినలేడూ? అసలు అతని రస్తాయే వేరు. నే నెరుగనా యేమిటి? ఎప్పుడూ బాజీకి ఏదో ఒకటి అలా కొని యిస్తూనే ఉండేవాడు. తరవాత తరవాత బాబిగాడి చదువో? ఒక్క బాబిగాడే యేమిటి? కాలేజీలో పిల్లలు యెంతమంది పాఠాలు చెప్పుకునేవారు కారు! ఎన్నడయినా ఒక గడ్డిపోచ ఆశించాడూ? పోనీ, బుద్ధి ఉన్నందుకు కీర్తిమంతుడైనాడు, ఆయన బతికే ఉంటే యెంత ఆనంద పడుదురో! చూసుకోడానికి అదృష్టం లేకపోయింది," అనుకుంటూ కామాక్షత్త కంటనీరు పెట్టుకుంది. తామింకా భీముని పట్నంలో వేసంగి ఆఖరుదాకా ఉంటాం అనీ, తప్పకుండా ఓసారి చూసిపోవలసిందనీ కబురెట్టింది, అత్త, పాపారావుగారికి.

మాట కాదనలేక ఆయన వొచ్చాడు, పాపం. తిరిగి క్రిస్మస్ సెలవల్లో రమ్మని బాజీ బలవంతపెట్టే

సరికి అతనికి పచ్చి వెలగకాయ గొంతుకపడ్డట్టయింది. ఇంకేమీ అనడానికి తోచక, సంఘం—పనులూ ఆ చిక్కుల్లో ఉన్నాననేశాడు. "సంఘం అంటేఆనాటి మీటింగు అదీ అనుకుంటారని ఆయన ఉద్దేశం. యిక్కడ వీళ్ళు కేవలం మానవ సంఘానికే ఏదో తాను మహోద్ధరణ చేసేస్తున్నాడని అన్వయం చేసుకున్నారు. పాపారావు గారి ఆత్మ త్యాగానికీ, సౌమనస్యానికీ వాళ్ళ హృదయాలు ఉప్పొంగిపోయాయి. ఆ హృదయ కుహరాల్లోనే నతులు సమర్పించేరు ఆ పుణ్యమూర్తికి!

'ఆషాఢస్య ప్రథమదివసే' తొలకరించింది. భూమి చల్లపడిందికదా అని అత్తా, బాజీ, పిల్లలూ భీముని పట్నం మకాంయెత్తేసి వెళ్ళిపోయారు. మరి నాలుగు రోజులకి పాపారావు గారికి ఓ ఉత్తరం వొచ్చింది -

"బాబాయికి నమస్తే—

లోగడ భీముని పట్నంలో నిన్ను కలుసుకుని మాట్లాడిన తరవాతా, నీ జీవితం వైఖరీ చూసీ మేం అంతా యెంతో ఆశ్చర్యపడ్డాం. నీలాగ సంఘానికి తోడుపడే అవకాశం యెంతమందికి దొరుకుతుంది చెప్పు బాబాయ్? అవకాశాలు ఉన్నా, తన సుఖం కూడా కాదని, వాటిని సద్వినియోగం చేసుకునేవాళ్ళెంతమంది? నాలాంటి వాళ్ళం ఉన్నాం, ఏం లాభం? మా పొట్ట మాకు శ్రీరామరక్ష. ఇవన్నీ నేను ఒక్కర్తినే అంటూన్న మాటలు కాదు. మా వారూ, అమ్మా కూడా యిలాగే అనుకుంటున్నారు. మావారయితే నువ్వు చేస్తూన్న పని ఎంతో మెచ్చుకుంటున్నాం అని మరీ మరీ రాయమన్నారు. అంతే కాదు; యిందుతో రూ 1116/- కి చెక్కు జత పరుస్తున్నాం. ఈ డబ్బు మీ సంఘంలో తగిన కుటుంబం చూసి, వారి సంరక్షణకి ఖర్చు పెట్టు. నీకు సంఘం పని తొందర్లు ఉంటే క్రిస్మస్‌కి యిక్కడికి వచ్చి నీ పని పాడు చేసుకోకు. వీలు చూసుకుని నాలుగు రోజులు సెలవు పెట్టి పండుగరోజుల్లో మేమే వొచ్చి కలుసుకుంటాం. అప్పుడు నీకు ఒబ్బట్లు చేసి పెడతాన్లే!

మరి,
అందాకా ఉండనా?
నీ
బాజీ.

## 6

చెక్కు చేత్తో పట్టుకుని దిగాలుపడి చూస్తున్నాడు పాపారావుగారు. అలాంటివి లక్ష చెక్కులు తనూ యిచ్చేడు; కాని ప్రస్తుత పరిస్థితుల్లో ఆ మొత్తం పెన్నిధే తనకి. వెయ్యినూట పదహార్లు! ఎంత సొమ్ము!! అందులో సగం ఉంటే యెన్నో పనులు చెయ్యొచ్చును. తనకి రెండంటే రెండేగా ఉన్న లాల్చీలు! ఆ చిరిగిన ధోవతికి మరి మాసిక వేయించ నక్కరలేదు. తన తిరుగుడికి అన్నింటికంటే ముఖ్యావసరం ఓ గొడుగు. తనది అసలు ఏ వొస్తువ మరామ్మత్తుకి రాకుండా ఉంది?

చెక్కు తీసి మళ్ళీ చూసేడు, పాపారావుగారు. అది క్రాసు చెక్కు. మొట్టమొదటిసారిగా తనికి తట్టింది క్రాసుచేసిన చెక్కు మార్చుకోవాలంటే ఎన్ని తికమకలు పడాలో అని! దీర్ఘంగా నిట్టూర్చాడు.

సరే, ఏదయితే నేం. ఉత్తరానికి వెంటనే జవాబు రాయాలి. ఇల్లంతా గాలించి ఓ పావుటావు కాగితం ముక్కా, కలం సిరాబుడ్డీ పట్టుకొచ్చాడు. కాని ఏమి రాయడానికీ పాలుపోయింది కాదు. ఎట్టకేలకు మొదలెట్టాడు—

"బాజీకి, బాబాయ్ ఆశీర్వచనాలు.

నువ్వు అపారార్ద్రహృదయంతో రాసిన ఉత్తరం, కూడా పంపిన చెక్కూ చేరాయి. నా కృతజ్ఞత స్వీకరించు. నువ్వు కోరినట్టుగా యీ సొమ్ము—"

ఏఁవిటో వెనకది, కంపెనీ ఉత్తరంలాగ తయారయింది, ఆఖరికి. మాటమాటకీ తడుముకోడమే. ఏ మాటా పొందికగా కుదరకుండా ఉంది.

ఉత్తరం రాయడం ఎన్నడూ అతనికి అంత కష్టంగా తోచలేదు. కాగితం చింపి అవతల పారేశాడు.

ఆ రాత్రి అతనికి నిద్ర పట్టినట్టూ కాదు; పట్టనట్టూ కాదు. తనమట్టుకు తనకే ఆశ్చర్యం వేసింది, నిజంగా ఆ సొమ్ము పుచ్చుకోడానికి యెవరు తగుదురా అని. అసలు విషయం ఆలోచిస్తే బాజీ యెటువంటి వ్యక్తులని ఉద్దేశించి ఆ సొమ్ము వినియోగించమందో తనకి తెలియడంలేదు. బహుశా తనకి అటువంటివాళ్లు తారసపడ్లేదేమో! ఓవిధంగా చూస్తే అంతమందీ బీదవాళ్లే మరీ—కాని, పేదరికం అందరిపట్లా ఒక్కలాగే అన్వయిస్తుందా అన్నది ప్రశ్న. ఏ ఆస్కారం లేకుండా చెట్టుమీది పిట్టకన్నా కనికష్టంగా-అఘోరిస్తూన్న వాళ్లెంతమంది? తనతో పోల్చిచూస్తే తనచుట్టుపక్కల ఉండేవాళ్ళు పేదవాళ్ళా? పెద్దింటివాడూ, చదువుకున్నవాడూ, పరిస్థితుల ఒత్తిడి మూలాన్న

సామాన్యుల మధ్యని పడేసరికి, రకరకాల భావాలు పుట్టుకొస్తాయి. గత యేడాదినుంచీ పాపారావుగారికి అలాంటిదే ఒక నిశ్చితాభిప్రాయం—సామాన్య జీవితంలో ఉండే కష్టాలు సర్వసాధారణంగా గోరంతలు కొండంతలు చేసి చెబుతారనీ, వాళ్లకి వర్తించని కొలతబద్దతో సామాన్యుల జీవితం తైపారు చేస్తారనీ, అంచేతే ఆ కష్టాలు యెంతో యిదిగా అవుపిస్తాయి అనిన్నీ. తన చుట్టూ యెక్కడ చూసినా, ఆ మెకానిక్కూ యీ ఫిట్టరూ, ఆ ఫోర్మనూ, యీ ఛార్జిమేనూ, కుమ్మరీ, కమ్మరీ—ఎవరింట్లో వాళ్ళు హాయిగా నిద్రపోతున్నారు. తాగి తందనాలే ఆడుదురుగాక; పేకాటల్లో ఓడిపోయి కత్తులు పెంచుకుని కొట్టుకుందురుగాక; పసుత్వానికి లొంగిపోయి ఒకరి ఆలిని యింకొకరు లేవదీసుకుపోదురుగాక. కాని, వాళ్ళు ఓ ముద్ద తిని ఓ పంచని పడుంటున్నారు. నిర్భాగ్యులు అంటారా? కాని తనది జొత్తిగా దౌర్భాగ్యం కాదూ?

అంతలో యింకో ఆలోచన తట్టింది. పెద్ద కుటుంబంలోంచి వొచ్చిన మనిషి గనక, బాజీ అలా మర్యాదగా రాసిందికాని, తన వేషంమాసి సంగతంతా గ్రహించిందేమో? కొంపదీసి తనకోసమే పంపిందేమో ఆ సొమ్ము? అలాగే అయిఉంటుంది. అసలు వాళ్లనాన్న తనకి బాకీ ఉన్నదాంట్లో యిది సగం అయినా లేదే?

ఛీ ఛీ, పాడు ఆలోచనలు. అంతా సుఖంగా ఉన్నారూ? తనొక్కడేనా దుఃఖంలో ఉంట! వీళ్లకి యిక్కడ ఓ ఆసుపత్రయినా వుందీ? పురుళ్లు పొయ్యడానికి సరయిన ఓ మంత్రసానయినా ఏడిసిందీ ఆఖరికి? ఫేక్టరీలో ఎవరికయినా కాలూ చెయ్యీ తెగితే—అబ్బ! యింక తలుచుకోడానికి గూడా శక్తి చాలలేదు అతనికి. అభాజనపు బుద్ధులు పుట్టినందుకు తనని తనే వెయ్యివిధాల నిందించుకున్నాడు.

అంతలో కోడి కూసింది. ఏటికివెళ్ళి కాలకృత్యాలు తీర్చుకుని స్నానంచేసి వొచ్చేడు—ఉత్తరం తిరిగీ ఆరంభించేడు—

"బాజీ,

నువ్వు రాసిన ఉత్తరం చూసుకున్నాను; చెక్కూ అందుకున్నాను. కాని, యింకెప్పుడూ యిలాంటి పనిమాత్రం నా నెత్తిని పెట్టకేం? నానాటికీ ఏవిటో ఏ పనీ చెయ్యలేకుండా వున్నాను. అసలు యీ సొమ్మేం చెయ్యడవా అని పరిపరి విధాల ఆలోచించి, చివరికి "సంఘం" ప్రెజరరుకి యిచ్చేసేను, సద్వ్యయంగా ఉపయోగించమని. దాని మింజుమలె ఖర్చు వచ్చాల వివరాలు ఆయన నీకు రాస్తాడు.

తగినవాళ్లకి స్వయంగా యివ్వకుండా యింకొకరి చేతులో పెట్టేనేమా అని ఆశ్చర్యపోకు. ఈమధ్య నాకే ఊరు నీళ్ళు ఏమీ పడడంలేదు. త్వరలో యిక్కడనుంచి మకాం యెత్తేస్తున్నాను.

ఏలూరు వెళ్ళిపోతున్నానా అనుకుంటున్నావు కదూ, బాజీ? నాకే తెలియదు. ఈపాటున నన్ను మరిచిపో, బాజీ; మీరంతా యింక నన్ను మరిచిపొండి. అలా మరిచిపోతారనే నమ్మకంతో—

నీ
బాబాయ్."

# 7

"మీ పాపారావు బాబాయ్‌గా రాసేరే" అంటూ చదవడానికి ఆరంభించేడు బాజీ భర్త ఆ ఉత్తరం.

కూడా ఉన్న స్నేహితుడికి టీ కలిపియిస్తూ, నవ్వుమొహంతో చెవులు రెండూ భర్తకి అప్పజెప్పి వింటోంది, బాజీ.

"కొంపదీసి ఆ చెక్కు కాస్తా చేతబుచ్చుకు ఉడాయించ లేదుగదా, యీ దేశోద్ధారకుడు?" ఛప్పున నోరుజారేడు, అంతా విన్న ఆ స్నేహితుడు.

భర్త చేతులోంచి అప్రయత్నంగా ఉత్తరం నేలకి జారిపోయింది.

పైట చెరగుతో ముఖం కప్పుకుని బాజీ బైటకి పోయింది.

# ఋషి కామన

★

**శ్రీ వింజమూరి శివరామరావు**

ప్రణయ కుపితయైన మేనకతో - విశ్వామిత్రుడు

ఓ నవచైత్రమాస కుసుమోచ్ఛ్రయ కోమలవ చ్ఛరీర ! నా
మేనక ! ఆగవే యొక నిమేషము, రోషము లేల కల్గె నీ
దీనుని మీద ? నా ప్రణయ దేవతవై దివినుండి మర్త్యలో
కానికి వచ్చి జీవిత వికాసము లిచ్చితి వో విలాసినీ !

కన్నుల చీకువాల్ తెరలు క్రమ్మగ - ఇమ్మగు నా యెడంద లో
తెన్నుల మబ్బుదొంతరలు తేరగ - చేరగ వచ్చినావు లే
వెన్నెల రేకవై - వలపు వీడని వాడని బొండుమల్లె పూ
వన్నెల జోకవై - బ్రతుకు బాటల పాటలహోయి నింపుచున్.

ఆశలలో వసంత విభవాతి శయమ్ములు పల్లవింప - నా
యాశలు దివ్యనందన వనాంతర సీమల తాండవింప - నీ
పేశల మందహాస రుచి వీచికలో - కమనీయ కౌముదీ
శైశిర కాంతి పుంజములా - సౌరసతీ ! వికసించె నాకునై.

వీడితి శైవచింతనము - వీడితి నా తపనోగ్ర దీక్ష - పో
నాడితి కోర్కెలెల్ల - విడనాడితి నన్నియు నిన్ను గోరి; నీ
పోడిమి వచ్చి నా కనులముంగిట నిల్వగ - నాయెడంద లో
జాడల నిల్లు కట్టుకొనసాగితి వో సురలోక సుందరీ !

ఆ చివురాకు చక్కదనమందున నీ నును చెక్కులందముల్ -
పూచిన నల్లగల్వ నెరి పోడుములందున నీదు కన్నులం
దేచిన సోయగమ్ము - చివురించిన పూవుల తీవలందు నే
నోచలి ! నీదు మేని హొయలొప్పగ కన్గొనుచుందు నెప్పుడున్.

ఈ ముదిగుండె వాడినదియే సుమి ! నీ వెదురైన యంతలో
నే మరి యేటికో పులకరింపగసాగె - అదెంత వింతయో?

ఆమని వెన్నెలేల చలియంటిన చీకటిరేల? మేనకా!
ప్రేమ రసాధిదేవత! వరించితి నీ యనురాగ భోగమున్.

శారద రాత్రులందు - మధు చంద్రికలందు - వనాంత నిర్ఝరీ
తీరతలమ్ములందు - వ్రతతీ కుసుమాగత శీతలానిల
స్ఫార మనోహరైక మృదుసౌరభ శోభలయందు - సంతతో
దారతరాను రాగముల ధన్యుని జేయుము నన్ను కోమలీ!

ఈ పసివాడు నాదు బ్రతుకే యొక యామనిలోని పూల నె
త్తావుల తావుగా విరియ - దైవతలోక విలాసినీ మణీ!
భావము లన్నియున్ ప్రణయ భాసురతన్ వికసింపజేసి - నా
జీవిత నేత్రి వైతివి; భజించెద నేమములేని ప్రేమమున్.

ఏ పరమాద్భుతానుభవ మీ యదియో సఖి! కోర్కె లేదు నీ
రూపమునందు; నీ హృదయ రోచిరుదార మనోహరత్వ సం
దీపితమయ్యె నా బ్రతుకు; నింపుము నీ ప్రణయాసవమ్ము సం
తాపము తీర; జీవిత రథమ్మిది స్వర్గపథమ్ము నందునో...



# లలితా సహస్రనామములో దేవీ స్వరూపము



శ్రీ డి. యస్. శర్మ

## 1

బ్రహ్మాండ పురాణాంతర్గతమైన లలితోపాఖ్యానమున కుత్తరభాగమే లలితా సహస్రనామము. అందు మూడు ప్రకరణములు గలవు. మొదటిది అవతారిక; రెండవదానియందు లలితా మహాదేవి యొక్క సహస్రనామములు చెప్పబడినవి. మూడవ దానియందు ఫలశ్రుతి చెప్పబడినది.

లలితోపాఖ్యానమున అగస్త్యునకు హయగ్రీవుడు దేవి కార్యకథనమును చేయును. కథ అంతయును విని, దేవియొక్క సహస్రనామములనేల చెప్పలేదని అగస్త్యుడు హయగ్రీవుని ప్రశ్నించెనని యవతారికలో కలదు. "దేవియొక్క యద్భుత చరిత్ర నాకు చెప్పితివి. ఆ మహామాతయొక్క పుట్టుక, పట్టాభిషేకము, భండాసురవధ, సవిస్తరముగా చెప్పితివి. శ్రీపుర మహిమ పంచదశీమంత్రము మహాత్మ్యము వివరించితివి. కాని యామె సహస్రనామములు చెప్పవైతివి. మరచితివా, లేక సాలోచనగానే చెప్పుట మానితివా? లేక యా నామములను నేను వినతగనా?"

దానికి హయగ్రీవు డిట్లు బదులు చెప్పెను. "అది రహస్యము గాన చెప్పకుంటిని. కాని భక్తి పూర్వకముగా కోరుచుంటివి గాన తెలియ జెప్పెద, వినుము" పరమేశ్వరి యను లలితాదేవిచే ప్రత్యేకముగా నియమింపబడి వాగ్దేవి ఈ నామములను కూర్చెనని చెప్పి హయగ్రీవుడు అగస్త్యునకా నామామములనుపదేశించెను.

## 2

లలితా సహస్రనామములో చెప్పబడిన లలితా దేవికథ క్లుప్తముగా నిది:—

శివుడు మూడవకన్ను తెరచుటచేత దగ్ధమైపోయిన మన్మథుని బూడిదెను, చిత్రకర్మ యను శివ పరిచారకుడు సేకరించి, ఒక మనుష్యునియాకారమును దానితో రచించెను. ఆ చిత్రము శివునికంటబడెను. అందుండి సజీవుడగు పురుషు డొకడు తత్క్షణమే యుద్భవించెను. శతరుద్రీయమును జపించి, శివుని ప్రార్థించుమని చిత్రకర్మ యా పురుషునికి హితవు చెప్పెను. ఆ పురుషు డట్లు చేయగా శివుడు సంతసించి అరువదివేలయేండ్లు ప్రపంచమును ప్రభువుగా పాలించుకొమ్మని యనుగ్రహించెను. ఇది తెలిసి బ్రహ్మదేవుడు భయకంపితుడై 'భండ్' 'భండ్' అని మొరబెట్టెను. అందుచే నా పురుషునికి 'భండు' యని పేరు కలిగెను. భండుడు పెరిగి పెద్దవాడగుసరికి ఒక యసురుడుగా తయారయ్యెను. శోణితపురము రాజధానిగా నేర్పరుచుకొనెను. దేవతలను హింసపెట్టి వారి జీవితములను దుర్భరములుగా జేసెను. అందుపైని నారదుడు దేవేంద్రునియొద్దకు వచ్చి, పరాశక్తినిగురించి తపస్సుజేసి యామెకృప బడయుమని సలహానిచ్చెను. ఇంద్రుడు గొప్ప యజ్ఞమును చేయగా అగ్నికుండము నుండి పెద్ద చక్రమొకటి ఉద్భవించెను. ఆ చక్ర మధ్యమున త్రిమూర్త్యాత్మకమగు దేవి దివ్యసుందర విగ్రహము నెలకొనియుండెను. దేవతలందరు దేవిని స్తుతించిరి. శత్రువగు భండాసురుని జయించెదనని దేవి వారి కభయమొసంగెను. అవివాహితులు రాజ్యార్హులు కారు. అని శ్రుతివాక్యము గాన తగినవరు నెన్నుకొని పరిణయమాడుమని బ్రహ్మదేవుడు దేవిని ప్రోత్సహించెను. బ్రహ్మ సలహా కర్తవ్యమని దేవతలందరు మెచ్చుకొనిరి. వివాహమువలన దేవియొక్క స్వాతంత్ర్యమున కెట్టిభంగము కలుగదని నమ్మకము చెప్పిరి. అందులకు దేవి సమ్మతించి ఒక పూలమాలను పైకెగుర వేసెను. ఆ పూలమాల ఎగిరివెళ్ళి, సమ్మోహనమగు

కామేశ్వర రూపమును ధరించిన శివుని మెడ కలంకారమాయెను. దేవతలందరు, నా దివ్యదంపతులకు, మహావైభవముతో వివాహమహోత్సవము జరిపిరి. లలితాదేవి కామేశ్వరియై భర్తతోపాటు పట్టాభిషిక్తురాలాయెను.

దేవతలందరు సెలవుగైకొని వెళ్లినతరువాత, రథములు, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగువానితో శక్తులసేనను సిద్ధపరచుకొని తాను చేయబూనిన కార్యమును నెరవేర్చుటకై, కామేశ్వరీదేవి దండు వెడలెను. దేవికిని, అసురునకును నాలుగు దినములు తీవ్రయుద్ధము సాగెను. ఎట్టకేలకు సర్వబాంధవానుచరసహితముగా భండుడు హతుడయ్యెను. అతని రాజధానీ నగరము నేలమట్టము చేయబడెను. దేవతలందరు దేవిని స్తుతించిరి. శివునిచే భస్మీభూతుడైన మన్మథుని భార్యయగు రతిని కనికరించమని దేవిని దేవతలు కోరగా కనికరించి ప్రేమదేవతయగు మన్మథుని పునర్జీవితునిగాజేసి, వెడలిపోయి, శ్రీనగరమున నివాస మేర్పరుచుకొనెను. మేరుపర్వత శిఖరాగ్రమున, విశ్వకర్మచేత, మయునిచేత, ఈ నగరము నిర్మింపబడినది. బ్రహ్మాండపురాణమందీ నగరవర్ణనము విపులముగా చెప్పబడినది. ఈ నగరమధ్యమున, చింతామణి రత్నఖచితమగు దివ్యభవన మొకటిగలదు. ఈ భవన మధ్యభాగమున దేవియొక్క పీఠము కలదు. బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, మహేశ్వరులు నలుగురు నాలుగు కోళ్లుగాను, సదాశివుడు పాన్పుపై దుప్పటిగాను అమర్చబడి రత్నములతో చెక్కబడిన పర్యంకమున, భర్తయగు కామేశ్వరుని యంక పీఠమందు శ్రీ లలితాదేవి యాసీనయై యుండును. దేవిని, ఆమె నగరమగు శ్రీపురమును, సూచించు చిత్రరచనయే శ్రీచక్రము. అందుచేత, శ్రీచక్రమును పూజచేయవలయునని, దేవియొక్క సూక్ష్మశరీర చిహ్నమగు పంచదశాక్షరీ మంత్రమును జపించవలయునని, శ్రీ లలితాదేవిచే ప్రత్యేకముగా నియమితయైన వాగ్దేవిచే సమకూర్చబడిన, సహస్రనామ స్తోత్రమును, పఠించవలయునని, దేవీ భక్తులను ప్రేరేపించవలసి యున్నది.

## 3

భక్తులు నన్నేరీతి నుపాసింతురో ఆరీతియే నాకు సమ్మతమను భగవద్గీతా వాక్యము సుప్రసిద్ధము. అందుచేత, తండ్రియనిగాని, తల్లియనిగాని మనము పరమాత్మను భావించి యారాధించవచ్చును. స్త్రీ పురుష భేదములకు, సాధారణముగా మన మారోపించు వ్యక్తిత్వములకు, భగవత్తత్వ మతీతమైనది. కాని, మనలోను, మనము నివసించు ప్రపంచముతోను సన్నిహిత సంబంధమును చేకూర్చుకొనుటకై ఉత్కృష్టమగు గుణములను భగవత్తత్వమునకు మన మారోపించుచున్నాము. అందుచేతనే అవ్యక్తమగు పరబ్రహ్మమునకును, వ్యక్తమగు ఈశ్వరునకును గల భేదమును తత్త్వశాస్త్రము బాగుగా గుర్తించినది. తను తానై యగోచరముగా నుండునది బ్రహ్మము. మనుష్యుని కవితాదృష్టికి, భావనకు, గోచరించువాడు ఈశ్వరుడు. మొదటి యభిప్రాయము శాస్త్రసిద్ధమని, రెండవది భావనాత్మకమని చెప్పదగును. అవ్యక్తమగు పరబ్రహ్మమును మనస్సుచే భావించినపుడు వ్యక్తరూపుడగు భగవంతు డుదయించుచున్నాడు. ఈ వ్యక్తరూపుడైన భగవంతుడే, సృష్టిచేయునపుడు బ్రహ్మగాను, పోషించునపుడు విష్ణువుగాను, లయమొనరించునపుడు రుద్రుడుగాను మారుచున్నాడు. మరియు సాధురక్షణ, దుష్టశిక్షణ చేయుటకై మానవజన్మమెత్తినపుడు అవతారపురుషుడని చెప్పబడును. పరమాత్మకును జీవాత్మకును గల అగాధమగు, మహాదంతరమును, ఇట్టి భావనలచే మన మతిక్రమింప జూచుచున్నాము.

మనకును, మన ప్రపంచమునకును పరబ్రహ్మముతో సంబంధమును ఇట్లు కల్పించుకొనుటచేత, చైతన్యాత్మకమగు శక్తి యుక్తమైనదానిగా పరబ్రహ్మమును భావించుచున్నాము. ఇట్లే నిశ్చల బ్రహ్మమునకును, చైతన్య స్వరూపుడగు ఈశ్వరునకును గల భేదము పుట్టుచున్నది. దీనినే, శాక్తేయులు శివశక్తులకు గల భేదమని పరిగణించుచున్నారు. నిశ్చల బ్రహ్మమే శివుడు, చైతన్య స్వరూపుడగు ఈశ్వరుడే శక్తి. శక్తి స్త్రీవాచకము గాన ఈశ్వరుడు ఈశ్వరిగా, శక్తిగా పరిణమించినాడు. నిశ్చలబ్రహ్మమే శివుడు, చైతన్యస్వరూపుడగు ఈశ్వరుడే శక్తి. బ్రహ్మమే ఈశ్వరుడు, ఈశ్వరుడే బ్రహ్మము. ఇట్లే శివుడే శక్తి శక్తియే శివుడు. వాస్తవముచేత, ఏకాకారమగు పరమసత్యమునే ద్వివిధముగా భావించుచున్నాము. ఈ రెండును పరమాత్మయొక్క స్థావర, జంగమ స్థితులు. అగ్నినుండి వేడిని, సూర్యునినుండి సూర్యకాంతిని ఎట్లు విడదీయవీలులేదో అట్లే శివశక్తులను విడదీయుట యసాధ్యము. ప్రాణికోటితోనుండి చైతన్య స్వరూపమగు ప్రపంచమున చిక్కుకొని, ఈ యవస్థనుండి తరించవలెనని తహతహలాడు మనకు, పరమ సత్యము

# మీ అన్ని వంటలకు డాల్డా వనస్పతి సర్వోత్తమమైన దనుటకు కారణములు

"నే నిప్పుడు డాల్డాతో వండుటచే
నాకుటుంబము ఎప్పుడు
ఆహారమును తప్పిపోరు"



## డాల్డాతో చేమఆకు పడను

తయారుచేయండి. అది మిక్కిలి రుచికరముగా నుండును!

అరకప్పు సెనగపిండి, కొద్దిగా బేకింగ్ సోడా, పసుపు మరియు రుచికై ఉప్పును కలిపి చిక్కని ముద్దగా చేయండి. తరువాత దీనిని ఒక చేమఆకుమీద విస్తరింపజేసి కొబ్బరి కోరును జల్లండి. ఆకుల అంచులను మడవండి. లవంగములతో కొనలను నిలుపండి. అరగంటసేపు దీనిని ఆవిరిలో వండండి. వడ్డించే ముందర వీటిని ముక్కలుగా కోసి డాల్డాతో పెనముమీద వేపండి.

డాల్డా వంటపుస్తకము ఇప్పుడు తమిళము, బెంగాలి, హిందీ మరియు ఇంగ్లీషు భాషలలో దొరకుచున్నది. ఒక రూపాయి.
10 అణాలు తపాలా ఖర్చులు వేరే.
ది డాల్డా అడ్వైజరీ సర్వీస్.
పోస్ట్ బాక్సు నంబరు 353, బొంబాయి 1






# డాల్డా

అన్నివిధ వంటలకు దివ్యమైన వంటపదార్థము

HVM. 201-50 TL

# మెక్లీన్స్‌తో 14 రోజులలో ధవళతరమైన దంతాలు



ఇంతకు పూర్వమే వేలకొలది నిరూపించారు.

14 రోజులలో తెల్లటి దంతములు పొందుట ఇప్పుడు మీవంతు. దీనియందు న్యాయంగా యుండండి. దీనిని మనస్ఫూర్తిగా ఉపయోగించి చూడండి-నిత్యం-రోజుకు రెండుసార్లు-సమగ్రంగా మెక్లీన్స్‌తో పళ్లుతోముకొండి. ప్రత్యేక సూత్రంప్రకారం తయారైన మెక్లీన్స్ పళ్లమీది అసహ్యకరమైన మరకలను మృదువుగాను. నిరపాయంగాను తొలగించి, వాటి సహజమైన తెల్లదనాన్ని ప్రస్ఫుటమొనర్చుతుందని ప్రారంభించినది లగాయతు మీరు గుర్తిస్తారు, 14 రోజులలోపునే-లేక, ఇంకా అంతకన్న లోపుననే-మీరు గర్వపడ దగినట్టి-మెక్లీన్ ధవళదంతాలు-ఆరోగ్యకరమైన దంతాలు-కలిగివుంటారు.

**క్లోరోఫిల్ చేర్చబడినదికూడా**

మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు-దంతాలను తెల్లబరచడానికి ప్రపంచంలో సర్వోత్తమమైనది - ప్రకృతి సిద్ధమైన దుర్గంధ నివారిణియగు క్లోరోఫిల్ చేర్చబడినదికూడా లభిస్తుంది.




## మెక్లీన్స్

### పెరాక్సైడ్ టూత్‌పేస్టు దంతాలను ధవళతరమొనర్చుతుంది

MTY-32-TEL

యొక్క జంగమ స్వరూపమగు శక్తియే ఎక్కువ యావశ్యకము.

కళాదృష్టితో భావించుటచే, పరబ్రహ్మము ఈశ్వరుడుగా మారుచున్నట్లు పైన చెప్పబడినది. అట్టి యీశ్వరుని పరమేశ్వరిగాను, శక్తిరూపిణిగాను భావన చేయుట అంతకంటె యొక్కువైన కళాసృష్టి యని చెప్పక తప్పదు. తండ్రులంటే భయము, తల్లులంటే ప్రేమ మనకు సాధారణము. అందుచేత పితృస్వరూపుడగు దేవునికంటె మాతృదేవతయగు దేవియే మన హృదయముల నాకర్షించుచుండును. మరియు, దేవత్వమునకు స్త్రీత్వ మారోపించుటచేత, లావణ్యమునకు, సౌందర్యమునకు, కళకు, కవిత్వమునకు ఎక్కువ యవకాశము కలుగుచున్నది. కావుననే, దేవీపరమైన లలితా సహస్రనామ స్తోత్రనామకల్పనయందు, కవిత్వము, అద్భుత కల్పన, మతము, తత్వశాస్త్రము, నిగూఢవిద్య, మనోధర్మశాస్త్రము, ఒకదానిని మించి యొకటి తోడ్పడగలిగినవి. లలితాదేవిని గురించిన పురాణగాథ, భండాసురవధ మాత్రమే గాక, శ్రీవిద్యా తత్వము, ఆచరణ విధానముకూడ ఈ స్తోత్రమందు కూర్పబడినవి. శుద్ధమైన కవిత్వ భావములను వేదాంత పరిభాషతో చక్కగా మేళవించి, నిర్మల భక్తిపూరితముగా, ఈ స్తోత్రము వ్రాయబడినది. ఇదియే దీని విశిష్టత. ఈ గ్రంథ రచనావిషయమున, గ్రంథకర్త తప్పించుకొనవలసిన ప్రమాదములు రెండుకలవు. ఇటీవలివారగు వంగదేశకవులు దేవీపరముగా వ్రాసిన ఆగమని కీర్తనలవలె కేవల మైహిక రచనగా సహస్రనామస్తోత్రము పరిణమించుట మొదటి ప్రమాదము. అతఃపూర్వమే వ్రాయబడిన శుద్ధతాంత్రిక విధానవివరణ మాత్రముగా పరిణమించుట రెండవ ప్రమాదము.

ఈ రెంటికిని పాలుగాకుండ గ్రంథకర్త తప్పించుకొనగలిగినాడు. కేవలము వేదాంతశాస్త్ర శుష్క పరిభాషతో నిండియుండకుండ ఈతని కవిత్వము సర్వత్ర భక్తిరసపూరితమై యున్నది. అధ్యాత్మతత్వము గురించియు, చిక్కైన యాచారకాండను గురించియు వ్యాఖ్యానించు ఘట్టములయందు కూడ, సాధారణ ఘట్టములయందు వలెనే, కండ్లు మిరుమిట్లుగొలుపు దేవీ దివ్యసౌందర్యమును అద్భుతముగా చిత్రించునపుడును, మానవ హృదయములయందు దాగియున్న భావములను గుర్తించి వర్ణించునపుడును, గ్రంథకర్త కవితాధార పొంగిపొరలుచుండును. అందుచేతనే ఈ స్తోత్రమందలి దేవి కేవలము భావనారూపిణియై ఆకాశమున కెగిరి యందులీనమై యగోచరయును కాదు. భూమిమీదకు దిగి మనుష్యరూపమును దాల్చిన ప్రత్యక్షయును గాదు. దుష్టశక్తుల నణచుటకై దేవతాసమూహమున కధినాయకియై యెల్లపుడును దివ్యసౌందర్యముతో దేవి వెలకొని యుండును. ఆమె ఉత్సాహరహిత యగు కన్యగాదు; భర్తయగు కామేశ్వరునియందు గాఢానురాగము గల యువతీలలామ. సంతానమును ప్రేమించుచు వారు చేయు సాహసకృత్యములకు గర్వించునట్టి మాతృదేవత. నిత్యయౌవని; ఉదయభానుని బోలిన రక్తిమ కలది. ఆమె ధరించిన రత్నభూషణముల కాంతి నక్షత్రకాంతిని మించియుండును. ఆమె నిశ్వాసము కర్పూరవాసనల జిమ్ముచుండును. ఆమె కంఠస్వరము, సరస్వతీదేవియొక్క వీణానాదమును మించిన తియ్యందనము కలది. ఆమె శరీరము మంచి గంధమువలె పరిమళించుచుండును. చంపకాశోక పున్నాగాది పుష్పములయం దామెకు మిక్కిలి ప్రీతి. వాటిని నిత్యమును కొప్పున ముడుచుకొనుచుండును. ఇంతయేల ఆ దేవియే దేవతాసుమ మని కవి వర్ణించియున్నాడు. బంధూక పుష్పమువలె, దానిమ్మ కుసుమమువలె, చీనా గులాబీ పూవువలె కాంతులను ఆమె వెదజల్లుచుండును. కాని ఈ పుష్పములయందు కంటె చైతన్య కుసుమములయం దామెకు అధిక ప్రీతి. కవిత్వమందు, నాట్యమందు, సంగీతమందు, వేదగానమందు ఆమె కత్యంత ప్రేమ. సర్వకళలకు ఆమె ఆటపట్టు, అన్ని రసములకు నిధానము. ఇంతేకాదు ఆమె సకలశ్రుతులయొక్క సారము. వేదములయందు నిగూఢముగా వెలకొనియున్న వెలలేని ఆణిముత్యమని ఆమెను కవి వర్ణించియున్నాడు. వేదములు దేవికి ప్రణమిల్లి ఆమె పాదధూళిని తమ శిరములయందు దాల్చుకొనునట. కారణ మేమన, ఆమె మాతృశ్రీ గాదా మరి? ఇక ఉపనిషత్తు లేమని ఘోషించుచున్నవి? ఆమె మహత్తునే చాటుచున్నవి. స్వర్గమందలి శ్రేష్ఠతములైన దేవతలచే పూజల నందుకొనుచుండినను సర్వసామాన్యులగు కృషికులు, బాలురు మొదలగు వారి పూజలనుకూడ ఆమె అందుకొనుచుండును. ఆమె యనుగ్రహము బహుసులభసాధ్యము. ఆమె దయ కలుగుటకు మన యోగ్యతలు అనావశ్యకములు. ఆమె మన యజ్ఞానాంధకారమును తొలగజేయుజ్యోతి. నిస్సారమై ఎండిపోయిన భూమివంటి సంసార జీవితమునకు ఆమెకృప అమృతధారావర్షము వంటిది. దురదృష్టము లన్నింటిని ఎగరగొట్టగల ఝంఝామారుతమువంటిది. పర్వతాకారములుగ పెరిగిన పాపములను బ్రద్దలగొట్టగల పిడుగువంటిది. ఆమె భక్తులపాలిటి కల్పతరువు, కామధేనువు. ఇంతేకాదు, భాగరహిత, నిత్యస్వతంత్ర, నిత్యనిర్మలః

నిరాకార, నిత్య, నిష్కారణ, నిరంజనయునై హద్దులు లేనట్టి ఏకాకృతిని వెలుగు పరమాత్మ స్వరూపిణియే ఆమె. మరియూ నామె సర్వతత్వములకు, సిద్ధాంతములకు, ద్వంద్వములకు, అతీతమైన కడపటిసత్యము. దేవీపరమైన ఇట్టి మహత్తర భావములు ఒక్కసారి పుట్టినవి కానేరవు. చిరకాల నిరంతర భావనా పరిణామఫలములై యుండవలెను. అనాది కాలపు అనాగరిక జాతులవారియొక్క దేవతలగురించిన భావనలు వీటికి మూలములై యుండవచ్చును. ఇతరుల మతములయొక్క, పూజా పునస్కారముల యొక్క, ప్రారంభదశను గురించి పరిశీలన సల్పు కొందరు విమర్శకులు, వాటి అల్పత్వమును, అనాగరకతను, ఎత్తిచూపుచుందురు గాని, అవి ఎట్లు క్రమాభివృద్ధి చెందినది గుర్తించరు. చెట్టుయొక్క యోగ్యతను దాని ఫలములనుబట్టే గ్రహించవలెను గాని దాని వ్రేళ్లనుబట్టికాదు. దుర్వాసనగల పెంటలోను, నేలలోను వ్రేళ్లు పాతుకుని పోయియున్న చెట్టుయొక్క పండ్లు సువాసన లీనుచు, తియ్యగా ఉండవచ్చును. వివిధప్రదేశములయందు, వివిధకాలములలో, వివిధ జాతులవారు పూజలొనర్చిన దేవతలయొక్క, అమ్మవార్లయొక్క స్వరూప స్వభావములయందలి నిగ్గును తీసి, చేర్చి, సమీకరించుటచేతనే, అద్భుతమైన ఇట్టి ఏకైక దేవీస్వరూపము చిత్రింప సాధ్యమైనదని విమర్శకుల యభిప్రాయము. ఇట్లు చిత్రింపబడిన దేవీస్వరూపము కవితాశక్తిచేత, మతములోని, తత్వశాస్త్రములోని సారాంశములచేత, విశుద్ధముగా సంస్కరింపబడి వన్నెకెక్కినది. అన్నింటికంటె విశేషమేమనగా, మృదుమధురమగు హైందవ స్త్రీ స్వభావమందలి అద్భుతమైన మనోహరత్వముతోను, సౌందర్యముతోను, దేవియొక్క స్వరూపము ప్రకాశించుచుండును. ఒకప్పుడు ఏనీబీసెంటు సతి హైందవ స్త్రీలగురించి ప్రసంగించుచు, సహజమగు ఉపన్యాస ధోరణిలో "వీరిని మించిన సుందరతర పుష్పములు భూమియందెన్నడును వికసించియుండలేదు." అని చెప్పెను. ఇట్టి విశేష భావనలకు మూలమై, దివ్య పరిమళ సౌందర్యములను వెదజల్లునట్టి స్వర్గకుసుమమే లలితాదేవి. దిత్యజీవితములలోని స్త్రీరత్నముల ఆదర్శ స్వభావములను ప్రత్యక్షముగా చూచిన, ఉత్సాహపూరితులైన కవులు గాని లలిత, సీత, సావిత్రి మొదలగు దివ్యస్త్రీలను సృష్టించియుండలేరు. లలితా సహస్రనామము వ్రాసిన కవి సంప్రదాయము, చరిత్ర, మతము, తత్వశాస్త్రమునుండి గ్రహించిన విషయములతో సమానముగా, లోకానుభవమునుండి కూడ కవితాసామగ్రిని సమకూర్చుకుని యున్నాడనునది నిర్వివాదాంశము. సంఘజీవితము పరిణతి చెందని దినములలో కూడ ప్రతిస్త్రీయును దేవతాంశ సంభూతురాలని, సర్వదా పూజ్యురాలని, సిద్ధాంతమును పెంపొందించుకున్న భారతావనిలో ఈ కవి తన జీవితమును గడపిన వాడనుమాట, మనము జ్ఞప్తిలో ఉంచుకోవలసి యున్నది. అబలలగు స్త్రీల శీల సంరక్షణ, తమ ధైర్యసాహసాది కృత్యములచే కాపాడుట విధ్యుక్తధర్మమను భావము ఐరోపాదేశమందలి మధ్యయుగములోని పురుషులలో ప్రబలియుండెను. అట్టి పురుషుల హృదయములలో, స్త్రీలయెడ ఉదయించు సంకల్పములకంటె, భారతీయుల సిద్ధాంతములవలన కలిగిన చిత్తవృత్తులు పవిత్రములై యుండి తీరును. కుబ్జికాతంత్రమందిట్లున్నదని ఉడ్రాఫ్ దొర ఉదహరించియున్నాడు. "స్త్రీపాదములను చూచిన వారందరు వాటిని గురుపాదములుగా ఎంచి సదా పూజించవలెను"—స్త్రీణాం పాదతలం దృష్ట్వా గురువద్భావయేత్సదా—.

## 5

పైన పేర్కొనబడిన పరిణామక్రమమువంటిదే మరియొకటి అంతకు పూర్వమే సంభవించినది. అనేక దేవతలు వేదమందు చెప్పబడిరి. ఈయనేకత్వభావము క్రమముగా మారి, సర్వోత్కృష్టుడైనవాడు—విష్ణువు గాని, శివుడు గాని—ఒక్కడే దేవతయను మతము నెలకొన్నది. వేదమందలి దేవతలకు నిర్ణీతములగు భేదములు లేకపోవుటచే ఒక్కొక్క దేవతయు ఇతర దేవతలలో లీనమైపోయెను. అట్లే వివిధదేవీస్వరూపముల యందలి భేదములును నశించినవి. "ఏకమ్ సత్ విప్రా బహుధా వదంతి" (సత్య మొక్కటే; జ్ఞానులు దానినే అనేక రీతుల పలుకుదురు.) అను ప్రసిద్ధ వేద వాక్యము మొదట వివిధ దేవతల, తరువాత వివిధ దేవులకు కూడ సమానముగా వర్తించెను. హిరణ్యకశిపుడు, రావణుడు, శిశుపాలుడు మొదలగు దుష్టులను సంహరించుటకై విష్ణుమూర్తి ఎట్లు అనేకసార్లు అవతరించెనో అట్లే దుష్టశిక్షణకై దేవి కూడ యనేక యవతారముల నెత్తెను. మహిషాసురుని మర్దించుటకై చండీశ్వరిగాను, చండుని, ముండుని సంహరించుటకై కాళికాదేవిగాను, భండుని, అతని కొడుకులను చంపుటకై యజ్ఞకుండమునుండి లలితా మహాదేవిగాను అవతరించెను. వివిధయుగములయందు అవతారములను, ఎందుకెత్తుచుండెనో తెల్పునట్టి శ్రీకృష్ణభగవానుని ప్రసిద్ధ గీతావాక్యమును పోలిన ఈ క్రింది వాక్యము దేవీ మాహాత్మ్యములో చెప్పబడినది. "లోకమున కెప్పుడు

దానవులచే బాధ కలుగునో అప్పుడు నే నవతరించి శత్రువుల సంహరింతును."

ఇట్లు రెండు విధములగు ఏకేశ్వర మతములు పొడసూపినవి. ఒకటి పరమేశ్వరుని యాధారము కలది. రెండవది పరమేశ్వరి యాధారముగా కలది. ఈ రెండును లింగభేదము లేని పరతత్వముయొక్క చిహ్నములు మాత్రమే యని నిర్ణీతమైన విషయమే.

# 6

తొలి వేద వాఙ్మయమందు సర్వోత్కృష్టులగు దేవి గాని, దేవుడు గాని కానరారు. ఉషస్సు, రాత్రి, వాక్కు, పృథ్వి, సరస్వతి వంటి కొందరు దేవులు, దేవతల భార్యలగు ఇంద్రాణి, వరుణాని మొదలగువారు కొందరు, కనబడుదురు. వీరందరు, అధికారమందు క్రిందిమెట్టునకు చెందినవారే. కాని వేదకాలముయొక్క తుదిభాగమున సర్వోత్కృష్టులగు ఒక దేవి, ఒక దేవుడు పొడచూపు చిహ్నములు గోచరించుచున్నవి. ఇంద్ర, సూర్య, వరుణుల లక్షణములను తనయందు సమన్వయించుకొని విష్ణువు ఎట్లు ఉత్కృష్టస్థానము పొందినాడో, అట్లే, వాక్కు మొదలగు దేవుల లక్షణము లన్నింటిని తనయందిముడ్చుకొని రుద్రాణి ఉత్కృష్టపదవిని పొందినది. ఉదాహరణకు — తైత్తిరీయారణ్యమందు కాత్యాయనీ, కన్యాకుమారీ, దుర్గాయని మూడు వేరువేరు పేర్లతో దేవి పేర్కొనబడినది; బ్రహ్మవిద్యారూపిణి యగు ఉమాహైమవతి, కేనోపనిషత్తులో దేవితో అవినాభావమును పొందినది; ముండకోపనిషత్తులో అగ్ని జిహ్వానామములుగా వాడబడిన కాళి, కరాళి యను పదములు కొంతకాలమునకు దేవీపరముగా వాడబడినవి. వివిధములగు దేవుల లక్షణము లన్నింటిని ఒక్క దేవియందు సమన్వయించునట్టి ఈ విధానము వేదయుగమందే ప్రారంభమై ఇతిహాస యుగములో క్రమముగా పెరిగి తుదకు దేవ్యుపాసనా మతముగా పరిణమించినది. ఈ దేవీమతము, పురాణయుగ ప్రారంభమునాటికి, వైష్ణవ, శైవ మతములతో సమాన ప్రతిపత్తి కాంచినది. ఈ విషయమును తెలుపుడు చేయునట్టి దుర్గాదేవీ స్తవములు రెండు మహాభారతమున కలవు. విరాటుని రాజ్యమున ప్రవేశించబోవు సమయమున యుధిష్ఠిరు డొనర్చిన స్తవము మొదటిది. భగవద్గీతా ఘట్టము ప్రారంభ మగుననగా కురుక్షేత్ర యుద్ధభూమియందర్జును డొనరించిన స్తవము రెండవది. దక్షిణ హిందూదేశమందలి శుద్ధమైన వ్రాత ప్రతులయందీ రెండు స్తవములు లేకుంటనుబట్టి, ఇవి ప్రక్షిప్తములని చెప్పవలసియున్నది. ఐనను ఇవి శ్రద్ధగా పరిశీలించతగిన విషయములు. దేవి, కన్యయని, పాతివ్రత్య వ్రతమును పూనియున్నదని, మొదటి స్తవములో కలదు. మరియు, వింధ్యాద్రియామె నిత్యనివాసము. ఆమెయే దుర్గ, కాళి, మహిషాసుర నాశిని. సురాపానమందు, మాంసభక్షణమందు, బలియైన జంతువులయందు ఆమెకు ప్రీతి. ఐనను విద్యా, సిద్ధి, కాంతి మొదలగువారితో ఆమెకు సమైక్యము కలదు. రాతి రేలపై కంసునిచే విసిరి కొట్టబడినప్పుడు ఆకాశమున కెగిరివెళ్ళిన కృష్ణ సోదరియు, యశోద బిడ్డయు ఈమెయేయని స్తోత్ర ప్రారంభమందు కలదు. అర్జును డొనర్చిన దేవీ స్తవమింతకంటె వినోదకరముగా ఉన్నది. విచిత్ర మేమి యన, కృష్ణుని ప్రేరేపణవల్లనే అర్జునుడు రథము దిగి యుద్ధమందు విజయము చేకూర్చుమని దేవిని ప్రార్థించెను. దేవి ప్రత్యక్షమై విజయమగునని యభయ మిచ్చును. కుమారీ, కాపాలీ, కపిలా, భద్రకాళీ, మహాకాళీ, చండీ, కాత్యాయనీ, కరాళీ, కౌశికీ, ఉమా, శాకంభరీ, మోహినీ, మాయా, మొదలైన పెక్కు నామములతో దేవిని సంబోధించుట ఈ స్తవమునందు గుర్తించతగిన విషయము. గొల్లకులమున, నందునింట కృష్ణసోదరియై జన్మించినట్లు ఇందు కూడ వివరింపబడినది. నానావిధ రత్నభూషితయై, డాలు, కత్తి, బల్లెము అను ఆయుధముల ధరించి సమరోత్సాహినియై ఆమె మహిష రక్తపానమొనరించుచుండును. దుర్గమము, దుర్లభము, భయావహములగు తావులయందే కాక, చైత్యములయందును, భక్తుల నివాసములయందును కూడ నామె నివసించును. పాతాళమందుకూడ వసించి యందలి పిశాచములను జయించును. ఇందు నామె కన్యయని చెప్పబడలేదు సరిగదా స్కందుని తల్లియని చెప్పబడినది. వేదమాతయనియు, విద్య లన్నింటిలో మేలైన బ్రహ్మవిద్య కధిష్ఠాన దేవతయనియు దేవి కొనియాడబడినది.

మరియు, విష్ణుపురాణమందు, దేవినిగురించి చోద్యములగు వాక్యములు కొన్ని కలవు. విష్ణుమూర్తి కృష్ణావతారమెత్తు నవసరమున, ఇట్లు నడుచుకొనవలయునని తన యోగనిద్ర కుత్తరువు వేయును. "ఉదయమున, సాయం సమయమున, ఆర్యా, దుర్గా, వేదగర్భా, అంబికా, భద్రా, భద్రకాళికా, క్షేమీ లేక క్షేమకరీ యని భక్తితో నిన్ను ప్రార్థించినవారికి నా యనుగ్రహముచే కోరికలు ఫలించగలవు. సారాయి, మాంసము మొదలగు నైవేద్యములతో సంతృప్తురాలవై మానవుల ప్రార్థనల నంగీకరించు

చుండుము. నా దయచే నీయందు మానవులందరు నిరంతర భక్తియుక్తులై యుందురు. ఓ దేవీ! ఇది నమ్ము, పొమ్ము, నా యాజ్ఞానుసారముగా వర్తించుము."

దేవిని గురించిన భావనయొక్క ప్రారంభముల గురించి తెలియజేయు స్తుతి యొకటి హరివంశమున నున్న దానిని తుని యుదాహరణగా నిచ్చుచున్నాను. కృష్ణ సోదరియని, వింధ్య పర్వతములందలి నానావిధ భయంకర స్థానములలో—గుహాలలో, అరణ్యములలో, వనములలో—నివసించునని, శబరులు, బర్బరులు, పుళిందులు మొదలగు అడవిజాతులవారి చేత ఎక్కువగా దేవి పూజింపబడుచుండునని ఇందు వివరింపబడియున్నది. ఇంతేకాదు వేదములు పేర్కొన్న స (సా ?)విత్రి ఈమె యని కూడ చెప్పబడినది. బ్రహ్మజ్ఞానియని, పరబ్రహ్మమేయని స్తుతింపబడినది.

"వైష్ణవమతము శైవమతము మొదలగునవి"—యను పుస్తకములో ఈ తొలిస్తోత్రముల గురించి గ్రంథకర్తయగు భండార్కరు ఈ క్రిందిరీతిని వ్యాఖ్యానించినాడు:—

పెక్కు పేరులుగల ఒక దేవతకలదని ఇందలి వివరణవలన కనబడుచున్నది. కాని పరిశీలన దృష్టి కలవారికి ఇవి కేవలము పేరులేకావని, వివిధదేవతల సూచించు నామములని, చారిత్రిక పరిస్థితులనుబట్టి నానావిధ దేవతల భావనలు కలిగినవని, కాలక్రమమున ఈ దేవతలందరు ఒక్క దేవీస్వరూపమందు లీనమైపోయినారని, ఇట్టి పరిణామము హైందవుల కలవాటైన మానసిక విధానమే యని, స్పష్టము కాగలదు."

పండితుడైన ఈ గ్రంథకర్త సూచించిన దాని కంటె అధికముగు విషయము కొంత కలదని విమర్శన దృష్టికి గోచరించకపోదు. వివిధజాతులవారి దేవతలను ఒక్క పరాశక్తితో సమన్వయము చేయునట్టి మానసిక విధానమే కాక—వానివాని ప్రత్యేకతలను చాలవరకు నిలుపుకొనిచ్చుచు, దేశమందలి వివిధ మతములను, సంస్కృతులను, వేదముయొక్క పరిరక్షణ క్రిందకును, వేదాంత తత్వసంబంధమగు పారమార్థిక సంస్కారాధికారము క్రిందకును తేగలిగినట్టి, నాటి కాలపు హిందువుల మానసిక విధానముకూడ—గోచరించి తీరును. ఏమనగా, సురాపానమందు, మాంస భక్షణమందు, కొండజాతులవారు సమర్పించు బలుల యందు, ప్రీతికలిగి పర్వతదుర్గములయందుండు అట

వికుల అమ్మవారు, వేదమాతయని, బ్రహ్మవిద్యాధిష్ఠాన దేవతయని, పరబ్రహ్మమేయని పొగడ్తపొందుచు వచ్చినది. ఈ యంకురములే దేవీమాహాత్మ్యమందు, లలితా సహస్రనామమందు, మహత్తరముగు ప్రత్యక్ష దర్శనములుగా పెంపొందినవి. ఇట్టి యభివృద్ధి సాగినకొలది, ఆదిస్తోత్రములయందు చెప్పబడిన పర్వతదుర్గములు, చొరరానిచోట్లు, బలియీయబడిన ప్రాణులు, మత్తు కలిగించు సారాయిలు, క్రమముగా సన్నగిల్లి, పొంగి పొరలు అధ్యాత్మికప్రవాహములో అచ్చటచ్చట మసకమసకలుగా మాత్రము కన్పట్టుచుండును. అందుచేతనే, ఆదిస్తుతులకంటె ఎంతో మహత్తరస్థితిలోనున్న లలితా స్తుతియందు కూడ సహస్రనామములలో అచ్చటచ్చట పూర్వ లక్షణముల ప్రతిధ్వనులు వినిపించుచుండును. లలితా దేవి వింధ్యపర్వతమునందుండునని (వింధ్యాచలనివాసినీ) ఆసవప్రియమని (కాదంబరీప్రియా) నిషాతో నుండునని (వారుణీమదవిహ్వలా, మాధ్వీపానాలసా) సహస్రనామములలో వినిపించుచుండును. కాని, దేవియొక్క అద్భుతసౌందర్యము, దుష్టశక్తులతో పోరాడగల శౌర్యము, వివిధములును, అమితములునైన యామె మహత్తులు, మానవ హృదయములయందామెకు గల విశాలాధికారము మొదలగు నూతన విషయములగురించిన వర్ణనాప్రవాహములో కేవలము పరంపరాగతములైనట్టి పెక్కు విశేషణములు మనస్సులో నిలువనేరవు. ఒకయుదాహరణము చూడుడు. ఆదిస్తుతులలో కాంతారవాసిని యని చెప్పబడిన యామె లలితాస్తుతిలో మునుల మనస్సులయందు సంచరించు హంస (మునిమానసహంసికా) యని చెప్పబడినది.

## 7

మార్కండేయ పురాణాంతర్గతమై, సుప్రసిద్ధమైన చండీమహాత్మ్యములో, మహిషాసురునితోను, శుంభనిశుంభులతోను పోరాడుఘట్టమందు దేవియొక్క స్వరూపస్వభావములలో ఒక విశిష్టపరిణామదశ గోచరించుచున్నది. ఆమె పుట్టుకగురించిన కథయే ఈ నూతన పరిణామచిహ్నముగా నున్నది.

ఒకానొకప్పుడు దేవాసురులలో 'ఎడతెగని యుద్ధము సంభవించెను. దేవతలపై ఇంద్రుడు అసురులపై మహిషుడు ఆధిపత్యము వహించిరి. దేవతల నోడించి మహిషాసురుడు సర్వాధికారి యయ్యెను. పరాజితులైన దేవతలు విష్ణుమూర్తి కడకు, శివుని యొద్దకుపోయి తమకు కలిగిన పరాభవమును చెప్పి

కానగా శివ విష్ణువులు కోపోద్దీపితులైరి. వారినోళ్ల నుండి గొప్ప తేజస్సు వెలువడెను. అప్పుడు ఇతర దేవతల దేహములనుండికూడ గొప్ప శక్తులు పుట్టినవి. ఈ తేజశ్శక్తులన్నియును కలిసిపోయి ఒక స్త్రీస్వరూపమును పొందినవి. దేవతలందరు సంతోషించి ఒక్కొక్కరొక్కొక్క యాయుధమునో, యాభరణమునో యామెకొసగిరి. బహుమానముల నన్నింటి నంగీకరించి, హిమవంతుడు కానుకగా నిచ్చిన సింహము నెక్కి, బిగ్గరగా సింహనాదము చేసి, శత్రువులతోడి కయ్యమునకు దేవి కాలు ద్రవ్వెను. గర్జనమును విన్న యసురులు మహిషాసురుని ముందిడుకొని చేరబడిరి. దేవాసురులమధ్య తీవ్రయుద్ధము చెలరేగెను. పైకి విసరబడిన పెక్కు ఆయుధములయొక్క కాంతులచేత ఆకాశమంతయు ప్రకాశమాన మయ్యెను. సురాపానముచేత పుష్టిని చేకూర్చుకొన్నదై దేవి ఎట్టకేలకు మహిషాసురుని పైకెగిరి, కాలితో వాని మెడ తన్ని, బల్లెముతో పొడిచి, కత్తితో తల నరికెను. అసురుని సగము చచ్చినవానిగా నొనర్చిన దేవీపాదఘట్టన విషయ మిందు చాల ముఖ్యమైనది. బాణుని చండికాశతకమంతయు ఇంచుమించుగా ఈ విషయము నాధారముగా జేసికొని వ్రాయబడినదే. బాణుని కావ్యములో దేవికంటె, ఆమె పాదమే ఎక్కువగా స్తుతి చేయబడినది. మహిషాసుర వధానంతరము దేవతలు, ఋషులు ఒకచోట గుమిగూడి, వారికి కలిగిన విమోచనమునకు కృతజ్ఞతను దెల్పుచు, దేవిని కీర్తించిరి. ఇటువంటి యాపద తటస్థించినప్పుడెల్లను, తమకు సహాయపడెమని ఆమెను వరమడిగిరి. "అట్లే అగుగాక" యని చెప్పి దేవి యదృశ్యమయ్యెను.

తమ్ము జయించి స్వర్గమునుండి తరిమివేసిన శుంభ నిశుంభుల నెదిరించుటకై సహాయము చేయమని, దేవతలు దేవిని ప్రార్థించునట్టి మరియొకఘట్టము తరువాతి కథలో వర్ణింపబడినది హిమాలయ పర్వతములయం దట్లు దేవతలు ప్రార్థించుచున్న సమయమందు, గంగాస్నానార్థమై పార్వతి యచట కరుగుదెంచి "ఎవరికొఱకీ ప్రార్థనలు" అని ప్రశ్నించెను. తక్షణమే ఆమె దేహమందుండి అంబిక ఉద్భవించి "శుంభ నిశుంభులచే పరాజితులై దేవతలు నాకొఱకై ఈ స్తోత్రములను చేయుచున్నారు" అనెను. ఇట్లు నూతనముగా అవతరించిన దేవి అతి సౌందర్యవతిగా నుండెను. ఆమె తేజస్సు ఆకాశమునంతను కాంతివంత మొనర్చెను. చండుడు, ముండుడు అను సేవకులీ వృత్తాంతమును శుంభ నిశుంభులకు తెలిపిరి. అంతట, తనను పాణిగ్రహణము చేసికొమ్మని దేవికి శుంభుడు వర్తమానమంపెను. బహిరంగ పోరాటములో ఏ ధీరుడు తన్నోడించగలడో అట్టి వానిని గాని వివాహమాడనని శపథము పూనియుంటినని ఆమె ప్రత్యుత్తరమంపెను. తన్ను వివాహమాడదలచినచో తక్షణమే వచ్చి తనతో పోరాడవలసినదనెను. ఈ సవాలును సంతోషపూర్వకముగా రాక్షసు డంగీకరించెను. పోరాటము ప్రారంభమయ్యెను. మహిషాసురునితోటి పోరాటముకంటె ఇది దీర్ఘముగాను, తీవ్రముగాను జరిగెను. యుద్ధము కొంత సాగుసరికి దేవి శరీరమంతయు రౌద్రోద్రేకముచేత నైల్యమును పొంది, ఆమె ఫాలభాగమునుండి ఘోరాకారముగల కాళి పుట్టుకవచ్చెను. వ్యాఘ్రచర్మమును తొడుగుకొని, పుర్రెలమాల ధరించి, శత్రురక్తమును త్రాగుటకై నాలుకను పైకి వ్రేలాడవేసికొనియుండెను. పోరాటము మిక్కిలి ఘోరమయ్యెను. రాక్షసుల నణగద్రొక్కుచు, మ్రింగుచు, పీనుగుల రక్తమును త్రాగుచు, యుద్ధభూమియందు కాళి రౌద్రతాండవ మొనర్చెను. చండుని, ముండుని సంహరించుటచేత కాళికి చాముండి యను బిరుదును అంబిక యిచ్చెను. ఇట్లు తన కర్తవ్యమును నెరవేర్చిన కాళి చండి శరీరమందు లీనమైపోయెను. అంతట నిస్సహాయముగా రాక్షస ప్రముఖులైన శుంభ నిశుంభులనిద్దరిని చండి రూపుమాపెను. యుద్ధము ముగిసెను. దేవతలందరు తిరిగి స్తోత్రములు చదివిరి. దుష్టరాక్షసులను సంహరించుటకై తిరిగి తిరిగి తాను భావికాలమందవతరించగలనని వాగ్దానమును చేసి దేవి యదృశ్యమయ్యెను.

## 8

ఈ చండీ మహాత్మ్యగాథలో దేవీపరము లగు స్తోత్రములు నాల్గు కలవు. ఇంతకు పూర్వపుస్తోత్రముల కంటె ఇవి విశేషములు కలవి. మొదటి పైన వివరించినట్టుగా దేవి యవతారమే భావగర్భితమైనదనుట. వివిధ నామములు మాత్రము కలది కాదని బ్రహ్మ, విష్ణు, శివులతో కూడిన దేవతలందరియొక్క మహిమాసారమే చండియని సూచింపబడుట. సాత్వికాకారములుకొన్ని, ఘోరాకారములు కొన్ని కలదానినిగా దేవిని వర్ణించుట రెండవది. మూడవది— ఇంతకు పూర్వము చేయబడిన స్తోత్రములలో ప్రజలను ఆపదలనుండి, కష్టములనుండి తొలగించునదిగా దేవి చెప్పబడినది. కాని ఈ స్తోత్రములయందు సంసారసాగరమును దాటుటకై సహాయపడునదిగా వివరింపబడినది. మరియు ఇహమందైశ్వర్యమును, పరమం

దపవర్గసుఖమును సంసారమునుండి మోక్షమును ప్రసాదించ గల సమర్థురాలు దేవియని స్పష్టపరుపబడినది. నాల్గవదేమనగా దేవి సర్వాంతర్యామిని యని నొక్కి వక్కాణింపబడినది. "యా దేవీ సర్వ భూతేషు" యని ప్రారంభము గల శ్లోకములు ఇరువదికి పైగా ఇందలి ఒక స్తోత్రములో కలవు. సర్వభూతములయందు చైతన్యముగాను, శక్తిగాను, బుద్ధిగాను, జ్ఞప్తిగాను, ఇచ్ఛగాను, ఇంకను వివిధరీతులగాను దేవి అంతస్థయై యున్నదని ఈ శ్లోకములయందు కలదు. తుది విశేషమేమన - ఆమెకు విష్ణువునకు గల బాంధవ్యముగురించి విశేషించి చెప్పబడినది. తొలి స్తోత్రములయందువలె విష్ణుమాయయని, కృష్ణసోదరి యని మాత్రమే గాక, నారాయణి యని పదియేడు శ్లోకములలో పేర్కొనబడినది. మరియు విష్ణ్వవతారములయందు వ్యక్తమైన శక్తియే ఈమెయని అభేదము చెప్పబడినది. ఇట్లే బ్రహ్మయొక్క, మహేశ్వరునియొక్క, కుమారస్వామియొక్క, ఇంద్రుని యొక్క శక్తులస్వరూపము ఈమేయని వర్ణింపబడినది. ఈరీతిగా శక్తి మత ప్రారంభము లిందు గోచరించుచున్నవి. కాలక్రమమున ఈ ప్రారంభములే అద్భుతమైన దేవీ పూజా విధానముగా వృద్ధి చెందినవి.

## 9

తాంత్రిక గ్రంథరచనలు పెరిగినకాలములో దేవీమతమందు నూతనాధ్యాయము ప్రారంభమైనది. లలితాసహస్రనామము, దేవీభాగవతము, సౌందర్యలహరి, తరువాతివగు శాక్తోపనిషత్తులు, మరియు తంత్రములు ఈ నూతనాభివృద్ధి సూచకములు. ఈ కాలము క్రీ. శ. ఏడవశతాబ్దముతో ప్రారంభమైనదనవచ్చును. శాక్తేయగ్రంథములు శివశక్తుల సంవాదములతో నిండియుండును. ప్రాతపురాణములవలె గాక ఇవి శక్తిమతతత్త్వమునకు, కర్మకాండకు పూర్తిగా వినియోగింపబడినవి. తంత్రముయొక్క సరియైన నిర్వచనమందీ నాలుగు విషయములు ఇమిడియుండవలెను—(1) జ్ఞానము—అనగా తత్త్వసిద్ధాంతములు (2) యోగము—అనగా ధ్యానవిధానము (3) క్రియ—అనగా కర్మవిధానము (4) చర్య—అనగా నడవడి, సాంఘిక విధులగురించిన ఉపదేశములు. కాని, మొత్తము అరువదినాలుగింటిలో బహు కొద్ది సంఖ్యగల తంత్రములే యీ నియమమును పాలించుచున్నవి. తంత్రములు ప్రధానముగా సాధన శాస్త్రములు; తీవ్రానుష్ఠానము లక్ష్యముగాగలవి. ఇవి అద్వైతవేదాంతమును సామాన్యముగా ఆమోదించును; ఆ వేదాంతలక్ష్యమగు ఆత్మసాక్షాత్కారమును పొందు మార్గములను, సాధనలను సూచించును. ఐనను పరమసత్యమును నిరూపించు వేదాంత సూత్రములలోను, సృష్టిక్రమములోను ప్రతిపాదించిన వివరణలు దేవీ పూజావిధానమందు ఆశ్చర్యకరమగు నూతనమగు మార్పులకు దారితీయుచున్నవి. అద్వైతమందువలె తాంత్రిక తత్త్వశాస్త్రమందు కూడ పరమ సత్యము పరమ శివస్వరూపముగా పేర్కొనబడినది. పరమ శివుడు సకలుడుగాను, నిష్కలుడుగాను కూడ భావింపబడినాడు. అద్వైతమందువలెనే ఈ ప్రపంచమంతయు ఒకవిధముగా కల్లయని భావింపబడినది. ఎట్లన, మాయతో కూడిన బ్రహ్మను శక్తియుతమగు శివునిగా తాంత్రికులు భావించిరి. అట్టి బ్రహ్మయొక్క సృష్టి యీ ప్రపంచకము గాన మిథ్యయగుచున్నది. కాని, అద్వైతమందు మాయను నిజమని గాని, కల్లయని గాని నిర్వచింప వీలులేదు. తాంత్రిక తత్త్వమందు శివుడెంత సత్యమో శక్తికూడ అంత సత్యమే. ఇద్దరకు అవినాభావమే. అవినాభావమగు శివశక్తిస్వరూపమందు బైటకు గోచరించు మార్పులే ఈ ప్రపంచము పొందు మార్పులగుటచేత అవి నిజమైనవి కావని, పూర్ణసత్యమగు శివశక్తి తత్త్వమందలి భేదములగుటచే ఆ మార్పులు సత్యములేయని చెప్పనగును. మార్పులు నిజముగా లేవని, ఉన్నట్లు కనపడుచున్నవని అద్వైతము చెప్పుచున్నది. పరమ సత్యమొకవంక మార్పు చెందరానిదె కాని ఇంకొక వంక నిజముగా పరిణామమును పొందుచున్నదని తంత్రశాస్త్రము చెప్పుచున్నది. సత్యమందు వివిధ అంతస్థులను కల్పించి ఈ భేదములను అద్వైతము సమర్థించుచున్నది. ద్వైతమందద్వైతమును, అద్వైతమందు ద్వైతమును సిద్ధాంతపరచి ఈ భేదములను తంత్రశాస్త్రము సమన్వయించుచున్నది. తంత్రములరీత్యా పరమసత్యము పూర్ణముగా స్థావరమును గాదు జంగమమును గాదు — ఉభయము. ఎట్లనగా సత్యముయొక్క ప్రకాశరూపమే శివుడు. ఈ రూపము నిరపేక్షము, జడము, అపౌరుషేయము అగు శుద్ధ విజ్ఞానజ్యోతి. మరియు సత్యముయొక్క విమర్శ * రూపమే శక్తి. ఇది జ్ఞానమందిమిడియున్న చైతన్యము. శివుడు శుద్ధచైతన్యస్వరూపుడు; ఆ చైతన్యమునకు ఆకారకల్పనయే శక్తి. ఒకయవస్థలో జ్ఞానమయముగ తోచినదే ఇంకొక యవస్థలో చైతన్యమయముగా తోచును. శుద్ధమై సంబంధరహితమైనట్టి చైతన్యమందంతర్భూతమైనదే శక్తి.

* విమర్శనే వేదాంత పరిభాషలో 'ఈక్షణ' మందురు.

చేతనత్వమును పొందిన పరబ్రహ్మమే శక్తి. అదియే స్థూల సూక్ష్మములను పెంపొందించు చైతన్యము. అదియే ప్రపంచమందు భేదములను, మార్పులను కలిగించుచున్నది 'శివశక్తి ఐక్యరూపిణీ', 'చిదేకరస రూపిణీ', 'శివమూర్తిణీ', 'శివ', 'స్వప్రకాశా' 'విమర్శరూపిణీ' మొదలగు లలితా సహస్రమందలి నామములద్వారా శాక్త తత్త్వ సంబంధములగు పై యభిప్రాయములు వ్యక్తము చేయబడినవి.

## 10

శివశక్తులనుండి ప్రారంభమైన ప్రపంచ పరిణామక్రమములో, ప్రకృతి మొదలు మహాభూతముల వరకు గల సాంఖ్య సిద్ధాంతమందలి ఇరువది నాలుగు తత్త్వములను తంత్రమంగీకరించి శైవసిద్ధాంతమందలి పన్నెండు తత్త్వములను కొన్ని మార్పులతో చేర్చి తత్త్వముల మొత్తమును ముప్పదియారువరకు పెంచినది వీటిని మూడుగుంపులుగా ఏర్పరచినది — (1) శుద్ధతత్త్వములైదు (2) శుద్ధములు శుద్ధములుకానివి ఏడు (3) శుద్ధములుకానివి సాంఖ్యమునందువలెనే ఇరువదినాలుగు. (౧) శివ (౨) శక్తి (౩) నాద (౪) బిందు (౫) శుద్ధవిద్య యనునవి మొదటి గుంపులోని తత్త్వములు. వీటియందు తాంత్రికులు కల్పించిన మార్పులున్నవి. ఎట్లన, శైవసిద్ధాంతమందు వీటిబదులు పేర్కొనబడిన తత్త్వములు (౧) శివ (౨) శక్తి (౩) సదాశివ (౪) ఈశ్వర (౫) శుద్ధవిద్య యనునవి. తాంత్రిక పద్ధతిలోని మొదటి శివశక్తి తత్త్వములు రెండును ఒకటే. ఇదివరలో చెప్పినరీతిని మొదటిది పరమసత్యముయొక్క స్థావరస్థితి, రెండవది జంగమస్థితి. ఇంక నాదబిందువుల విషయములో నాదమన శబ్దము కాదు, బిందువనగా బొట్టుకాదు. సృష్టిలో ఒకదాని తరువాత ఒకటిగా వచ్చే వేగక్రియలను తెల్పుటకై తాంత్రిక తత్త్వశాస్త్రమందు వీనిని వాడెదరు. సృష్టి చేయునప్పుడు కలుగు ప్రథమోత్సాహమందు పుట్టినట్టి పులకరింపునకు నాదమని పేరు. వికసించుటకున్ముఖమైయున్న ప్రపంచముయొక్క అనంతశక్తులయొక్క కూడలికి బిందువు చిహ్నముగా వాడబడినది. ఊకతొడుగులో అవిభక్తముగా కలసియున్న జంట విత్తనములనుండి అంకురించి, పైకెగసి, పెరిగి మొక్కగా నగునట్టి ధాన్యపు (చణక)గింజతో తంత్రగ్రంథకర్తలు బిందువును తరుచు పోల్చుచుందురు. శివశక్తులే ఈ రెండు విత్తనములును. ఇదివరలో వివరించినట్లు మొదటిది ప్రకాశరూపము కలది. రెండవది విమర్శరూపిణి. ప్రకాశస్థితి విమర్శస్థితిలోనికి ప్రవేశించి, తనలోనికి తాను పరావర్తమై తాను అను జ్ఞానమును పొందుచున్నది. క్రియారూపములో ప్రతిఫలించిన తరువాతనే ఆలోచన తన్నుతాను తెలిసికొనును. వ్యక్తిత్వమును పొందును. పరాబిందువు లేక మహాబిందువు అని పిలువబడు మూలబిందువు ఈ విధముగనే త్రివిధమగుచున్నది — (1) శ్వేతబిందువు—సద్ధ చింతనాంశము (శుద్ధ జ్ఞానాంశము) (2) రక్తబిందువు—అద్దమువంటి క్రియాంశము (3) మిశ్రబిందువు—క్రియద్వారా తిరిగివచ్చిన చింతనాంశము; ఇందు జ్ఞానక్రియాశక్తులు రెండును వ్యక్తిసమగ్రరూపమున సమ్మేళనమగును. ఈ త్రివిధములగు బిందువులు త్రికోణాకారముగా అప్పుడప్పుడు చిత్రింపబడుచుండును. ఈ మూడును చేరినదానికి కామకళయని పేరు. ఇందలి కామయనుదానికి ఒక వివరణయందు కామేశ్వరుడు, కామేశ్వరి యనికూడ యర్థము. కళయనునది వారిద్దరిస్వరూపము. ఈ బిందువుయొక్క మూడు అవస్థలను జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఇచ్ఛాశక్తియని కూడ అందురు. ఆలంకారికముగా వీనినే త్రిపురసుందరియని చెప్పుదురు. మిగిలిన తత్త్వములయందు, శైవసాంఖ్యములలో, భేదములేదు గాన వేరే వ్యాఖ్యానమవసరములేదు. ఇట్టి సృష్టి విధానమునను సరించు లలితా సహస్ర గ్రంథకర్త 'నాదరూపా,' 'నాదరూపిణీ.' 'బిందుమండలవాసినీ,' 'బైందవాసనా,' 'కామకళారూపా,' 'శ్రీమత్త్రిపుర సుందరీ,' 'తత్త్వాసనా,' 'తత్త్వమయీ,' 'ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియా శక్తిస్వరూపిణీ' యని దేవిని పేర్కొనుచున్నాడు.

(సశేషము)

# వర్షావతరణము



శ్రీ సి. నారాయణరెడ్డి

నీలమేఘ వల్మీక గర్భాలయముల
బాలశంపా భుజంగాలు ప్రాకినేమొ
కెరలి పురివిప్పి నటియించె తరుణవర్ణ
బర్హిజాలమ్ము హర్ష సంభారమదర.

గాఢ నైరాశ్యములు గడ్డ కట్టినట్టి
పేద గుండియలో ఆశ ప్రిదిలినట్లు,
కారుమబ్బులు పేరిన గగనవార్ధి
బంగరు తటిత్తరంగాలు పొంగులెత్తె.

కటు దరిద్రతాబంధాల కట్టువడిన
కవి విశృంఖల కావ్యాలు చివుకనట్లు,
అంబుధర నీలిమల తానమాడియున్న
లలిత చంచలారక్తిమల్ వెలియలేను.

మొరకు టెండల గ్రీష్ముడు ముద్దు వెట్ట
'భగ్గు'మనెడు లే మొగ్గల బుగ్గలందు
అమృత నిష్యంది నవజీవనౌషధమ్ము
రంగరించెను సరస వర్షాభిషక్కు.

ఊష్మ నిశ్వాసముల క్రాగుచున్న; భూవి
రహిణి పాండురవక్షోంతరమ్మునందు
గ్రాన పులకాంకురమ్ములు మోసులెత్తె
రమ్య వర్షాప్రియుని పరీరంభణమున!

ఉర్వరాగర్వ కాంక్షల నోర్వలేక
కత్తి కట్టెనో అభ్ర జగత్తనంగ
ప్రళయగర్జన భేరిధ్వనులు రణించె!
భీషణోల్కా శతఘ్నులు ప్రేలసాగ!

మేడలోని ధనస్వామి, నీడలేని
తాడితప్రాణి, స్నేహ సూత్రాలలోన
ముడిపడు విధాన, గగనమ్ము భూతలమ్ము
ఐక్యమైపోయె వర్ష ధారాళిలోన.

ఊష్మ తీవ్రత చేత పెల్లుడికిపోవు
మల్లెమొగ్గలపైన 'ఫటి'ల్లు మనుచు
రాలె వడగళ్లు, తరుణీ కుచాలు నొవ్వ
పువ్వువిలుకాడు బాణాలు రువ్వినట్లు!

రాళ్లుపిండిన తరుగని రక్తనిధులు
ఎండ దెబ్బల స్వేదమై ఎగిరిపోవ
డీలువడ్డ నరాల, వర్షాలరేడు
క్రొత్త నెత్తుటి జల తళుకొత్తజేసె!



# కలగూరగంప

## హంస: క్షీరనీర విభాగము

సంస్కృతసాహిత్యములో హంసము, పికము, భ్రమరము, కమలముల వాడుక హెచ్చుగా నుండును. ఇవి లేని కవుల కవిత పేలవముగానుండును. వీనిచర్చ లేకుండ, పురాణము, కావ్యము, నాటకము లనునవి లేవు. వీనిలోఁ గవులేదో యొక విశేషమును జోడించినారు—హంస కలిసియున్న పాలను నీటిని వేఱుచేసి పాలమ్రాఁతి నీటినిఁ ద్యజించుననీ; పికము తన పిల్లలను గాకులగూళ్లలోఁబెట్టి పెద్దవి యగువఱకు వాని పెంపకమునందే యుంచుననీ: భ్రమరము లేమామిడిపూగుత్తులం దెక్కువ మక్కువ చూపుచు, చంపక పుష్పపు దాపునకైనను బోదని; కమలము చంద్రుని ద్వేషించుననీ—అతఁడున్నప్పు డెప్పుడును వికసింపదనీ—సూర్యునికి పరమభక్తురాలనీ... వీనిలోఁ గొన్నిటిని మాత్రము నిస్సందేహముగా నొప్పుకొన వచ్చును. కాని కొన్నిటిలో మత వైరుధ్య మున్నది. ఉదాహరణమునకు హంసను దాని నీరక్షీరవిషయక మైన వివేకమును దీసికొనుఁడు.

సంస్కృతకావ్యములలోఁ జాలచోట్ల హంసకుఁ బాలను నీటిని వేఱుచేయు శక్తిగలదని వ్రాయఁబడినది. కాని, అది పాలను నీటిని వేఱుచేయుట నెవరును జూచిలేదు. ఒకవేళ నెవరైనఁ జూచిరనుకొనిన, ఆవిషయమునుగూర్చి యేవిధమైన రచనము లభ్యము కాదు. ఈ ప్రవాదము సప్తసముద్రాలను దాటి అమెరికా చేరినది. అచ్చటి విద్వాంసులకు హంసయొక్క యీ యద్భుతగుణ మాశ్చర్యము గలిగించినది. కాని వారిటువంటి సంగతులను నిశ్శబ్దముగా నంగీకరించెడువారు కారుగదా! మనదేశములో హంసకుఁ జెందిన యీ ప్రవాదము చాల సంవత్సరాలనుండి వాడుకలో నున్నది. కాని దీని సత్యాసత్యముల పరీక్ష నింతవఱకెవరును జేయలేదు. బహుశః చేసియున్నచో దానిఫలితము లిపిబద్ధముగా దొరకదు. అమెరికాలో హార్వర్డను విశ్వవిద్యాలయ మున్నది. దానిలో లాబ్మన్ అను నతఁడొక ప్రొఫెసరు. ఇతఁడు హంసయొక్క యీ యలౌకిక గుణమును బరీక్షింప నడుమకట్టినాఁడు; చాల హంసలను గొని పెంచినాఁడు; చాలరీతుల వానిని బరీక్షించినాఁడు. కాని పాలనుండి నీటిని వేఱుచేయుటలో హంస యసమర్థముగా నుండుట తటస్థించినది. అయినచో హంసయొక్క యీ నీరక్షీర వివేకవిషయ మెంతవరకు సత్యము? దీని కాధారములైన కొన్ని వాక్యములు మన కావ్యము లిచ్చుచున్నవి.

నీరక్షీరవివేకే హంసాలస్యమ్ త్వమేవ తనుషే చేత్
విశ్వస్మిన్నధునాన్యః కులవ్రతం పాలయిష్యతి కః
—భామినీ విలాసమ్.

ఓ హంసా, నీవే పాలను నీటినుండి వేఱు చేయగల వివేకమును శిథిలము చేయుచో నీ జగత్తులో దన కులవ్రతపాలన మింకెవరు చేయుదురు?

యో హాని ష్యతి వధ్యం త్వాం రక్ష్యం రక్షతి చ ద్విజమ్
హంసో హి క్షీర మాదత్తే తన్మిశ్రా వర్జయ త్యపః
—శకుంతలా.

హంస యేరీతిగా బాలను గ్రహించి దానిలో గలిసియున్న నీటిని వదలివేయునో, అట్లే యితడు వధింపదగిన నిన్ను సంహరించి రక్షణీయుడైన బ్రాహ్మణుని రక్షించును.

ప్రాజ్ఞస్తు జల్పతాం పుంసాం శ్రుత్వావాచః శుభాశుభాః
గుణాబద్ధా స్సమాదత్తే హంసో క్షీర మివామ్భసః
—మహాభారతమ్. ఆదిపర్వమ్.

హంస యెట్లు నీటియందు గలిసియున్న పాలను గ్రహించునో అట్లే బుద్ధిమంతుడయిన మానవుడు జనుల ముఖమునుండి మంచి, చెడు విషయములను విని మంచిని దీసికొనును. ఇది యెట్లనగా, పాలపాత్రలో హంస ఎప్పుడు తన ముక్కును బెట్టునో అప్పుడే దాని ముఖమందలి రసవిశేషము కలియుట

తోనే జలము, క్షీరము వేఱ్వేరగును—లేదా విడి విడిగా గనుపడునని టీకాకారుఁడు చెప్పినాడు.

దీనినిబట్టి హంస ముఖములో నొక విధమైన రసముండునని తేలుచున్నది. ఆ రసము కలియుట తోడనే నీరు, పాలు విడిపోవుట జరుగును. ఈ రసములో బుల్లదనముండుచో పాలు పేరుకొని పెరుగుగా మారుట సంభవము. కాని యిట్లగుటకు గొంత కాలవ్యవధి కావలసియుండును. హంస ముక్కును పాలలో బెట్టినంతనే పాలు ఘనీభవింపవచ్చునేమొ! అట్లే యగుచో, పాత్రలోనున్న జలమందు గలిసిన పాలనుండి నీటిని వేఱుచేసి పాలనే యేరీతిగా ద్రావునో అర్థము గాకున్నది. లాఙ్క్లిన్ మహాశయుని పరీక్షవలన నీ విషయము నిర్ధారణము కాలేదు.

అమెరికాలోనే యింకొక విద్వాంసుని ప్రయత్నము. అతనిపేరు డాక్టర్ కౌశ్లన్, వాషింగ్టను నగరవాసి. ఏ వస్తువునైనను దినునపుడు హంసయొక్క ముక్కునుండి యీ రసవిశేషాంశము బయటికివచ్చి, ఘనీభూతమైన యంశము దానిపొట్టలోనికి బోవుటకు వీలుగా గాని ముఖనిర్మాణ మున్నదని యాతని మతము. ఆ ఘనపదార్థమే పాలని యాతని యుద్దేశము. అత్యంత రసవంతమైన వస్తువుయొక్క ఘనీభూతాంశము బయటికి వచ్చుట సంభవమే కాని ఒక వస్తువుయొక్క ఘనీభూతాంశము పాలనుట హాస్యాస్పదము.

మంచిది. మన మింకొకవిధముగా నాలోచింతము. హంస లెక్కడుండును? ఏమి తినును? చాలవఱకు హంసలు మనదేశములోనే దొఱకును. వానికి ప్రియాతిప్రియమైన నివాసస్థానము మానససరోవరము. ఈ సరోవరము హిమాలయ పర్వతములపై నున్నది. అది చాల రమణీయమైనదని వినుచుందుము. దీనియందలి జలము ముత్యాలవలె స్వచ్ఛమట. చాలవఱకు హంస లిక్కడనే నివసించును, గ్రుడ్లు పెట్టును. చలికాలములోఁ జలిపెంపువలన నివి మానససరోవరమును వదలి క్రిందితావులకు వచ్చును. కాని యివి వింధ్యాచలములు దాటిరావు. వింధ్య హిమాచలముల మధ్య ప్రదేశమునందలి నిర్మల జలపరిపూరిత సరస్సులందు, నదులతీరములందవి విడియును. చైత్రవైశాఖములందుఁ దిరిగి యవి హిమాలయములకు వెళ్ళును. సరస్సులందుఁ గమలము లధికముగా నుండును; అవి హంసల కధికప్రియమైనవి. అక్కడే యవి యెక్కువగా నుండును. వాని శరీరము తెల్లగాను, పాదములు, ముక్కు నెఱ్ఱగాను నుండును; ఆ కారణమున బాతుకంటెఁ గొంచెము పెద్దదిగా నుండును.

హంసలు పాలను ద్రావుచో వానికిఁ బాలెక్కడ లభించునో? మానససరోవరములో నవి యావులనుగాని, గేదెలనుగాని పెంచియుండలేదే! భారతదేశమందే సరసునందుఁగాని, నదియందుఁగాని అవి పాలను ద్రావుననుట యూహాతీతము; అందుచే హంసలు, ఆవుల గేదెలపాలను ద్రావుననుటసంభవముగాఁ దేలుచున్నది. కొంతమంది కవులు హంసలు ముత్యాలను దినునని వ్రాసిరి. కాని మానససరసులో ముత్యాల యుత్పత్తి లేదు. ఒకవేళ మానససరసులో ముత్యాల యుత్పత్తి నొప్పుకొనిన, వాని (హంసల) చలికాలపు విడిది తావులైన భారతదేశ సరస్సులందు ముత్యములుండుట ఇంతవఱకు వినరాలేదు. పంజాబు, రాజపుత్రస్థానములలో నెక్కడో యొక సరసులోఁ గొన్ని ముత్తెపుచిప్పలు దొఱికినట్లు వినికిడి. మానససరసును వీడి క్రిందికివచ్చు హంసలన్నియు నీ సరస్సునకే వచ్చి ముత్యాలఁ దినుచుండునా? అనునదే ప్రశ్న. అచ్చటయినను ముత్యాలు విడివిడిగాఁ జల్లఁబడియున్న గాని హంసలు వానిని బగులగొట్టి ముత్యాలఁ దీసికొనుట కొంచెము కఠినమైన కార్యమే యగును. నిర్మలజలమున కుపమానము ముత్యాలతో నీయవచ్చును—మానససరోవరమందలి జల మత్యంత నిర్మలమైనది. అందుచే ముత్యముల వంటి నిర్మలజలమునకు ముత్యాలనియే యర్థము చెప్పుచు, జలమునే ముత్యములని జనులెంచుటలో నాశ్చర్యమేమియు లేదు. అందువలన హంసముత్యములను దినుననుదానికి భావము ముత్యములతో సమానమైన నిర్మలజలమును ద్రావుననుటయే. ఇది హంస పానీయ విషయము.

ఇంక నాహారవిషయమును జర్చించెదము. శ్రీహర్షుని నైషధమున ప్రథమ సర్గలో నలుఁడొక హంసను బట్టుకొన్నట్లుగలదు. హంస మనవలెనే మాట్లాడును. అది నలునితోఁ 'నీటిలోఁ బుట్టు మొక్కల తీగల పండ్లచేతను, దుంపలచేతను నేను మునులవలె నా జీవితనిర్వహణముఁ జేసికొందు'నని చెప్పెను.

'భుక్తా మృణాలపటలీ భవతా నిపీతా
న్యమ్బూని యత్ర నలినాని నిషేవితాని
రేరాజహంస! వద తస్య సరోవరస్య
కృత్యేన కేన భవితాసి కృతోపకారః?'

'ఓరి రాజహంస! నీ వెవరి యాశ్రయములో నుండి తామరతూండ్లను మెసవితివో, దప్పిక తీర్చుకొంటివో, తామరపూవుల రుచి చూచితివో, ఆ సరోవరమున కట్టి ప్రత్యుపకారము చేసెదవు?' అని జగన్నాథరాయల 'భామినీ విలాసము'నఁ గలదు.

పైయాధారముచే హంసలు ముత్యములనుదినకపోయినను, పాలను ద్రావకపోయినను, నీటినిఁ ద్రాగునని, తామర మొక్కలకుంపలను, పూలను, వేళ్లను, తీగల లోపలనుండు సన్నని దారములను (బిసతంతువులను) దినుననుట స్పష్టము. హంసలకు జలసమృద్ధములయిన సరసులం దుండు టెక్కువ యిష్టము. అక్కడ వాని యాహారము విశేషములుగా—మృణాల దండములు, వానిలోపలి బిసతంతువులును, వానినుండి వెల్వడు రసమును, కమలనాళములను జీల్చుటచే వాని లోపలి నుండి యొకరకమైన తెల్లని పత్తి పోగుల వంటి పదార్థమును ప్రసిద్ధములు. దీనినే బిసతంతువులని యందురు. దీనినే హంస లెక్కువగా దినును. మృణాల దండముల దుంపలనుండియు నొకరకమైన రసము వచ్చును. అది తేలికగాఁ బాలవలెఁ దెల్లగా నుండును. అది తీపిగాఁ గూడ నుండును. ఆ రసమునకు క్షీరమనియుఁ బేరు. సాధారణముగాఁ జెట్లనుండి వచ్చు నీటివలెఁ దెల్లని రంగుగల అన్ని ద్రవపదార్థములకు క్షీరమని పేరు. మఱ్ఱి, సపోటా, వాక, అత్తి మొదలగు చెట్లనుండి వచ్చు తెల్లని రసమును మనము పాలనియే వాడెదము గదా. మృణాలదండములు నీటిలో నుండును. వాని నుండియే పాలనుబోలిన తెల్లని రస మొకటి వచ్చును. ఆ రసమునే హంసలు త్రాగును, తినును. ఈ రీతిగా హంసలు నీటిలోనున్న పాలను ద్రాగుట తప్పక నిజమే. మొట్టమొదట నీవిధమైన నీర క్షీర పృథక్కరణము పండితుల యుద్దేశమయి యుండవచ్చును. కాలక్రమమున నీ విషయమును బ్రజలు మఱచియుందురు; సాధారణమైన జలమిశ్రిత క్షీరము నుండి హంసపాలను ద్రాగి నీటిని వదలివేయునని వాడుక వచ్చియుండును. *

శ్రీమతి ఆ. హృదయిని.

---

*శ్రీ మహావీరప్రసాద ద్వివేదీ హిందీ వ్యాసము నాధారముగా గొని వ్రాయఁబడినది.

# ఆంధ్రరాజుల అభినందనములు

విజయనగర సంస్థానపాలకుడగు పూసపాటి విజయరామగజపతి మహారాజును, పెద్దాపుర సంస్థాన ప్రభువగు వత్సవాయి తిమ్మజగపతి మహారాజును సమకాలమువారు, క్షత్త్రియ ప్రభువులు, బంధువులు, ఉభయులును, విద్యాపోషకులు, విద్వత్ప్రియులు, విద్వాంసులు, కవితాప్రియులు, కవులు.

ఒకమాఱు గోదావరీ పుష్కర స్నానమునకని రాజమహేంద్రవరమునకు బయలుదేరిన విజయరామరాజుగారు తమ రాకను తిమ్మరాజుగారికి ముందుగా తెలిపిరి. రాజకులోచిత సత్కారమున కనుగుణముగా ఎదురుగా వెళ్ళి ఆయనను తోడ్కొనివచ్చుటకై ఈయన వాహన మెక్కి యెదురేగిరి. ఇరువురి పల్లకీలు పిఠాపురము చెంత తారసిల్లినవి. అపుడు పల్లకీలు దిగి యొకరి చేతు లొకరు గ్రహించి సంతోషముతో కుశల ప్రశ్నపూర్వకముగా నింపుగ ముచ్చటించుకొన్నంత, నొకరి నొక రభినందించుకొన్నట్లుగా నీ క్రింది శ్లోకములు రెండును పెద్దల వాడుకలో వినవచ్చినవి. ఇవి తత్కాలమం దాశువుగా చెప్పినవి కాకపోయినా, కలసికొన్నప్పుడు ప్రశంసించుటకై యంతకుముందే వారిద్దఱు రచియించుకొనియుందురని భావించవచ్చును. అందు ముందు తిమ్మరాజుగారి శ్లోకము:—

"నాళీకభంగికృదతీవ స దీనబంధుః
సత్పుత్రపో నవసుధా విధివైక హేతుః,
రాజా కిమిందురపి వార్యభిమానహారీ
రాజాపరః విజయరాఘవ సార్వభౌమః"

ఈ క్రిందిది విజయరామరాజుగారి శ్లోకము:—

"అంభోజం కలయన్ సద్వృత్తమవనే
సాహిత్య రీత్యాం దృశోః,
మాంధాతార మపార సంపది మహో
భావేయశోరాశిషు,
శత్రూణాంపుర భంజనే ధృతిగుణే
కించోరగేంద్రం మతి
ప్రాగల్భ్యే ప్రతి భాతి తిమ్మ
నృపతిః పాకాహితప్రాభవః"

కూడబలుక్కుకొని రచియించినట్లుగా రెంటిలోను సభంగ శ్లేషాలంకారమే ప్రధానముగా గనవచ్చుచున్నది. వీని వివరణము క్రమముగా నొకింత—

రాజశబ్ద సిద్ధతికిని వర్తించుచున్నను, చంద్రుడు రాజనదగడు. విజయ రామరాజే రాజనదగును. ఏమనగా—ఇందలి యైదు విశేషణములలోను, ఒక్కొకటి, శ్లేషవశమున చంద్రునికి రెండు విధములుగాను, విజయరామరాజున కొకవిధముగాను సమన్వయించును—

అతడు, నాళీక = పద్మములకు, భంగకృత్ = చెఱుపు చేయువాడే కాని, అళీక = అప్రియములకు, భంగము కలిగించువాడు, న = కాడు. ఇతడో. అళీక భంగకృత్ = అప్రియ కార్యముల నణచివేయువాడు - అతడు, నదీన = సముద్రునికి, బంధుః = చుట్టమే కాని, దీనబంధుః = దీనులకు చుట్టము, న = కాడు; ఇతడో, దీనబంధువు. అతడు, నక్షత్రపః = నక్షత్రములకు ప్రభువే కాని, క్షత్రపః = క్షత్త్రి జాతిని పాలించువాడు, న = కాడు; ఇతడో క్షత్రియజాతివారిని రక్షించువాడు. అతడు, నవసుధా విభవైక హేతుః = క్రొత్తదైన అమృత సంపదకు ముఖ్య కారణమే కాని, వసుధా = భూమండల వైభవమునకు హేతువు, న = కాడు. ఇతడో, భూమి సర్వసంపత్సమృద్ధముగా పాలన మొనర్చువాడు. అతడు, నార్యభిమానహారీ = స్త్రీలయభిమానమును హరించువాడు కాని, అర్యభి... శత్రువుల గర్వమణచువాడు, న = కాడు. ఇతడో అరిజాతి దుర్గర్వమణగ ద్రొక్కువాడు. కావున విజయ రామరాజు రాజుగాని, చంద్రుడు రాజు కాడని భావము—ఇందు తక్కిన వన్నియు సముచితము లనవచ్చును గాని, చంద్రుడు వసుధా విభవ హేతువు కాడనుటమాత్ర ముచితము కాదు. సమస్తమైన యోషధులకు (సకల సస్యాదులకు) సోముడు రాజని వేదము తెల్పుచున్నది, చంద్రకిరణముల సంపర్కమున సస్యాదులు ఫలించుట యనుభవసిద్ధము—ఇక రెండవ శ్లోకము.

ఇందు, తిమ్మరాజుపమేయము, అంభోజాదులు మూడు నుపమానములు. అందొక్కొక్కటి మూడు విధములుగా సమన్వయించును. ఎట్లనగా?— తిమ్మనృపతి, అవనే = రక్షణమునందు, అం = విష్ణువును, సాహిత్యరీత్యాం = సాహిత్య విద్యావిషయమున, భోజం = భోజమహారాజును, దృశోః = కన్నుగవయొడ, అంభోజం = పద్మమును, సదృక్షంకలయన్ = సాటిని గావించుకొనుచును, అపార సంపది = అనంతమైన సంపదయొడ, మాం = లక్ష్మిని, మహౌదార్యే = ఉదార స్వభావమునెడ, ధాతారం = బ్రహ్మను, యశో రాశిషు = ఘనమైన కీర్తి విషయమై, మాంధాతారం = మాంధాతను, సాటిగావించుకొనుచును, శత్రూణాం పుర భంజనే = శత్రుపురములను భంగపెట్టుటయందు, (ఉః) ఉమ్ = మహేశ్వరుని, ధృతిగుణే = ధైర్యమునందు, అగేంద్రం = మేరువును, మతి ప్రాగల్భ్యే = బుద్ధి ప్రౌఢిమయొడ, ఉరగేంద్రం = ఆదిశేషువును సరిగావించుకొనుచును, పాకాహిత ప్రాభవః = మహేంద్రుని యైశ్వర్యమువంటి యైశ్వర్యము కలవాడై, ప్రతిభాతి = ప్రకాశించుచున్నాడు. అనగా తిమ్మనృపాలుడు సకల సద్గుణసంపన్నుడైన భూమీంద్రుడని భావము.

ఈ శ్లోకము లేనాడు పుట్టినవో కాని, నాటి నుండియు నివి యారాజుల మాటలుగానే తెలుగు దేశమున వ్యాపించుచు వచ్చుచున్నవి. ఇవి వ్యక్తి ప్రశంసాపరములైనను శ్రుతిరంజకములైన యితర చాటు శ్లోకములవలెనే జీవించియున్నవి. కాని, యిందు, నాళీకేత్యాది మొదటి శ్లోకము, 'రాజాపరం విజయ రాఘవ సార్వభౌమః' అనుటకు బదులుగా, "రాజా పరం విజయతే భువి రామవర్మా" అను పాఠముతో, తిరువాన్కూరు పాలకుడయిన రామవర్మ ప్రశంసగా, ఎడపట్టికట్ట నంబూద్రి తిమ్మడు రచియించిన రుక్మిణీ పరిణయ కావ్యము నవతారికలో నున్నట్లు తెలియుచున్నదని కృష్ణమాచార్యులుగారి సంస్కృత సారస్వత చరిత్ర 804 పుటలో నొకమాట కనవచ్చినది. ఆ కావ్య మముద్రితము. అది, యెందణగియున్నదో! అదియు మన చాటు శ్లోకములును కొంచెమెచ్చు తక్కువగా సమకాలము లనవచ్చును. ఆ కావ్యము కొంచెము ముందైనను కావచ్చును, కాని ఆకాలమున, నందలి శ్లోకము తన కెట్లో లభింపగా, తిమ్మరాజు దాని నుపయోగించుకొనెననుట గాని, లేక యితని యీ చాటు నామలబారులోని రుక్మిణీ పరిణయ కావ్యమున కెక్క ననుటగాని చెప్పుటకును నమ్ముటకును గూడ వలనుపడకున్నది. నిజముగా నీ శ్లోకమా రుక్మిణీ పరిణయావతారికలో నున్నదన్న మాట ధ్రువపడినచో నపుడీ విషయము పరామర్శింపదగును గాని, యంతదనుక నిది తిమ్మనృపతి శ్లోకమనియే విశ్వసింతము.

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

# గ్రంథవిమర్శనము

## శ్రీమద్గురు భాగవతము

[భాగవతాంధ్రీకరణము]

రచయిత: మిన్నికంటి గురునాథశర్మ. ప్రతులకు: గ్రంథకర్త. ప్రధానాంధ్రోపాధ్యాయులు. హిందూ కాలేజ్ హైస్కూలు. గుంటూరు. వెల: అయిదు రూపాయలు.

పోతన మహాకవి రచించిన భాగవతం పూర్తిగా ఆయన చేతిమీదుగా నడవలేదని భాగవతం చదివినవారందరికీ తెలిసినదే.

పోతన భాగవతం ఈవిధంగా అసంపూర్ణంగా ఉండిపోవడానికి గల కారణాలేవో సుస్పష్టంగా తెలియవు. కాని ఆ శేషభాగం వెలిగందల నారయాదులు పూర్తిచెయ్యడం జరిగింది. అయితే వెలిగందల నారయ భాగవతానువాదం బాగా సంక్షిప్తమై పోయింది. సంస్కృత భాగవతంలో ఏకాదశస్కంధంలో 1367 శ్లోకా లున్నాయి. ద్వాదశస్కంధంలో 566 శ్లోకా లున్నాయి. అయితే రెండుస్కంధాలకు వెలిగందల నారయ రచించిన అనువాదం 178 గద్య పద్యాలతో ముగిసిపోయింది.

అందుచేత ఈ ఏకాదశ ద్వాదశ స్కంధాల లోని విషయా లనేకం తెలుగు పాఠకుల కందుబాటులోకి రాకుండానే నిలిచిపోయాయి.

కనకనే శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారీ ఏకాదశ ద్వాదశ స్కంధాలు తెలుగులోని కనువదించారు.

శ్రీ శర్మగా రుద్దేశించినట్లు వీరి కవితలో యథామూలత చక్కగా వచ్చింది. ఇంతేగాక దూరాన్వయాలుగాని, క్లిష్టాన్వయాలుగాని లేకుండా వీరి కవిత ధారాళంగా సాగిపోతుంది.

ఇంతేగాక వీరి పద్యరచన అడుగడుగునా జాతీయమైన పలుకుబడితో సాగిపోతూ అమాయికమయిన భక్త్యావేశం స్ఫురింపజేస్తూంటుంది.

వీరి శైలి అక్కడక్కడ కొంచెం సంస్కృత ప్రచురంగా ఉన్నా సంస్కృతాంధ్ర పద ప్రయోగం వీరి కావ్యాల్లోగల పరిణత పాండితి స్ఫురింపజేస్తున్నది.

ఇది పింగళ అనే వారాంగన సౌందర్యం వర్ణించే సీసము.

పగడాల బరిణెలో మగరాల తళుకు నా
గెం బెదవుల నవ్వు క్రేళ్ళువార
నీలాలగని కాంతిలీలాలహరి నాగ
గంటి క్రేవలమాపు కళుకులొలుక
ఉమ్మెత్తపూగొను దుమ్మెత్తగల చీర
కుచ్చెళ్లు పాదాల గ్రుమ్ములాడ
బైటకులోగక బైటకుం ద్రుళ్లుచు
వల జక్కవలన గుబ్బలు నటింప
స్తనభరంబున పోలియు ఘననితంబ
మూదుకొన విల్చు కెన్నడు మేదొ యనగ
క్రొవ్వు మంజీర ఝుళఝుళం ఝుళరవంబు
మెరయ బింగళ వీథిలో దిరుగుచుండు.

సంస్కృతపద ప్రచురమైన వీరి శైలి కీ క్రింది వృత్తం తార్కాణంగా తీసుకోవచ్చును.

బృంద గళింద జాపులిన వీథుల
హృత్ప్రియుపంచు గోపికా
బృందము నన్ను గూడి విహరించి
క్షణంబులువోలె పుచ్చి రా
నందములోడ రేల; నధునాతన
కాలమునందు నేను రే
యిం దిగులొంది పుచ్చెద రమేయ
యుగంబులు వోలె యామినుల్.

భాగవతాభిమాను లందరికీ ఇది అవశ్య పఠనీయమైన గ్రంథము.

---

## జయపతాక

[ఖండకావ్య సంపుటి]

శ్రీ కందుకూరు రామభద్రరావుగా రింతకు పూర్వం 4, 5 ఖండకావ్య సంపుటాలు ప్రచురించారు. దీనిలో కవి ఆ ఖండకావ్యాల ప్రచురణ

తరవాత రచించిన ఖండగేయ గీతికలన్నీ చేర్చి 'జయపతాక'గా ప్రకటించారు.

జయపతాకలో అంతటా చక్కని నిజాయితీ అంతర్వాహినిగా ప్రవహిస్తూ ప్రతి రచనకు ఉక్కివం కలిగిస్తున్నది. ఈ కవితలో సహజంగా ఉద్బుద్ధమైన భావాలకే తదనుగుణపదరచనతో ప్రాణప్రతిష్ఠ చేస్తారుగాని కేవలం ప్రజాదరణ, ప్రచారంవంటి లక్ష్యాలతో ఆయా భావాలు అసహజంగా పలకడం అనేది వీరి కవితలో గోచరించదు.

ఈ గుణం వీరి కావ్యాలన్నింటిలోను అనుస్యూతంగా వస్తూ జయపతాకలో మరి ఒక అంతరువు పైకి వెళ్ళింది.

జయపతాకలోని ఖండకృతు లన్నిటిలోను సంస్కృతి, సౌందర్యదేవత, వెలుగుదారి, పౌర్ణమినాడు, యాత్ర అనే ఖండకావ్యాలు అత్యుత్తమంగా ఉన్నాయి. 'పౌర్ణమినాడు' అనే ఈ క్రింది ఖండకావ్యభాగంలో వీరి కవితాశక్తి పాఠకులకు ప్రస్ఫుటంగా భాసించగలదు.

"కార్తికకమాస చంద్రికా కాంతిపుంజ
ములు నటించెడు గౌతమీ జలములందు
సద్దు మణగిన యర్ధనిశా ప్రశాంత
వేళ విహరింప దోనెపై వెడలినాడ.

పడవనడుపు చుక్కాని స్రోతువుల మెదలి
కలతనిద్దుర గంగమ్మ కలవరించె
మినుకు జేసిన చేపలు కనులు తెరచి
రెల్లుపందుల బొరలాడి మెల్ల నవ్వె
పాయలందేలు లంకల చాయలందు
ముమ్మరమ్ముగ గాశసుమమ్ము విరిసి
పండు పున్నమవెన్నెల పాలు కురిసి
మడుగులంగట్టి పొంగినవడువు దోచె
శివ జటాజూట మల్లికాస్మిత మరీచి
వల్లివోడుదగ జగతి ప్రపుల్లమగుచు
స్నిగ్ధపీయూష ధారాభిషేచనముల
ఆర్ద్రమై నిల్చు మౌన ముద్రాంకితమయి!"

ఇలాగ ఈ ఖండకృతిహృద్యంగా సాగిపోతుంది.

ఈ కావ్యంలో వాడినవన్నీ చాలావరకు గీతికలే. గేయాలు నాలుగైదు మాత్రమే. అయినా ఆయా భావానుకూలమైన పదాల కూర్పులో ఈయనలో ఒక ప్రత్యేక శక్తి స్ఫురిస్తున్నది.

సుసంస్కృతము, శిష్టము అయిన వీరి కవితలో ఒకటిరెండు చోట్ల 'నిత్యతేజోజ్జ్వలమున' వంటి అసాధు పదప్రయోగాలు కనిపిస్తున్నాయి.

ఈ పుస్తకానికి శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు వ్రాసిన 'ప్రవేశిక' వీరి కవిత కొక చక్కని ప్రవేశిక.

పుస్తకాకారము.ముద్రణ చక్కగా ఉన్నాయి.

---

## శివయోగము

పండిత, ముదిగొండ కోటయ్యశాస్త్రి అయ్యవారు. ప్రతులకు. గ్రంథకర్త. ఈమని, వయా దుగ్గిరాల, గుంటూరు జిల్లా. వెల ఒకరూపాయి.

ఇది శైవసిద్ధాంత రహస్యాలు, సంప్రదాయాలు వివరించే గ్రంథం. ఆయా మతాల వేదాంత దృక్పథానికీ, ఆయా మతానుయాయులు అనుసరించే నిత్యనైమిత్తిక కర్మకాండలకు, ఆచారాలకు చాలా దగ్గిర సంబంధం ఉన్నది.

ఈ గ్రంథకర్త కేవలం శైవానికి సంబంధించి ప్రధాన సిద్ధాంతాలు విపులీకరించడంతోనే తృప్తిపడక చిన్మయదీక్ష, సాధ్యసాధక సాధనములు అనే రెండు ప్రకరణాలలోను, శైవ సంప్రదాయాలు, ఆచారాలు చక్కగా వివరించి వీటికీ శైవ వేదాంతానికీ గల సన్నిహిత సంబంధం సూచించారు.

తత్త్వప్రథ, పరిణామము అనే మొదటి ప్రకరణాలలో వీరిచ్చిన శైవసిద్ధాంతాలవివరణంలో అక్కడక్కడ శైలి కొంచెం సాంకేతికపద భూయిష్ఠంగా ఉన్నది. అందుచేత సాధారణ పాఠకులకు ఈ ప్రకరణాలు సులభంగా బోధపడడం కష్టం. గ్రంథకర్త పునర్ముద్రణంలో ఈ విషయం గమనించగలరని ఆశిస్తున్నాము.

పుస్తకం చిన్నదైనా రచయిత దీనిలో శైవసిద్ధాంతాలన్నీ సంగ్రహంగా క్రోడీకరించారు. శైవసిద్ధాంత రహస్యాలవగాహన చేసుకోడానికి అనువైన చిన్న పుస్తకాలు తెలుగులో చాలా తక్కువగా ఉన్నాయి. అందరికీ అందుబాటులో ఉన్న ఈ చిన్న పుస్తకం ఆ లోటు తీర్చడమేకాక పాఠకులలో ఈ విషయంలో ఇంకా కుతూహలం రేకెత్తించేదిగా ఉన్నది.

---

## ఈశావాస్యోపనిషత్తు

ఆంధ్రీకృతికర్త. పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రి. ప్రాప్తిస్థానము. గ్రంథకర్త. మహారాజ సంస్కృత కళాశాల. విజయనగరము వెల. 2-8-0.

ఈశావాస్యోపనిషత్తు దశోపనిషత్తులలో చాలా ముఖ్యమైనది. దీనికి మత త్రయాచార్యులే గాక మిగిలిన ప్రస్థానాలకు చెందిన ఆచార్యులనేకులు భాష్యాలు రచించారు.

ఇంతేకాక, ఇటీవల అరవిందులుకూడా దీనికొక ప్రత్యేక వ్యాఖ్యానం రచించి తమ తత్త్వవివరణకు ఈ ఉపనిషత్తొక ప్రధాన ప్రమాణంగా స్వీకరించారు.

ఈ ఉపనిషత్తులోని మూలమంత్రాలన్నీ మొత్తం 25 మాత్రమే.

శ్రీశాస్త్రి గారీ మంత్రాలన్నిటికీ పదచ్ఛేదము, ప్రతిపదార్థము, తాత్పర్యము మాత్రమే కాకుండా స్వయంగా రచించిన పద్యానువాదాలు కూడా చేర్చారు.

ఇంతేకాక వీరు ఆనందగిరి టీకాసహితమైన శంకరభాష్యము, కూరనారాయణ వ్యాఖ్యాసహితమైన వేదాంత దేశికాచార్య భాష్యము, మధ్వాచార్య భాష్యము మొదలైన ఇతర భాష్యాలుకూడా పరిశీలించి, ఆయా ఘట్టాలలో ఆయా ఆచార్యుల అభిప్రాయాలు, మతిభేదాలుకూడా తమ వ్యాఖ్యానంలో చేర్చారు.

ఇందుచేత వీరి ఆంధ్రవ్యాఖ్యానం కేవలం అద్వైత దృష్టితో పరిశీలించేవారికే గాక తదితరులకు కూడా బాగా సహాయకారిగా ఉన్నది.

ఇక వీరు ఉపనిషత్తులోని మూల శ్లోకాలకు అనువాదం రచించిన పద్యాలు ఎక్కడో సకృత్తుగా మాత్రమే మూలశ్లోకాల్లోని గాంభీర్యము, సంక్షిప్తత స్ఫురింపజేస్తున్నాయి. ఈ క్రింది పద్యాన్ని బట్టి వీరి అనువాదధోరణి గ్రహింపవచ్చును.

అమల హిరణ్మయమగు పా
త్రమువను గప్పితివి సత్పద బ్రహ్మద్వా
ర మది తెరువు వీక్షింపగ
ద్యుమణీ! సద్ధర్మసంయుతుడనగు నాకున్.

ఈ ఈశావాస్యోపనిషత్తు అవగాహన చేసుకోదలిచిన తెలుగు పాఠకులకీ గ్రంథం బాగా ఉపయోగిస్తుంది.

## శరణార్థిని
[పద్యకావ్యము]

భళ్ళమూడి సీతారామమూర్తి. శ్రీ మహారాజావారి హైస్కూల్. పర్లాకిమిడి. గంజాం జిల్లా, వెల: పన్నెండణాలు.

ఇది దేశవిభజన సందర్భంలో కడగండ్లపాలైన ఒక అభాగ్యురాలి విషాదోదంతం వర్ణించే చిన్న పద్యకావ్యం.

దేశకల్లోలంలో ఒంటరియైన ఈ అభాగిని గర్భభారంతో అల్లాడుతూ ఒక కఠినాత్ముని క్రౌర్యానికి గురియై, క్లిష్టపరిస్థితుల్లో ఒక శిశువును ప్రసవించి ప్రాణాలు విడుస్తుంది. మరణ శయ్యమీద కొనఊపిరితో ప్రాణాలు విడిచే తల్లి శిశువుకు అందించే సందేశంతో ఈ కావ్యం ముగిసిపోతుంది.

ఈ కావ్యంలో కథ కట్టడంలో అంత ప్రత్యేకత కనబడదు.

కాని కావ్యంలో భావ విర్దుష్టము. పద్యరచన సరళంగా సంప్రదాయ ధోరణిలో సాగిపోతున్నది. ఈ క్రింది పద్యాన్ని బట్టి వీరి ఉత్తమ రచనాధోరణి గ్రహించవచ్చును.

"పులకితయైన పృథ్వి
యరపూచిన పూవుల తేనెవన్నెలన్
గలకలలాడు వేకువ
వికాస విభూషితమై, యుషస్సుతో

ల్గొలిత సువర్ణ రేఖలను
    దోచెడి కూయపు కైతనేయపై
యలరెడు తల్లి ప్రేమ
    వరయుం గలవారలు ధన్యులీధరన్!

---

# గ్రంథ స్వీకృతి

## శ్రీ రామకృష్ణ ఉవాచ

అనువాదకులు : శ్రీరాం వేంకట భుజంగరాయ శర్మ, కందుకూరి మల్లికార్జునంగార్లు. ప్రతులకు : శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు. మదరాసు-4. వెల ఆరుఅణాలు.

ఇది 'Thus spake Sri Ramakrishna' అనే ఆంగ్ల గ్రంథానికి ఆంధ్రానువాదము. అనువాదకులీ చిన్న పుస్తకంలో రామకృష్ణసూక్తులన్నీ అనువదించారు.

అయితే 'భగవంతుడు నీవాడే; నీవతనిని బలాత్కరింపవచ్చును' లాంటి చెవికి కటువైన అనువాదాలు ఒకటి రెండుచోట్ల కనిపిస్తున్నాయి. వీటిని ముందు ప్రచురణలో సర్దుకోగలరని ఆశిస్తున్నాము.

పుస్తకాకారము, ముద్రణ చాలా చక్కగా ఉన్నాయి.

---

### సంపత్తిదానము

ఆచార్య వినోబాభావే, అనువాదకుడు: ఉప్పుత్తుల-శేషగిరిరావు. ప్రచురణ: హైదరాబాదు. భూదాన యజ్ఞ సమితి. వెల : రెండణాలు.

ఇదిన్నీ భూదానోద్యమానికి సంబంధించిన పుస్తకమే. అయితే, ఇలాంటి వేరే దిగువ పుస్తకంలో కేవలం భూదానసమస్యకు సంబంధించిన సమస్యలు చర్చిస్తే దీనిలో అన్ని విధాలయిన సంపత్తిదానానికీ సంబంధించిన సమస్యలనుగురించిన చర్చ జరిగింది.

కమ్యూనిజంద్వారా కాక మరొక మార్గంలో సాంఘికసమస్యలు సాధించాలనుకునేవారి సిద్ధాంతాలన్నీ సంక్షిప్తస్వరూపంలో ఈ రెండు పుస్తకాలవల్ల తెలుసుకోవచ్చును.



### శ్రీమద్భగవద్గీత

[బుర్రకథ]

వారణాసి వేంకట నారాయణశాస్త్రి, గుడివాడ కృష్ణాజిల్లా.

ఈ రచయితకు బుర్రకథలు వ్రాయడంలో బాగా చెయ్యి తిరిగింది. ప్రచారసాధనమైన ఈధోరణి వీరి బుర్రకథలో స్పష్టంగా కనిపిస్తున్నది.

---

### భూదానోద్యమము

రచన: కృష్ణదాస్ జాజూ. అనువాదం: చుండి జగన్నాథం. ప్రకాశకులు: భూదానసమితి. గాంధి భవన్. నాంపల్లి హైదరాబాదు. దక్కను. వెల: రెండణాలు.

ఇది భూదానోద్యమానికి సంబంధించిన చిన్న పుస్తకము. రచయిత దీనిలో గాంధీజీ, వినోబాభావే మొదలైనవారి ఉపన్యాసాలు, సిద్ధాంతాలు సంగ్రహంగా వివరించారు.

---

### గోదావరి వరద

[ఖండకావ్యము]

తిమ్మన వెంకటేశ్వరరావు ప్రతులకు: గ్రంథకర్త. పెడన కృష్ణాజిల్లా. వెల. నాలుగు అణాలు.

ఇది గోదావరివరదవల్ల కడగండ్లపాలైన వారి ఇక్కట్టులు వర్ణించే పద్యకావ్యం.

పద్య రచన అంతా పాతధోరణిలోనే నడిచిపోతున్నది. అయితే పద్యాలలో భావమాత్రం విస్పష్టంగా ఉన్నది.



---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.